# శ్రీమద్రామాయణములో

# ఆంధ్రాయణము

అను

## ఆంధ్ర జనపద రామాయణము



రచయిత

స్వర్ణ రాజ హనుమంతరావు ఎం.ఏ



# శ్రీ మద్రామాయణములో ఆంధ్రాయణము

అను

# ఆంధ్ర జనపథ రామాయణము


నాట్యావధాన సరస్వతి

శ్రీ స్వర్ణ రాజహనుమంతరావు, M.A






శ్రీ శారదా సాహితీ సంసద్

21/452-4 భాస్కరపురం - 3వ రోడ్డు

మచిలీపట్టణము - 521 001.

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు



## శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి

సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం

# ఆశీర్వాద శ్రీముఖము

శ్రీరామునితో ఆంధ్రదేశ చరిత్ర పెనవేసుకొని ఉంది. రంగనాథ రామాయణము నుండి ఇటీవలి విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షము వరకు ఎన్నో రామాత్మక గ్రంథాలు తెలుగులో వచ్చినవి. రచయితయైన ప్రతివాడు తన జీవితంలో రాముని గూర్చి వ్రాయక పోతే ఆ వ్యక్తి జీవితం గాని, రచనగాని పరిపూర్ణము కాదని ఒక విశ్వాసము ఈ దేశములో పురాతన కాలమునుండి ఉంది. ఇక ఈ గ్రంథ రచయిత శ్రీ స్వర్ణ రాజ హనుమంతరావు ఎన్నుకొన్న పద్ధతి చాలా విలక్షణమైనది. ఆంధ్రావనిలో సీతారామలక్ష్మణులు ఎక్కడెక్కడ అడుగుపెట్టారో, ఎక్కడ సంచరించారో ఆ ప్రదేశాలనన్నింటిని ఒక అనుక్రమణికగా కూర్చి ఆయా విశేషాలనన్నింటిని చక్కగా విశ్లేషించారు.

ఆ స్థలాలను రచయిత రెండు భాగాలుగా విభజించారు. రావణ వధకు పూర్వము చూచిన ప్రదేశాలు- వధానంతరము సంచరించిన ప్రదేశాలు. కథా గమనాన్ని బట్టి ఈ విభాగము చెయ్యటానికి హేతుబద్ధమైన మార్గాన్ని అనుసరించారు. ఏయే ప్రదేశాలను ఎప్పుడు రాముడు చూడటం జరిగిందో,ఆ వివరాలను గ్రంథంలో చదివి తెలుసుకోవచ్చు. వాటిని వివరించి ఒక విషయ సూచికగా ఇవ్వటం నా పని కాదు. ఇన్ని విషయాలను సేకరించటానికి బహుగ్రంథ పరిశీలన చేసి, కొన్ని స్వయంగా వెళ్ళి సదర్శించి - ఎలాగైతేనేం ఒక అద్భుతమైన గ్రంథాన్ని తెలుగువారికి అందిం చారు హనుమంతరావు గారు. సీతను వెదకటానికి ఆనాడు హనుమంతుడెంత కష్ట పడినాడో ఈ విషయసేకరణకు ఈ హనుమంతరావు అంత కష్టపడినాడంటె అది అసత్యోక్తి కాదు. అందువల్ల ప్రత్యేకమైన అభిమానపూర్వకమైన ఆశీస్సులను ఇస్తున్నాను.

ఈ గ్రంథము సరిగ్గా నేను అయోధ్యకు బయలుదేరబోతుండగా వచ్చింది. చదివిన వెంటనే యాత్రకు వెళ్లటం వల్ల ఆశీస్సులు పంపలేకపోయినాను. అక్కడ రామజన్మ భూమిలో పరిస్థితులు చూచిన తర్వాత హిందూజాతి ఎంతగా అవమానానాకి గురి అవుతున్నదో కళ్లకు కట్టినట్లు

కనిపించింది. దిక్కూ మొక్కూలేని రామ జన్మ భూమి - సరిగా పూజకు నోచుకోని శ్రీరాముడు, నిత్యార్చనలు లేక పాడుపడిపోయిన దేవాలయాలు - రక్షణ పేరుతో కోట్లరూపాయలు సైన్యం కోసం ఖర్చుపెడుతున్న కేంద్ర ప్రభుత్వం అక్కడ ఇబ్బంది కలిగిస్తున్నది హిందూవులకు. వీళ్లను రామపూజ చెయ్యకుండా నిరోధించటానికే అక్కడ సైనికుల కాపలా ! ఈ దారుణ స్థితి ఎప్పటికి తొలగుతుందో సీతాదేవి పూజించిన దేవ కాళీమందిరములో యజ్ఞము చెయ్యటం కొంత సంతృప్తి నిచ్చింది. అది వేరే విషయం!

అక్కడనుండి వచ్చిన తరువాత ఈ రోజు రచయిత స్వయంగా రావటంవల్ల దీవెనలు వ్రాద్దామని మొదలు పెడుతుండగా ఒక దినపత్రిక సంపాదకీయంలో శ్రీలంకలో సీతారాములు సంచరించిన చోట్లు చూడటానికి ఆ ప్రభుత్వం వారు చేసిన ఏర్పాట్లు గురించి చదివాను. రావణుడు సీతను ఉంచిన చోట్లు, రావణుని చంపిన తరువాత రాముడు సంచరించిన చోట్లు పట్టిక ఇచ్చారు. బంధారవేల,ఎల్లా, సీతాఎలియో, క్యాండీ, కురునేగాలా, వారియాపోలా, అనూరాధాపురా, వెలిగామ, ధీరంగువేలా మొదలైన ప్రదేశాలు సీతారాముల చరిత్ర కథానిలయాలు. నేను శ్రీలంకలో యజ్ఞం చేయించటానికి వెళ్లినప్పుడు వీటిలో కొన్ని చూడటం జరిగింది.

ఈ విధంగా రాముని సంస్మరణతో ఈ నెలంతా పవిత్రీకృతమైనదని భావిస్తున్నాను. ఎద్దైనా మంచి రచన చేసి తెలుగువారికి అపూర్వ సేవ చేసినందుకు రచయితను ఆశీర్వదిస్తూ శ్రీరామ చంద్రుడు వారికి అభీష్టసిద్ధిని ప్రసాదించాలని భావిస్తున్నాను.

నారాయణ స్మరణతో...

**సిద్ధేశ్వరానంద భారతీ స్వామి**

**23-4-2006**



# ప్రాంజలి

శ్రీమద్రామాయణంలో ఆంధ్రాయణము అనే ఈ గ్రంధాన్ని రూపొందించటం కేవలము పరమేశ్వర దివ్యానుగ్రహంగా నేను భావిస్తున్నాను. ఆగష్టు 2003 లో పుష్కరాల సందర్భంగా పవిత్ర గోదావరిలో స్నానానికి కొవ్వూరు వెళ్లి తిరిగి వస్తున్న సమయంలో ఆ శ్రీరాముడు ఎందుకో నాకీ ఆలోచన కలుగజేశాడు. ఆ స్ఫూర్తితో ఈ ప్రయత్నాన్ని కొనసాగించాను.

మానవునిగా జన్మిస్తే భగవంతుడైనా కష్టాలుఅనుభవింపక తప్పదు కామోసు! అగస్త్యుని సూచనపై సీతారాములు ఆంధ్ర దేశములోని గోదావరీ పరిసర ప్రాంతమైన భద్రాచల సమీపానికి వచ్చి పంచవటిలో పర్ణశాల నిర్మించుకున్నారు. ఒక మూడు సంవత్సరాలక్కడ కాలము వెళ్లబుచ్చారు. అయితే అన్నిరోజులు అక్కడే ఉన్నారా?– అంటే పర్ణశాల కేంద్రస్థానంగా పెట్టుకొని వారు చాల ప్రదేశాలలో నడయాడినట్ల నిపిస్తుంది. దారి–డొంకా లేని ఆరోజుల్లో, కొన్ని చోట్ల త్రాగేందుకు నీళ్లు కూడ అందుబాటులో లేని ప్రదేశాలలో జనపదాలు అంతగా ఏర్పడని ప్రాంతాలలో, కేవలం ముళ్లబాటలో ఎలా పయనించారో ఊహింపలేవము " సీతారాములీదారి వెంట వెళ్లారు, సీతారాములీఊళ్లో కొన్నాళ్లు ఉన్నారు, సీతారాములీగట్టుమీదున్నారు, ఈ చెట్టునీడ"నున్నారని చెప్పుకొనే ప్రదేశాలెన్నో ఉన్నవి. అయితే ఏ ప్రాంతపు కథ ఆ ప్రాంతములోనే వినిపిస్తున్నది. అలా సీతారాములు నడయాడిన తెలుగు నేలను అడుగడుగునా రామపాద ముద్రాంకితమైన ఈ తెలుగు భూమిని చేరువగా చూస్తున్న ప్పుడు మనకు శ్రీరామ పాదాల స్పర్శానుభూతి కలుగుతుంది. వారి పాద ముద్రలు మనకు ఈనాడు కనిపించవు. కాని ఆ పవిత్ర సందర్శనా స్ఫూర్తి కలుగుతుంది. అలాంటి చోట్లకు వెళితే మనకు తనువు పులకరిస్తుంది. మనస్సు ఆనందపారవశ్యం చెందుతుంది.

మానవ రూపంలో అవతరించిన భగవద్రూపము శ్రీరాముడు. నీతినియమాలకు, సంప్రదాయానికి కట్టుబడి నిలచినవాడాయన. భారతీయ ధర్మం అందరికీ అనుసరణీయమని నోటితో చెప్పకుండా ఆచరించి చూపిన వాడాయన! దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసిన వాడాయన! సమష్టికుటుంబ ధర్మం, దాంపత్య ధర్మం ఎలాపాటించాలో చెప్పటం కాక చేసి చూపినవాడాయన! ఆ పురుషోత్తమునికి ఆంధ్రదేశంతో గల సంబంధం నా మనస్సుపై ఏదో చెరగని ముద్రవేసింది. ఆ విధంగా ఏదో దివ్యస్ఫూర్తి నన్నీ రచనకు పురికల్పింది. శ్రీరాముణ్ణి ఆరాధించినవారెందరో ఉన్నారు. ఆంధ్ర భూమి మీద ఆయన పాద ముద్రను మాత్రమే కాదు, ఆయన దివ్య వ్యక్తిత్వపుముద్ర ఎందరో ఆంధ్రులపైన పడి చెదరిపోకుండా నిలిచింది. అది భక్తి అనాలో, మనల్ని తన్మయులనుచేస్తున్న రామరసామృత వాహిని అనాలో తెలియదు. అది నిరంతరము మన గుండెల నిండుగా ఉంటూనే ఉంది. ఆంధ్ర దేశంలోని అనేక జనపదాలలో, అనేక

జనపథాల వెంటనంటి ఉన్న ఆయన పవిత్ర చరిత్ర -రామ 'అయన' చరిత్ర కనిపిస్తూనే ఉంది, వినిపిస్తూనే ఉంది. దానిని మనము అందరమూ కలసి దర్శించి శ్రవణానందముగా వింటూ ఆనందిద్దామన్న సంకల్పముతోనే ఆ సందర్శనను మీ ముందుంచేటందుకు ఈ ప్రయత్నం చేశాను.

సీతారాములు నడయాడిన ఈ తెలుగు నేలమీది విశేషాలు, వాని పూర్వాపరాలు నాకు చేతనైన విధంగా, నాకు అందిన సమాచారం ఆధారంగా చేసికొని, నా కళ్లకు కాక – నా ఆత్మకు ఆయన సందర్శన భాగ్యంమెంత వరకు కలిగిందో అంతవరకు అక్షరబద్ధంచేసి గ్రంథంగా రూపొందించి మీ ముందుంచుతున్నాను. అవకాశమున్న వారు ఈ గ్రంథాన్ని ఒకసారి చదవండి. ఈ రచన మీ మనస్సుకు సంతోషము కలిగించితే నేను ధన్యతనొందినట్లు భావిస్తాను.

ఎందరో మహానుభావులు! ఈ నాప్రయత్నాన్ని విని ప్రసంగంగా చేయించి విని ఆనందించిన సన్నివేశాలు నాకు సంతృప్తి నిచ్చాయి. ఆ స్ఫూర్తితోనే ఈ గ్రంథ ముద్రణకు పూనుకున్నాను. ఈ గ్రంథం వెలువడటంలో ఎందరివో సహాయ సహకారాలు న్నవి. వారందరికీ నా ధన్యవాదాలు సమర్పించుకుంటున్నాను. 2006 లోనే ఈ గ్రంథాన్ని ప్రచురించాలని శ్రీకుర్తాళం పీఠాధిపతుల ఆశీస్సులర్థించాను. జగద్గురువులు శ్రీ సిద్ధేశ్వరానంద భారతీ స్వామివారు వారి ఆశీర్వాదశ్రీముఖాన్ని అందించారు. అయితే గ్రంథముద్రణ కొంతకాల మాలస్యమైంది. వారి ఆశీస్సులకు నా నమస్కారములు తెలుపుకుంటున్నాను.

శ్రీరాముడు దర్శించిన ప్రదేశాలింకెన్నో ఉన్నవి. అన్నింటిని నేను సంగ్రహపరచ గలిగానని చెప్పలేను. నా ప్రయత్నము మాత్రమే నేను చేశాను. ఆ ప్రయత్న ఫలితాన్ని మీకందరికి అందించి ఆ ఆనందాన్ని నేను కూడ మీ అందరితో కలసి పంచుకోవాలనే తపనతోనే ఈ సాక్షర సంగ్రహరూపానికి గ్రంథరూపమైన ఒక ఆకారం కల్పించటం. విద్వన్మణులు ఇందులో తప్పులుంటే మన్నించండి. చెప్పదలచిన విషయాలున్నాయని పిస్తే సాఠక పండిత మహాశయులు నాకందించండి.

సహృదయ ఆంధ్ర పాఠక లోకానికి నమస్కరిస్తూ ఆ సీతారాములు మన మనసుల్లో కొలువుదీరి నిరంతరం నిలిచి ఉందురు గాక అని ఆకాంక్షిస్తు ఈ "ముందు మాట"ల్ని ముగిస్తున్నాను.



భవదీయుడు,
**గ్రంథకర్త**





# శ్రీ మద్రామాయణములో ఆంధ్రాయణము

అను

# ఆంధ్ర జనపద రామాయణము

అభివృద్ధి చెందుతున్న శాస్త్ర సాంకేతిక యుగంలో ఉన్న మనం శ్రీ మద్రామాయణము వంటి పాత కథల్ని, శ్రీరాముని వంటి పురాణ పురుషుల గురించి తెలుసుకోవాలా? ఆ అవసరం ఉందా అనే ప్రశ్న వేసుకొంటే, ఆ ప్రశ్నకు సమాధానం దొరకటం కొంత కష్టం. కాని కొంచెం నెమ్మదిగా ఆలోచిస్తే ఒక మహోన్నత పురుషుణ్ణి గురించి తెలుసుకోవటం ఒక విధంగా సత్యాన్వేషణే. పురాణాల్లో ఎన్నో విషయాలు చెప్పబడ్డాయి. వానిని ఇప్పుడు మనం ఐతిహాసిక దృక్పథంతో చూస్తున్నాము. వాని చారిత్రకనేపథ్యాన్ని పరిశీలిస్తున్నాము. చరిత్ర దేనిని గురించి చెబుతుంది? తరతరాలుగా మన గురించి, మనము బ్రతికిన తీరుగురించి చెబుతుంది. అవన్నీ గత కాలంలో జరిగిన సంఘటనల కూర్పు. కాలగతిలో ఎన్నో కలసిపోయాయి. కొందరి విషయంలో మాత్రం కొన్ని మిగిలిఉన్నవి. శ్రీరాముని విషయంలోనూ అలాంటి చెఱగని తీపిగుర్తులు కొన్ని మిగిలి ఉన్నాయి. అలాంటి వానిలో ఆంధ్రదేశానికి సంబంధించిన వాటిని మనం అక్షరాల గవాక్షాల ద్వారా వీలైనంత వరకు చూచే ప్రయత్నం చేద్దాం. అయితే ఇవి శ్రీమద్రామాయణంలో వ్రాసి పెట్టి ఉన్నాయా? అంటే సమాధానం పూర్తిగారాదు.

అసలు రామాయణమంటే ఏమిటి? అదేమీ శృంగార కావ్యం కాదు. అదేమి చెబుతోంది? శ్రీరామ అయనాన్ని గురించి చెబుతోంది. కనుక అది రామాయణమనే పేరున వెలువడింది. అయనమంటే గమనము, నడక, నడిచే విధము, త్రోవ, మార్గము స్థానము అని నిఘంటువులు చెప్పే అర్థము. మనం ఉత్తరాయణం, దక్షిణాయణమని వింటూ ఉంటాము. అది సూర్యుని యొక్క ఉత్తర దక్షిణాల గమనం గురించి చెప్పేమాట. దీని వెనుక ఖగోళ శాస్త్రముంది. అది ఆయన నడకను గురించి శాస్త్రీయంగా వివరిస్తుంది.

మరి రామాయణం! వాల్మీకి ఆ గ్రంథానికి ఆ పేరు ఎందుకు పెట్టాడంటే శ్రీరామ అయన విశేషాలన్నింటిని తెలిపేది కనుక రామాయణమనే పేరు పెట్టాడని అనుకోవలసి వస్తుంది. శ్రీరాముని యొక్క గమనము, రాముని యొక్క మార్గ విశేషాలను గురించి, ఆయన నిలచిన స్థానాలను గురించి, ఆయన నడక తీరు - అంటే జీవన విధానము గురించి తెలియచెప్పటమే వాల్మీకి ఉద్దేశమనుకోవాలి. ఇప్పటికి శ్రీరాముని పరిపాలనా కాలం జరిగి యుగాలు గడచింది. ఒక కోటి ఎనుబది ఒక్క లక్షల నలుబది తొమ్మిది వేల నూట ఏడు సంవత్సరాలు గడచిందని ఒక లెక్క. ఇప్పుడు జరుగుతున్నది కాల గణనములో ఆరుగురు మనువుల తరువాత ఏడవ మనువు అయిన వైవస్వతమన్వంతర కాలము. కలియుగము ప్రారంభమై ఇప్పటికి 5108 సంవత్సరాలు.

అసలు ప్రపంచం పుట్టి 1370 కోట్ల సంవత్సరాలు గడచిందని శాస్త్రజ్ఞులంటున్నారు. కాదు 10 కోట్ల సంవత్సరాలే అనే వాదన కూడ ఉంది. కాని భారతీయులు సృష్టి ప్రారంభమై 195 కోట్ల 58 లక్షల 85వేల 108 సంవత్సరాలైందని ఖగోళ శాస్త్రాధారంగా లెక్క వేసి చూపారు. ఈనాటి భారతీయ పంచాంగాలలో ఈ లెక్క[1] మనము చూస్తునే ఉంటాము. ఆ లెక్కలతో పోలిస్తే ఒక కోటి 81 లక్షల సంవత్సరాల నాడు రామాయణం జరిగి ఉంటుందనుకోవటంలో ఆశ్చర్యం లేదు. అయితే ఆనాటి గుర్తులు ఇంకా నిలచి ఉన్నాయంటేనే ఆశ్చర్యంగా ఉంటుంది. కొందరు నమ్మలేము - అని అనుకోవచ్చు. అయినా వాటిని తెలుసుకునే ప్రయత్నం చేద్దాము. ఈ రూపొందిస్తున్న రచనలో ఆ ప్రయత్నము ఎంతవరకు అంటే - శ్రీరాముని ఆంధ్రాయణము వరకు మాత్రమే ఈ ప్రయత్న ముఖ్యోద్దేశము.

ఆంధ్రదేశము " అడుగడుగునా శ్రీరామ పాదాంకితమైన దేశం".

"కట్టె, కొట్టె, తెచ్చె" అని రామాయణం మొత్తాన్ని మూడు ముక్కల్లో చెప్పెయ్యవచ్చు. కాని వాల్మీకి లక్ష శ్లోక గ్రంథం వ్రాశాడట. కాని అది మనకు పూర్తిగా లభ్యం కావటంలేదు. ఇప్పుడు మనకు లభిస్తున్నది 24000 శ్లోకాలున్న గ్రంథం మాత్రమే. సంస్కృతంలో వాల్మీకి కాక వసిష్ఠాదులు వ్రాసినవి మొత్తం 108 రామాయణాలున్నాయట. అయినా లభించినది పెద్ద గ్రంథమే. ఇక తెలుగు విషయానికి వస్తే తెలుగులో ఎన్నో రామాయణాలున్నాయి[2]. అన్నింటి కథ ఒకటే కదా! మరి ఎందుకంత మంది వ్రాశారు? జగదభిరాముని మీదనున్న అభిమానమే!

---

1 చూడుము అనుబంధము (1)పుట. 92, 2 చూడుము అనుబంధము (2) పుట. 96.

ఈ సందర్భంలో మనమొక విషయాన్ని గుర్తుకు తెచ్చుకుందాము. విశ్వనాధ వారు చిన్నతనంలో ఏవో పద్యాలు వ్రాస్తుంటే తం[illegible] శోభనాద్రిగారన్న మాటలు గుర్తు తెచ్చుకోవాలి. "వ్రాసిన రామచంద్రు కథ వ్రా[illegible]తవంచనిపించుకో" అని కుమారునికి హితవు చెప్పారు. అలాగే విశ్వనాథ వారు కూడ "మఱలనిదేల రామాయణంబన్నచో....." అనే ప్రశ్న వేసికొని "తలచిన రామునే తలచెదనేనును, నా భక్తి రచనలునావిగాన" అని చెబుతూ తాను కూడ రామాయణము వ్రాశారు. ఆ విధంగానే ఎందరో రామాయణం వ్రాశారు. కంచర్ల గోపన్న రామదాసై రామదాస కీర్తనలు వ్రాశాడు. చాల కాలం క్రితమే అన్నమాచార్యుడు జో అచ్యుతానంద! జోజో ముకుంద! లాలి పరమానంద! రామగోవింద" అని రాముణ్ణి తెలుగు పాపణ్ణి చేసి జోల పాడాడు. త్యాగరాజస్వామి రామ నామాంకితముగ 24000 కీర్తనలు వ్రాశాడు. సంగీతంతో "ఈ జగమంతా రామమయం" చేశాడు. తూము నరసింహదాసు, పువ్వాడ శ్రీరాములు వంటి వారెందరో శ్రీరాముణ్ణి కీర్తించారు, ప్రస్తుతించారు, జోల పాడారు. దాశరధీ కరుణాపయోనిధీ అంటూ ఎన్నో శతకాలు వచ్చాయి. ఆ విధంగా ఆంధ్రదేశం మీద తెలుగు ప్రజల మీద శ్రీరాముని ముద్ర చెఱగనిది.

**తెలుగు పలుకుబడుల్లో రామశబ్దం :**

ఆంధ్రుల హృదయాల మీద శ్రీరాముడెంతటి గట్టి ముద్రవేశాడో నిత్యం మనం మాట్లాడుకునే మాటల్లోనే తెలుస్తుంది. ఏదైనా కష్టంగలిగితే – "రామ రామ! ఎంత కష్టం! ఎంత కష్టం!" అంటారు. ఏదైనా జరగరానిది జరిగితే – "రామ రామ! ఎంత పని జరిగింది" – అంటారు.

"అన్నమో రామచంద్రా అని కోట్లాదిమంది ఏడుస్తుంటే...." అంటున్నాము.

"ఇంతవరకు కాగితమ్మీద శ్రీరామ పెట్టలేదు – ఇక అసలు పని మొదలయ్యేదెప్పుడు..?"

"రామ అంటే బూతుమాటయిందే, ఇక మాట్లాడేదెట్టా..." అంటున్నాము.

"నువ్వు శ్రీరామచంద్రుడి వనుకున్నా! ఇలాంటి వాడివా నువ్వు?" అని కొడుకును మందలిస్తుంది ఒక తల్లి!

"ఏదో..... రామరాజ్యం వస్తుందని సంబరబడిపోయాము – ఇదిగో ఈ పాలన ఇట్లా తగలడింది"

"ఇదీ లక్ష్మణరేఖ! దీనిని దాటవద్దు...."

"అలో లక్ష్మణా..... అని కేకలు పెట్టినా వినేవాడెవడు?"

"స్వర్ణ సీతను కాను నేను.... మాట్లాడకుండా మౌనం వహించటానికి" అని తనకూ తన సొంత అభిప్రాయాలున్నాయని చెబుతుంది ఈనాటి ఇల్లాలు!

"అబ్బ ఎంత బాగుంటాడో! రామ చక్కనోడు....." అంటూ ఉంటారు.

"శ్రీరామ రక్ష..... సర్వజగద్రక్ష" అంటారు.

"నా జోలికి వస్తే రాబందులాగ (రామ బంధువు జటాయువు లాగ) పొడుచుకు తింటాను" అని జాగ్రత్తపరచే హెచ్చరిక వినిపిస్తుంది.

"చిన్ని నా పొట్టకు శ్రీరామ రక్ష " అనుకుంటాడు వాడు అని స్వార్ధ పరుణ్ణి గురించి చెప్పుకుంటాము.

"ఈ జగమంతా రామమయం...."

"సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మా తండ్రి...." అని నిర్దుష్టంగా చెప్పాడు త్యాగయ్య

వాల్మీకి రామాయణంలో విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్ధము రామ లక్ష్మణులను తన వెంటతీసికొని వెడుతూ మార్గమధ్యంలో రాత్రి వేళ నిద్రించిన రాముణ్ణి మేల్కొలుపుతూ విశ్వామిత్రుడు చెప్పిన సుప్రభాత శ్లోకాలతోనే శ్రీ వెంకటేశ్వరుణ్ణి కూడ సుప్రభాత వేళ సేవచేయటానికి మేల్కొల్పటం జరుగుతోంది.

"కౌసల్యా సుప్రజరామ!..." అని ప్రారంభమయ్యే (బాలకాండ 35వ సర్గ ప్రారంభముల్లోని) ఆశ్లోకాలు ఎందుకు శ్రీవెంకటేశ్వరునికి అనుసంధిం పబడ్డాయో తెలియదు. కాని ఆశ్లోకాలతోనే సుప్రభాత సేవ జరగటం అను శ్రుతంగా వస్తున్న ఆచారము.

"సీతమ్మ వారి జడగంటపూలు" అని చూస్తుంటాము. అడవుల్లో దొరికిన పూలు పెట్టుకొని వాటికి సీతమ్మ కల్పించిన గౌరవమైన పేరు అది! ఆ పేరుతోనే ఈ నాటికి కూడ పుణ్య స్త్రీలు దొడ్లల్లో పెంచుకొని తలల్లో పెట్టుకుంటున్నారు. అట్లాంటివే "సీతమ్మ వారి పుస్తెల పేరు"తో పిలువబడుతున్నవి కూడ! అవి ఒరిస్సా రాష్ట్రంలో జయపూర్ దగ్గరున్న చిత్తాలమ్మ వారి గుడి ప్రాంతంలో కనిపిస్తాయి. చిత్తాలమ్మ అంటే వేరెవరోకాదు సీతయే. ఆ ప్రాంతపు వారి మాటల్లో ఆమె చిత్తాలమ్మ అయింది.

ఇంతేకాదు, సీతారాములు ఆంధ్ర దేశపు ప్రకృతిలో, జనజీవనంలో ఎంతగా కలసి పోయారంటే పక్షులు, అల్ప ప్రాణులపై కూడ వారి ముద్రపడి భద్రంగా ఉంది. అల్పప్రాణులలో రెండు మూడు రకాల చిలకలున్నాయి. అవి వడ్ల చిలుకలు, సీతాకోక చిలుకలు, రామచిలుకలు మొదలైనవి. సీతమ్మ వారు కట్టుకున్న చీరలోని 'డిజైను' వలె వన్నెలు చిమ్ముతూ ఉండే ఒక అల్పప్రాణి రూపురేకల్ని చూచి ఆంధ్రులు దానికి సీతాకోక చిలుక అని పేరు పెట్టారు. అంటే సీతమ్మ ఆనాడు కట్టుకున్న చీరకున్న రంగు రంగుల రూపము ఆ అల్పప్రాణి రెక్కలకుండటంతో ఈనాటికీ ఆపేరే స్థిరంగా నిలచిఉంది.

అలాగే ఒక పక్షి రామచిలుకయింది. ఎర్రని ముక్కుతో, ఆకుపచ్చ రంగులో ఉండి పొడిపొడిగా – అప్పుడే బుడి బుడి మాటలు వస్తున్న పిల్లల మాటల వలె ధ్వని చేస్తూ ఉండే ఆ పక్షి రాముని పేరు మీద రామచిలుకై "ఎంచక్కా చిలుక పలుకులు పలుకుతోందో లేదా పలుకుతున్నాడో చూడు" అని పిల్లల గొంతుకు ఆ చిలక గొంతు ఉపమానమై నిలచే స్థాయికి వచ్చిందా రామచిలుక. అంతే కాదు ఆ రామచిలుక జోస్యం కూడ చెబుతుంది.

మానవ సహజంగా ఎన్నో పండ్లు తింటూ ఉంటాము. ఆ పండ్ల చెట్లకు ప్రతి దానికీ ఏదో ఒక పేరుండాలి గదా! కాని ఆంధ్ర జనులు రెండు పండ్లకు సీతారాముల పేర్లు పెట్టుకున్నారు. అవి సీతా ఫలాలు, రామాఫలాలు! పండ్లకున్న రుచి కంటే ఆ పేర్లలోనే ఎక్కువ రుచి ఉందేమో! సీతా ఫలాలెంత ఎక్కువ ఇష్టపడతారంటే – మనకందరికీ తెలిసిందే – అచ్చంగా సీతాఫలాల పేరు మీద ఒక 'మార్కెట్' ఉంది సికింద్రాబాద్‌లో – అదే "సీతాఫలమండీ"!. సీతారాములు అరణ్యవాసంలో ఉన్నప్పుడు వారి పయనంలో బాగా ఆకలి వేసి అలసిపోయి ఇద్దరూ చేరొక చెట్టుక్రింద కూర్చున్నారట. ఆ సమయంలో ఇద్దరి చేతులలోను ఒక్కొక్క పండు రాలిందట – సీత చేతిలో పడినది సీతాఫలమని, రాముడుచేతిలో పడింది రామాఫలమని తరువాత వాడుకలోకి వచ్చాయట. అలాగే కూరగాయలలో కూడా రామములగ అనే పేరుతో కూడ ఒక కూరగాయ ఉంది. ఆంగ్లభాషా ప్రభావంతో అది 'టమాటో' అయినా రామములగ అనేది దాని అసలు పేరు. రామబాణము అనే పేరుతో ఔషధంగా ఉపయోగించే మొక్క ఉంది. రామసాగరాలు, సీతాసాగరాలు అనే పేరుతో ధాన్యానికి మనవాళ్ళు పేర్లు పెట్టుకున్నారు. గోదావరి జిల్లా కడియం నర్సరీలో సీతారామలక్ష్మణ హనుమంతుని పేర్లతో ఫల పుష్ప వృక్షాలు లేక మొక్కలున్నవి. అందులో కొన్ని కేవలము శ్రీరామ నవమి కాలానికి పుష్పిస్తాయట. ఇక సంవత్సరములో మిగతా కాలములో పూలు పూయవట.

ఇక నవరసాలలో భక్తికి స్థానం లేదు. దాన్ని భావంగానే అలంకారికులు పరిగణించారు గాని, భక్తి రసంస్థాయికి ఎదిగింది. "పిబరే రామరసమ్....." అంటాడు. సదా శివ బ్రహ్మేంద్రస్వామి అనే ప్రముఖ కవి, ఆవిధంగానే రామరసం గుండెల నుండి నిస్యందమయ్యేది మాత్రమే కాక రామరసం వాహినియై ఆంధ్ర దేశమంతటా మాత్రమే కాదు ప్రపంచంలోని ఎన్నో దేశాల్లో ప్రవహిస్తూ ఉంది.

## అవతారమూర్తి : శ్రీరాముడు

ఈ విధంగా తెలుగు సంస్కృతిలో శ్రీరాముడు, రామాయణ సంస్కృతి అంతర్లీనంగా దాక్కొని ఉంది. ఇదంతా ఆనాటినుండి ఈనాటి వరకూ నిరంతరంగా సాగుతూ ఉండటానికి శ్రీరాముని అయనపు ముద్ర చెఱపరానిదై ఆంధ్ర దేశపు నాలుగు చెఱగులలోను నిలచి ఉండబట్టే! అవతారాల్లో పరిపూర్ణ మానవావతారము శ్రీరామునిదే! మత్స్య, కూర్మ, వరాహ, నారసింహావతారాలు కేవలము ఏదో ఒక ప్రయోజనాన్ని సాధించటానికే పరిమితమైనాయి. వామ నావతారము అంతే. పరశురామావతారము మాత్రము తామస రాజసాలను అణగద్రొక్కటానికే జరిగినా ఆ అవతారము సాత్త్వికత లోపించినది. ఇక రామవతారానికి వద్దాం!

వామనుడు కొన్నాళ్లు నిలచిన ఆశ్రమంలోనే విశ్వామిత్రుడు తపోదీక్ష నిర్వహించాడు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయిన తరువాత యుద్ధాదులు చేయాలని అనుకోలేదు. ఆయన ఒక యజ్ఞం చేయదలచాడు. దానికి మారీచ సుబాహులు విధ్వంసకాండ సృష్టిస్తున్నారు. ఆ విధ్వంసకాండ నుండి రక్షణ కోసం శ్రీరాముణ్ణి తీసికొని రావాలని నిర్ణయించుకొని తన ఆశ్రమం నుండి బయలుదేరి అయోధ్యకు వెళ్ళాడు.

అప్పుడు రాముడికి 12 ఏండ్ల వయస్సు. పెళ్ళి చేయాలనుకుంటున్నాడు దశరధుడు. సరిగ్గా ఆ సమయంలో వెళ్లాడు విశ్వామిత్రుడు. దశరధునికి శ్రీరాముని మీద అపారమైన వాత్సల్యము. అందుచేత విశ్వామిత్రునితో తానేవస్తానని అవసరమైతే తన ప్రాణాలిస్తానన్నాడు. విశ్వామిత్రుడు ఒప్పుకుంటే కదా! వసిష్ఠుడు సర్ది చెప్పాడు. రామలక్ష్మణుల్ని తీసికొని విశ్వామిత్రుడు బయలుదేరాడు. ఎక్కడకు, ఏం చెయ్యాలని వారు ప్రశ్నించలేదు. సాయం త్రమయ్యేదాక నడిచారు. ప్రొద్దుగూక వస్తుండగా సరయూనది ఒడ్డున ఇక్కడ ఆగుదామన్నాడు-విశ్వామిత్రుడు. ప్రొద్దుగూకితేనే ప్రయాణమాపటం! అలా నడక సాగిస్తూ ఉండగా 3వ రోజు తాటక ప్రత్యక్షమైంది. దాన్ని చంపుమని చెప్పాడు విశ్వామిత్రుడు. రాముడు సందేహించినా

చివరకు చంపాడు. ఇది గంగానదిని దాటగానే జరిగిన విషయం. దేవతలు ప్రశంసించారు. నాల్గవ రోజు కూడ నడచి విశ్వామిత్రాశ్రమం చేరుకున్నారు. విశ్వామిత్రాశ్రమం ఎక్కడ ఉంది? దండకారణ్యం చాల పెద్ద అరణ్యం. అరణ్యమైనా ఇందులో అసంఖ్యాకమైన ఋష్యాశ్రమాలున్నాయి. అంతకంటే అధిక సంఖ్యలో రాక్షస స్థావరాలున్నాయి. రావణుని సోదరులైన ఖరదూషణాదులు, తాటక వంటి రాక్షస స్త్రీలు, మారీచ సుబాహువుల వంటి రావణ బంధువులు ఈ దండ కారణ్యంలోనే నివాసము.

ఈ దండ కారణ్యానికి ఎల్లలు చూస్తే అదియెంత విస్తృతంగా విస్తరించి ఉందో తెలుస్తుంది. ఈ మహారణ్యానికి ఉత్తరాన కొంతవరకు గంగానది, కొంతవరకు వింధ్య పర్వతాలున్నాయి. పశ్చిమ దిక్కులో కూడ కొంతవరకు (ఉత్తర) వింధ్య పర్వతాలున్నాయి. ఇంకా అత్రి మహర్షి ఆశ్రమము, దక్షిణ వింధ్యము, దక్షిణకోసలము, విదర్భదేశము, దక్షిణాపథము, మలయాద్రి ఉన్నాయి దక్షిణాన ద్రావిడ పాండ్య దేశాలు – అంటే ఈనాటి మదరాసు రాష్ట్రములో కొంత భాగము వరకును; తూర్పున ఉత్కళ, కళింగ ఆంధ్ర చోళ దేశములు – అంటే ఈనాటి ఒరిస్సా, ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలలోని కొంత కొంతమేర వరకు అది విస్తరించి ఉన్నదన్నమాట!

ఇక్కడ నుండి మనం చెప్పుకోబోతున్న విషయాలకు స్థానిక చరిత్రలు, స్థల పురాణాలు, క్షేత్ర మాహాత్మ్యాలే ఆధారము. రామాయణంలో ఆ విషయాలున్నాయా అంటే వాటిని మనం పోల్చుకుని సరిచూచుకోవాలి. వాటి కున్న ఆధారాలు మనం పరిశీలించాలి.

మొదటిసారి శ్రీరాముడు ఆంధ్రదేశానికి విశ్వామిత్రుని యాగసంరక్ష ణార్థము వచ్చాడు. ఆ విశ్వామిత్రాశ్రమము మాచర్లకు సమీపంలోని రెంటచింతల మండలం జెట్టిపాలెం గ్రామానికి 3 కి.మీ దూరాన, కృష్ణానది తీరాన ఉన్నది. అది అంతకుముందు వామనాశ్రమము. ఆ వామనాశ్రమంలోనే విశ్వామిత్రుడు తన తపస్సును సాగించాడు. ఇక్కడ పూర్వము దక్షిణాభిముఖంగా ప్రవహించే కృష్ణానదిని 'శృంగి' అనే మహర్షి తన జడకు కట్టుకొని తరలించటం వలన ఉత్తర దిక్కుకు మారింది. జడకు కట్టుకొని దిక్కు మార్చిన చోటు జటపాలెం, తరువాత జెట్టిపాలెమయిందట. ఇక్కడ విశ్వామిత్రుడు సత్రయాగం చేశాడు. ఆ యాగానికి శ్రీరాముడు ఛత్రశాల నిర్మించాడు. అంటే గొడుగు వలే యాగాన్ని కాపాడే విధంగా

తన అస్త్ర విద్యతో అచ్ఛాదన సృష్టించాడు గనుక అది ఛత్రశాల అయింది. ఆ ఛత్రశాలే తరువాత సత్రశాల అయిందని ఒక విధం గాను, విశ్వామిత్రుడు సత్రయాగం చేసిన స్థలం గనుక, ఆ తరువాత అది సత్రశాలగా మారిందని మరొక విధంగాను చెప్పటం జరుగుతోంది. శ్రీరాముని చేత విశ్వామిత్రుడిక్కడ మల్లేశ్వర లింగాన్ని ప్రతిష్ఠ చేయించాడు. ఇప్పటికీ ఇక్కడ శివరాత్రి మహోత్సవం ఘనంగా జరుగుతోంది. యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం ఇక్కడే వ్రాశాడు.

అయోధ్య నుండి శ్రీరామ లక్ష్మణులు విశ్వామిత్రాశ్రమానికి చేరటానికి ముందే త్రోవలో శ్రీరాముని వలన విశ్వామిత్రాజ్ఞపై తాటక వధ జరిగింది. విశ్వామిత్రుడు యాగమారంభించిన ఆరవ రోజున యాగ భంగం చేయటానికి ప్రయత్నించిన మారీచ సుబాహులలో, మారీచుని శ్రీరాముడు మానవాస్త్రంతో100 ఆమడల దూరన సముద్రంలో పడేటట్లు కొట్టాడు. సుబాహుణ్ణి అతని అను చరుణ్ణి ఆగ్నేయాస్త్రంతో భస్మీపటలం చేశాడు. యజ్ఞం దిగ్విజయంగా ముగిసింది.

మర్నాడు మహర్షులంతా కొలువు దీరిన సమయాన మిథిలానగరంలో జనకుని యజ్ఞమును గురించిన ప్రస్తావన, శివధనుస్సు, సీతా స్వయంవరం గురించిన ప్రస్తావన వచ్చింది. శివధనుస్సు ప్రస్తావన శ్రీరామునిలో ఆసక్తి రేకెత్తించింది - ఎందుకంటే దాన్ని ఎవరూ ఎత్తలేక పోయినట్టు వినిపిస్తోంది గనుక!

విశ్వామిత్రుడు భవిష్యద్దర్శనము కలవాడు గనుక, శ్రీరాముణ్ణి తిన్నగా అయోధ్యకుకాక మిథిలకు బయలుదేరదీశాడు. విశ్వామిత్రుడు తానింత కాలం ఉన్న, తనకు సిద్ధి లభించిన సిద్ధాశ్రమానికి వీడ్కోలు పలికాడు. తాను హిమాల యాలకు తరలి వెళుతున్నానని కూడ ప్రకటించాడు. రామ లక్ష్మణులను తీసి కొని మిథిలకు ప్రయాణమయ్యాడు.

మొదటిరోజు శోణా నది ఒడ్డున విశ్రాంతి తీసికొన్నారు. అది కౌశాంబి! విశ్వామిత్రుని వంశమైన కుశిక వంశానికి ఆధార భూమి. అక్కడ రామ లక్ష్మణులకు విశ్వామిత్రుడు తన కథ కాకుండా మిగతా కుశిక వంశపు కథ చెప్పాడు. రెండవ రోజు గంగాతీరం చేరుకున్నారు. విశ్వామిత్రుడు గంగా వతరణం కథ చెప్పాడు. మూడవ రోజు విశాలానగరం చేరుకొని ఆనాటి విశాలాధీశుడు సుమతి ఆతిథ్యం అందుకున్నారు. విశ్వామిత్రుడు అక్కడకు చేరగానే సాగర మథనంతో ఆరంభించి ఆ కథ చెప్పాడు. నాల్గవరోజు ప్రయా ణంలో వారొక శూన్యంగా ఉన్న ఆశ్రమాన్ని చూచారు. అది గౌతమాశ్రమము. అందులో ప్రవేశించారు. అహల్యాశావ

విమోచనము, అహల్యా గౌతముల పునస్సమాగమము జరిగాయి. ఆ మర్నాడు బయలుదేరి రామ లక్ష్మణులతో విశ్వామిత్రుడు మిథిలానగర ప్రవేశం చేశాడు. జనక మహారాజు యజ్ఞం అప్పటికే ప్రారంభమై సాగుతోంది. వేద విదులు, ఋత్విక్కులు, బ్రాహ్మణోత్త ములు, మహర్షులు, రాకుమారులు - అందరూ వచ్చారు. పన్నెండు రోజుల యజ్ఞం, అహల్యా గౌతముల కుమారుడు శతానందుడు జనకుని దగ్గర పురోహితునిగా ఉండి యజ్ఞకార్యాలు చూస్తున్నాడు. అతడే విశ్వామిత్రుని చరిత్రను శ్రీరామునికి చెప్పాడు.

ఆ తరువాత శివధనుర్భంగము, సీతా స్వయంవర కార్యక్రమము, శ్రీరామాదుల కల్యాణం జరిగాయి. నిజానికి మిథిల అయోధ్యకు దగ్గర. కాని విశ్వామిత్రుడు కారణ జన్ముడైన రాముణ్ణి తన ఆశ్రమం నుండి - అయోధ్యకు తీసికొని వెళ్లకుండా - తిన్నగా మిథిలకు తీసికొని వెళ్లాడు. మర్నాడు విశ్వామిత్రుని హిమాలయ నిర్గమము - నిష్క్రమము కూడ. ఎందు చేతనంటే ఆ తర్వాత రామాయణంలో విశ్వామిత్రుని పాత్రకు విశేష ప్రయో జనం లేదు.

**మిథిల :**

మిథిలానగరం విదేహ రాజ్యానికి రాజధాని. అది ఈనాటి ఉత్తర బీహారులో ఉంది. జనక్‌పూర్ అనే పేరుతో నున్న రైల్వేస్టేషనుకు సుమారు 40 కి.మీల దూరాన ఉన్నది. జనక్‌పూర్ ఆనాటి మిథిల. ఇది నేపాలుకు దగ్గరగా ఉంది. ఇప్పటి దర్భాంగా, చంపారణ్యం, ఉత్తర ముజఫర్‌పూర్ జిల్లాలు ఆనాటి విదేహరాజ్యం. అది వేద కాలము నుండి ప్రసిద్ధిలో ఉంది.

**కోసల :**

శ్రీరాముని జన్మభూమియైన అయోధ్య కోసల రాజ్యంలో ఉంది. ఇది ఈనాటి ఉత్తరప్రదేశ్‌లో ఉంది. కాశీ రాజ్యానికి వారణాసి రాజధాని. ఈ కాశీ కోసల రాజ్యాలు తరువాత కలసిపోయినవని చెప్పబడుతోంది. కాశీ రాజ్యానికి ప్రక్క రాజ్యాలు కోసల, అంగ, మగధ రాజ్యాలు. సాకేతపురము ఆ తరువాత కోసల రాజధాని అయింది. శ్రీరామునికి సాకేతపురాధీశుడనే పేరుండటం మనకు తెలుసు.

శ్రీరాముడు సీతా సమేతంగా సోదరులు వారి నూతన వధువులతో కలసి అయోధ్యకు తరలి వెళ్లారు. సీతారాములు 12 సంవత్సరాలు సుఖంగా ఉన్నారు. అప్పుడే పట్టాభిషేక ప్రస్తావన వచ్చింది. కైకేయి కోరిక మేరకు, పితృవాక్యపాలన కోసం శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై అరణ్య వాసానికి బయలుదేరాడు.

**అరణ్యవాసం :**

ఆయన అరణ్య వాసానికి బయలుదేరిన రోజున రాత్రి తన వెంటబడి, తనను వదలలేక వచ్చిన వారికి తెలియకుండా, తెల్లవారు ఝామునే బయలుదేరి తమసా నదిని, ఆ తరువాత వేదశ్రుతీ నదిని, గోమతీ నదిని, స్యందికా – నందినీ నదులను దాటాడు. ఇదంతా రథంతో చేసిన ప్రయాణమే.

రెండవ రోజు శృంగిబేరపురం చేరుకున్నాడు. అది గంగ ఒడ్డునున్న ఊరు. అక్కడే గుహుని ఆతిథ్యం అందుకున్నాడు. మూడవ రోజు గుహుని సాయంతో గంగను దాటి అరణ్యంలో ప్రవేశించాడు. ఇక్కడ నుండి వారు అరణ్య పరిస్థితులకు అనుగుణంగా జాగ్రత్త తీసికొన్నారు. ఆ రాత్రి వత్సదేశ సమీపంలో ఒక మఱ్ఱిచెట్టు క్రింద కాలం గడిపారు. అరణ్యావాసంలో అదే మొదటిరాత్రి. నాల్గవరోజు భరద్వాజాశ్రమం చేరుకున్నారు. భరద్వాజుని సలహా పొంది అక్కడ నుండి బయలుదేరి చిత్రకూటం చేరుకున్నారు. మధ్యలో వాల్మీకి ఆశ్రమాన్ని దర్శించారు. చిత్రకూటం దగ్గర పర్ణశాల నిర్మించుకున్నారు. దుందుభినామ సంవత్సర చైత్ర శుద్ధ దశమితో అరణ్యావాసము ప్రారంభమైంది.

అక్కడికి భరతుని రాక జరిగింది. శ్రీరామ పాదుకలతో అతడు తిరిగి వెళ్ళిపోయాడు. ఆ సమయంలోనే వారు జాబాలి మహర్షిని కలిశారు.

శ్రీరాముని రాకవలన అరణ్య ప్రాంతములోని రాక్షసుల కదలికలలో మార్పు వచ్చింది. ఖరుని ప్రేరణతో రాక్షసుల విజృంభణ ప్రారంభమైంది. దీని వలన మునులు చిత్రకూట పర్వత ప్రాంతాన్ని వదలి తమకు అనుకూలమైన, తమకు పరిచయమున్న స్థానాలకు వెళ్ళిపోయారు. శ్రీరామునికి ఇది బాధ కలిగించింది. తన కారణంగా తాపసులకు ఇబ్బంది కలుగకూడదని భావించి ఆ ప్రదేశము నుండి నిష్క్రమింప నిశ్చయించుకున్నాడు. బయలుదేరి దారిలో అత్రి మహాముని ఆశ్రమం దర్శించుకున్నారు. ఆ తరువాత దండకారణ్యం ప్రవేశించారు.

దండకారణ్య ప్రవేశము జరుగగానే విరాధుడనే రాక్షసుని వలన బాధ కలిగింది. భర్త, మఱది ప్రక్కనుండగానే వాడు సీతను చంకకెత్తుకున్నాడు. రామ లక్ష్మణులు యుద్ధానికి దిగగానే వాళ్ళని కూడ మరొక చంకకెత్తుకున్నాడు. కాని వాడి భుజాలను రామలక్ష్మణులు తెగగొట్టారు. దానితో వాడు శాప విముక్తుడైనాడు.

విరాధుడున్న ప్రదేశానికి విరాధ వనమని పేరు. ఆ తరువాత శరభంగ మహాముని ఆశ్రమానికి వచ్చారు. విరాధ వనం నుండి అది 24 కి.మీల దూరం.

శ్రీరామ దర్శనం తరువాత శరభంగుడు అగ్ని ప్రవేశము చేసి ఈ లోకాన్ని వదిలాడు.

ఆ సందర్భంలో చాలమంది మునులు రామదర్శనం చేసి, అంతకు పూర్వం రాక్షసులకు ఆహుతైపోయిన వారి యొక్క ఎముకల గుట్టలు చూపారు. ఆ అస్థికల గుట్టల్ని చూచిన రాముడు వారిని కాపాడతానని అభయమిచ్చాడు.

అక్కడ నుండి రాముడు సుతీక్ష్ణ మహాముని ఆశ్రమానికి వచ్చాడు అక్కడొక రాత్రి ఉన్నాడు. అక్కడ నుండి ఇతర మునుల ఆశ్రమాలు చూడటానికి వెళ్లాడు. అక్కడ ఆయన ఒక్కొక్కచోట కొంత కొంత చొప్పున కాలము గడపినట్లు కనిపిస్తుంది. అక్కడ వారు పంచాప్సరస్సరస్సు అనే దానిని చూచారు. వారికి మార్గం చూపుతున్న ధర్మభృతుడనే ఋషి ఆ సరోవరము కథ చెప్పాడు. ఆ సరస్సు మాండకర్ణి ఋషి తపస్సృష్టియట. ఆ సరస్సులో నుండి యెప్పుడు సంగీతం శ్రుతిపేయంగా వినిపిస్తూ ఉంటుంది. మాండకర్ణి మహర్షి భార్యలైన అప్సరసలు వినిపించే సంగీతమట అది. మాండకర్ణి పంచాప్సరసలను వివాహమాడి వారు అక్కడే నివసిస్తుండటంతో అది పంచాప్సరస్సరస్సు అయింది. ఆ పరిసరాలలో శ్రీరాముడు పర్ణశాల నిర్మించుకొని అక్కడే కొంత కాలమున్నాడు. ఈ సుతీక్ష్ణాశ్రమము, ఈ పంచాప్సరస్సరస్సు ఈనాటి ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రము - బిలాస్‌పూర్ జిల్లాలో ఉన్నట్లు జనరల్ కన్నింగ్‌హోమ్ దొర నిర్ధారించి తమ ఆర్కిలాజికల్ రిపోర్టు (వాల్యూమ్.9)లో చెప్పారు. ఈ సుతీక్ష్ణాశ్రమము అటు శరభంగాశ్రమానికి, ఇటు పంచాప్సర సరోవరానికి మధ్యలో ఉన్నది గనుక ఇది చాల విశాలమైన ప్రాంతము. అది బిలాసపూర్ జిల్లా నుండి రాయపూర్ జిల్లాలోని ఉత్తర భాగం వరకు వ్యాపించి ఉండి ఉంటుంది అని నిర్ణయించారు.

ఇక్కడే శ్రీరాముడేర్పరుచుకొన్న ఆశ్రమం ఉన్న కొండ తరువాత రామగిరి అయిందని చెప్పబడుతోంది.

> 'కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ ప్రమత్తః
> శాపేనాస్తంగమిత మహిమావర్షభోగ్యేణభర్తుః
> యక్షశ్చక్రే జనకతనయాస్నాన పుణ్యోదకేషు
>
> స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమే" ॥

అని కాళిదాసు ఈ పర్వతాన్నే మేఘసందేశంలో వర్ణించాడని చెప్పబడింది. ఇది నాగపూర్‌కు 40 కి.మీల దూరంలో ఉంది. దాని సమీపంలో ఉన్న నగరానికి 'రామటెక్' అని పేరు. అక్కడ నుండి అంటే సుతీక్ష్ణమహాముని ఆశ్రమము నుండి నాలుగు యోజనాలు అంటే సుమారు 192 కి.మీల దూరంలో అగస్త్యభ్రాత ఆశ్రమం

ఉంది. ఈ ఆశ్రమం ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని రాయపూర్ జిల్లా యొక్క దక్షిణ భాగము నుండి, బస్తరు జిల్లా యొక్క ఉత్తరభాగము వరకు విస్తరించి ఉంది. అక్కడ నుండి తిన్నగా దక్షిణ దిక్కున సుమారొక 48 కి.మీల దూరంలో అగస్త్యుల వారి ఆశ్రమం ఉంది. సీతారామలక్ష్మణులు అక్కడికి వచ్చారు. అక్కడ అగస్త్యుని ఆతిథ్యాన్ని, ఆయన అందించిన అస్త్రాలను వారందుకున్నారు. అవి విష్ణు ధనుస్సు, అక్షయసాయకాలున్న రెండు తూణీరాలు, ఒక మహాఖడ్గము. అగస్త్య - రామ సంభాషణలో అరణ్యవాసం చాలకాలం గడిచిందని మాత్రం ఉంది. వారి పర్యటనలోని కొన్ని వివరాలను బట్టి అప్పటికి అరణ్యవాసం సుమారు పది సంవత్సరాలు గడిచినట్లుగా భావింపబడుతోంది. అగస్త్యునికి వారు తమ ఆశ్రమంలోనే ఉంటే బాగుండునని ఉంది కాని, శ్రీరాముని అభిప్రాయం అందుకు భిన్నంగా ఉండటంచేత శ్రీరాముడు కోరినట్లు జలసమృద్ధము, బహువన భరితము అయిన ప్రదేశంగా పంచవటిని సూచించి అక్కడకు వెళ్లవలసిందిగా చెప్పాడు.

**గోదావరి తీరం - పంచవటి :**

అక్కడకు సుమారు 96 కి.మీ దూరంలో గోదావరి ఉంది. అగస్త్యుని సూచన మేరకు వారు అక్కడ నుండి గోదావరి తీరాన ఉన్న పంచవటికి బయలుదేరారు. వారింకా పంచవటికి చేరటానికి ముందే ఒక వటవృక్షము మీద భయంకరాకారంతో ఉన్న గ్రద్దను చూచి నువ్వు ఎవ్వరని అడిగితే ఆ గ్రద్ద తాను జటాయువను పేరు గలదానినని, దశరథుని మిత్రునిగా పరిచయము చేసుకున్నాడు. జటాయువు ఒక గృధ్రమే గదా! మరి పక్షులు మాట్లాడతాయా? వాటి కూతలు మనకైతే అర్థమౌతాయా? అది రాముడితో ఎలా మాట్లాడగలిగింది? అసలు రాముడెలా దానిని నీవెవ్వరని అడిగాడు? ఆ ప్రశ్నలకు సమాధానాలు దొరకవు. ఆ గృధ్రము తనను గురించి పరిచయము చేసికోవటం మాత్రమే గాక, ప్రజాపతులను, వారి సంతానాలను, వారి వలన సృష్టిక్రమంలో ఏర్పడిన కొన్ని పక్షులు, జంతువులు, నాగులు - ఇంకా కొంతమంది దేవతల పుట్టుకను వివరించటం జరిగింది. ఆ విషయాలు విని శ్రీరాముడు ఆనందాన్ని పొందాడు. అప్పుడే జటాయువు అరణ్యవాసంలో సీతను గురించి భద్రత విషయంలో అవసరమయితే తాను సహాయపడతానని మాట యిచ్చాడు. తరువాత వారు గోదావరి తీరాన ఉన్న పంచవటికి చేరుకున్నారు. చేరిన తరువాత లక్ష్మణుని అభ్యర్థనపై శ్రీరాముడు స్థల నిర్దేశం చేసి చూపగా లక్ష్మణుడు సముచితంగా పర్ణశాల నిర్మించాడు. అదే ఆంధ్ర దేశంలోని భద్రాద్రికి 22 కి.మీ ఉత్తరాన ఉన్న పర్ణశాల. ఇక్కడ నుండి

శ్రీమద్రామాయణంలో శ్రీరాముని ఆంధ్రాయణము ప్రారంభమౌతుంది.

సీతారాములిక్కడ లక్ష్మణుని సేవలందుకుంటూ పర్ణశాల - ఆ పరిసర ప్రాంతాలలో - సుఖంగా కాకపోయినా - కొంచెం ఉల్లాసంగా 3 సంవత్సరాలు కలసి కాలక్షేపం చేశారు. రాముడు అరణ్యవాస కాలంలో అక్కడక్కడ పర్ణశాలలు నిర్మించుకున్నాడు. నాసిక్ (మహారాష్ట్రలో)కు దగ్గర ఒక పర్ణశాల ఉంది. కాని నాసిక్‌కు వారు వెళ్ళి ఉంటే నర్మదాదులు వర్ణింపబడవలసి ఉంది. కాని అలాంటి వర్ణనేమీ రామాయణంలో జరుగలేదు.

ఈనాటి ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రం నుండి తిన్నగా వారు మన ఆంధ్రదేశంలోని ఖమ్మం జిల్లాలోకి ప్రవేశించారు. అగస్త్యుడి సూచనమేరకే అది జరిగింది. ఈనాటి ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రము యొక్క సరిహద్దు అడవి మార్గము గుండా "చర్ల" గ్రామం నుండి కేవలం పదిహేను కిలోమీటర్ల దూరంలోనే ఉంటుంది. తాలిపేరు - సీలేరు మొదలగు ఉపనదులు ఈ ప్రాంతంలోనే గోదావరిలో కలుస్తాయి.

ముందు ఈ ప్రాంతంలో వారి పవిత్ర పాదాలు మోపి వారు నడయాడిన ప్రదేశాలు చూద్దాం.

**ఖమ్మం జిల్లా :**

**పర్ణశాల : పంచవటి :**

పంచవటి అంటే 5 వటవృక్షాలున్న ప్రదేశమని అర్థం. ఇది ఈనాటి ఆంధ్ర రాష్ట్రానికి సరిహద్దు ప్రాంతంలో ఉంది.

వటవృక్షాలంటే అవి ఒకేరకం కాదు. అశోక, మఱ్ఱి, మారేడు, మేడి, రావి అనే అయిదింటిని వటవృక్షాలంటారు. పంచవటి అంటే పైన చెప్పిన వానిలో ఒకే జాతివి 5 ఉన్నాయని గాక ఈ పైన చెప్పిన 5 రకాల చెట్లతో నిండిన ప్రదేశమని భావింపవచ్చు. ఈ పంచవిధ వటవృక్ష పరివ్యాప్తమై గోదావరిలో కలుస్తున్న కొన్ని జల ప్రవాహాల మధ్య వారు పర్ణశాలను నిర్మించుకున్నారు. ఈ ప్రాంతాన్ని ఇప్పుడు రామచంద్రపురమని వ్యవహరి స్తున్నారు.

సీతారాములు పంచవటి ప్రాంతం చేరుకొని పర్ణశాల నిర్మించుకునే సమయానికి శరదృతువు గడచి హేమంత కాలం వచ్చింది. ఇక్కడ సీత పేరిట వాగు ఒకటి ఉన్నది. అది చిన్న ఏఱు. అది కూడ వచ్చి గోదావరిలో కలిసే ఉపనది. ఈ వాగులో సీత స్నానమాచరించేదట. పర్ణశాలకు సమీపంలో లక్ష్మణుడు పర్ణశాలకు

కావలి ఉన్న గుట్ట ఉన్నది. దాని పేరు లక్ష్మణగుట్ట. హేమంత కాలంలో ఆమెకు శీతలోదకస్నానం ఇబ్బంది కలిగించగా ఆమె భద్రాచలానికి ఆగ్నేయంగా ఉన్న ఉష్ణగుండంలో స్నానమాచరించేదట. అక్కడ స్నానానంతరము సీతమ్మ ఆరవేసుకున్న చీరల చిహ్నాలుంటాయి. అవి రాతినేలమీద ఏర్పడిన చారికలు. అక్కడే పసుపు కుంకుమ వర్ణాలు గల రాళ్ళుంటాయి. ఆ రాళ్లు ఆమె స్నానాంతరము ధరించిన పసుపు కుంకుమలకు గుర్తులట.

ఇక భద్రాద్రికి తూర్పుగా గోదావరి ప్రవాహ మార్గము ప్రక్క 50 కి.మీల దూరాన కూనవరం వద్ద రామగిరి ఉన్నది. ఆ స్థలంలోనే పూర్వము మతంగాశ్రమముండేదని, మహాభక్తురాలైన శబరి శ్రీరాముని రాకకోసం వేచిఉన్న స్థలమదేనని చెప్పబడుతోంది. ఇక్కడ వేంచేసియున్న రాముడు యోగరాముడు. శ్రీరాముడిక్కడే యోగశాస్త్ర రహస్యాలు తెలుసుకొన్నాడని చెబుతారు. అయితే అంతర్వేదిలో వసిష్ఠునిచేత ప్రతిష్ఠితమైన యోగ నరసింహుని అనుగ్రహము సంపాదించి వసిష్ఠుడు, శ్రీరాముని యోగ విద్య యందు నిష్ణాతుని చేశాడని చెప్పే కథ కూడ ఉంది. కాబట్టి వసిష్ఠుని వద్ద పొందిన యోగ విద్యను మతంగాశ్రమం వద్ద అభ్యాసము చేసి ఆ విద్యలో సిద్ధిని సంపాదించాడని అనుకొనవలసి వస్తుంది.

మరీ సమీపంలో కాకపోయినా గోదావరి తీరాలలో వాలి సుగ్రీవులకు సంబంధించిన పర్వతాలున్నాయి. పైన పేర్కొన్న కూనవరం వద్దనున్న వాలి సుగ్రీవుల కొండ కాక మరొకటి పశ్చిమగోదావరి జిల్లా కామవరపుకోట గ్రామానికి నైరృతి దిక్కులో ఉంది. దీన్ని వాలి సుగ్రీవుల గట్టు అనే పిలుస్తారు. ఈనాటికి కూడ కార్తీకమాసంలో ఇక్కడొక ఉత్సవం చేసుకుంటారు. ఆ కొండ గుహ క్రింద వాలి సుగ్రీవులు యుద్ధానికి సన్నద్ధులై ఉన్న శిల్పాలు, పైన కొండ గుహముందు ఒక స్త్రీమూర్తి శిల్పము తొలచి ఉంచిన మందిరము ఉన్నాయి. ఆ శిల్పములోని స్త్రీమూర్తి వాలి భార్య అయిన తారాదేవిది. (చూడుము పుటలు 88,89)

భద్రాద్రికి 5 కి.మీల దూరంలో జటాయు పర్వతముంది. జటాయువు దీనిపై ఉండేవాడట. సీతాపహరణము చేసి రావణుడు వెళుతున్నప్పుడు జటాయువు రావణుని యెదిరించి పోరాడగా, రావణుని దెబ్బకు రెక్కలు తెగిపడిపోయినచోట – రెక్కలు తెగిన గుర్తుగా రేకపల్లి అనే గ్రామముంది. ఆ తరువాత జటాయువు అసువులు బాసిన ప్రదేశము జటపాక. అది ఆ తరువాత ఎటపాకగా మారింది. ఆ పేరుతో గ్రామమొకటి నిలచి ఉంది. ఇప్పుడు ఎటపాకలో జటాయువు గుర్తుగా జటాయు మంటపం నిర్మితమై ఉంది.

## దుమ్ముగూడెం :

సీతారామ లక్ష్మణులు పంచవటి సమీపాన పర్ణశాలలో ఉండగా శూర్పణఖ కామరూపియై వారున్నచోటికి వచ్చి, వారిని గురించి వివరాలు శ్రీరాముణ్ణి అడిగి తెలుసుకొని, అడిగిన మీదట తనను గురించి వివరాలు చెప్పి శ్రీరాముణ్ణి తనకు భర్తగా భావించుకుంటున్నానని చెప్పింది. ఆ తరువాత శ్రీరాముని సూచనపై లక్ష్మణుణ్ణి ప్రలోభపెట్టింది. లక్ష్మణుడు కోపగించి ఆమె ముక్కు చెవులు కోయగా జనస్థానానికి వెళ్లిపోయి తన సోదరుడు ఖరునికి చెప్పుకొని ఏడ్చింది.

మొదట ఖరదూషణుల సేనాపతులు కొంతమంది రాక్షసులతోను, ఆ తరువాత దూషణుడు కొన్ని వేలమంది రాక్షసులతోను వెళ్లి యుద్ధములో హతులైనారు. చివరకు ఖరుడు కూడ హతుడైనాడు. హతులైన రాక్షసుల సంఖ్య 14000. అది పూర్తయ్యేవరకు సీతను ఒక కొండ గుహలో ఉంచి లక్ష్మణుడు ఆమెకు రక్షగా ఉన్నాడు. ఖరదూషణ త్రిశిరాదులతో సహా 14000 మంది చనిపోయిన తరువాత వారిరువురు కొండ గుహ నుండి బయటకు వచ్చారు. ఆ యుద్ధం జరిగింది దుమ్ముగూడెం దగ్గర! అది భద్రా చలానికి సుమారు 26 కి.మీల దూరాన ఉంది. అకంపనుడు అనే చారుడు వెళ్లి ఈ సంగతి రావణునికి చెప్పాడు. రావణుడు మండి పడ్డాడు. సీతాపహరణ చేయాలనే దురాలోచనకు బీజం పడింది. రావణుడు మారీచాశ్రమానికి వచ్చి సీతాపహరణానికి మారీచుని సాయం కోరాడు. కాని మారీచుడు నెమ్మదిగా సర్దిచెప్పి రావణుని వెనక్కు పంపాడు.

కాని శూర్పణఖ స్వయంగా వెళ్లి ముక్కు, చెవులు పోగొట్టుకున్న తన వికార రూపాన్ని చూపి రావణునిలోని ద్వేషాగ్నిని ప్రజ్వలింపచేసింది. రావణుడు మళ్లా బయలుదేరి మారీచుని దగ్గరకు వచ్చి సహాయం చేయవలసిందేనని పట్టుపట్టాడు. అప్పుడు మారీచుడు విశ్వామిత్రుని యాగాన్ని తాను భంగపరచబోయిన సంగతి, సుబాహుని మరణము, తాను మానవాస్త్రము వలన చావు తప్పి బయటపడిన సంగతి చెప్పాడు. ఆ తరువాత తాను ధర్మనిష్ఠాపరుడై తాపస జీవనం సాగిస్తున్నట్లు చెప్పాడు. అయినా రావణుడు వినలేదు. తన మాట వినకపోతే మారీచుణ్ణి తానే చంపుతానని భయపెట్టాడు. చివరకు తప్పని పరిస్థితిలో ఒప్పుకొని మారీచుడు బంగారులేడిగా మారి పర్ణశాల ప్రాంతానికి వచ్చి సీతను అత్యంత ప్రలోభానికి లోను చేశాడు.

తరువాత జరిగిన కథ చెప్పుకునే ముందు దుమ్ముగూడెం గురించి ఒక విషయం చెప్పుకుందాం. దుమ్ముగూడెంలో అత్యంత ప్రాచీనమైన రామలింగేశ్వరాలయముంది.

శ్రీరాముడు నిత్య శివపూజానియమం కలవాడు గనుక ఈ స్వామిని అర్చించేవాడని చెప్పుకుంటారు. ఈ స్వామి అత్యంత మహిమాన్వితునిగా ఈనాటికి చెప్పుకుంటారు.

మళ్లీ రామాయణ విషయానికి వద్దాం. శ్రీరాముడు సీత కోరిక తీర్చటానికి లక్ష్మణుని సీతకు రక్షగా ఉంచి బంగారు లేడిని పట్టి తేవటానికి వెంటపడ్డాడు. ఆ బంగారు లేడి ఎంతదూరం తీసుకుపోయిందో ఏమో కాని "హా లక్ష్మణా! హా సీతా!" అన్న కేకలు మాత్రం వినిపించినవి. అప్పుడు లక్ష్మణుడు రామునికోసం బయలుదేరి వెళ్లాడు. అప్పటికే రావణుడు తాను వేసికొన్న పథకం ప్రకారము తన రథాన్ని తీసికొని వచ్చి ఒక గుట్ట దగ్గర ఆపుకొని వేచి ఉన్నాడు. లక్ష్మణుడు వెళ్లటం గమనించాడు. తన రాక్షసమాయతో వేషం మార్చుకొని బ్రాహ్మణ పరివ్రాజక వేషంతో జటలు ధరించి, దండ కమండలాలతో 'భిక్షాందేహి' అంటూ సీత ఉన్న పర్ణశాల వద్దకు వచ్చి నిలబడ్డాడు.

**రావణగుట్ట :**

ఈ రావటానికి ముందు రావణుడు తగు సమయంకోసం వేచి ఉన్న ప్రదేశం రావణగుట్టగా ఈనాటికి నిలచి ఉంది. ఇది గోదావరి నదికి ఆవల ఒడ్డునుంటుంది. దానికి తిన్నగా గోదావరికి ఇవతలి ఒడ్డున లక్ష్మణగుట్ట ఉంటుంది. కంచర గాడిదలు కట్టి తోలుకు వచ్చిన రావణ రథ చక్రాల గాడి ఈనాటికీ ఆ రావణగుట్ట దగ్గర కనిపిస్తుంది.

ఇక రామాయణ కథకు వస్తే 'భిక్షాందేహి' అంటూ వచ్చిన రావణుని అతిథిగా లోపలకు సాదరంగా ఆహ్వానించిన సీతను, ఆమె ఎంత వివాదపడుతున్నా వినకుండా గట్టిగా పట్టుకొని, రథ మెక్కించుకొని ఆకాశానికి ఎగసి, లంకవైపు పయనం సాగించాడు. ఆమె బిగ్గరగా కేకలు పెడుతూ చెట్లకు, పుట్టలకు, గుట్టలకు కూడ ఆ సంగతి చెప్పింది. అందులో ప్రస్రవణ పర్వతమొకటి, గోదావరి నది మరొకటి. వాల్మీకి ఈ సందర్భంలో చెప్పిన శ్లోకాల్ని చూద్దాం!

**'మాల్యవంతం శిఖరిణం వందే ప్రస్రవణం గిరిమ్**
**క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః**

(అరణ్య -49వ సర్గ - 31 శ్లోకము)

పుష్పములతో నిండి శ్రేష్ఠమైన శిఖరములు గల ఓ ప్రస్రవణ పర్వతమా! నీకిదే నమస్కరించుచున్నాను. రావణుడు సీతనపహరించుకొని పోవుచున్నాడని శీఘ్రమే నీవు రామునితో చెప్పుము. దీని తరువాత గోదావరికి చెప్పింది.

హంసకారండ వాకీర్ణాం వందే గోదావరీ నదీమ్,
క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః

(అరణ్య-49 సర్గ - 32 శ్లోకము)

హంసలు సారసములు వ్యాపించియున్న ఓ గోదావరీ నదీ! నీకు నమస్కరిస్తున్నాను.

పైన వాల్మీకి చెప్పిన శ్లోకాలలో మొదట చెప్పిన శ్లోకంలో ప్రస్రవణాన్ని ఉద్దేశించి తరువాత గోదావరి నుద్దేశించి తనను రావణుడు ఎత్తుకొని పోయాడని వెంటనే శ్రీరామునకు చెప్పమంది. అంటే ఆ ప్రస్రవణమేదో గోదావరికి సమీపంలో ఆమెకు ముందే కనిపించి ఉండాలి. ఆ తరువాత గోదావరితో చెప్పటం జరిగింది. అయితే ప్రస్రవణమనే పేరు గల కొండ ఏదో స్పష్టంగా చెప్పలేకపోతున్నాము కాని అది పర్ణశాలకు కూనవరానికి మధ్య అయిఉండవచ్చు. ఆ విధంగా ఎందుకు అనుకోవాలి అనే విషయం చూద్దాం.

సీతను తీసికొని రావణుడు ఆకాశమార్గాన వెళుతున్న సమయంలో వానరులు ఐదుగురొకచోట కూర్చొని ఉండటం చూచిన సీత తన పట్టు ఉత్తరీయములో నగలు మూటగా కట్టి వారి మధ్యలో పడవేసింది. ఈ జరిగిన విషయాన్ని రావణుడు గమనించలేదని చెప్పబడింది. నగల మూట పడిన స్థలం సీతంపేట అని చెప్పబడుతోంది. ఇది కూడ ఖమ్మం జిల్లాలోని కూనవరం దగ్గరే ఉంది. ఒకవేళ కూనవరం దగ్గర రామగిరి అని పిలువబడు తున్న కొండయే ప్రస్రవణ పర్వతమేమో!

సీత ఏమయిందో తెలియక శ్రీరాముడు చాల దుఃఖించాడు. ఆశ్రమ ప్రాంతాలు వెదికాడు. లక్ష్మణుడు కూడ వెదికాడు. చివరకు లక్ష్మణుడు రాముని ఓదార్చి, ధైర్యము చెప్పి జనస్థానమంతా వెదకటానికి నిశ్చయించుకొని బయలుదేరారు. అప్పుడు పర్వత శిఖరము వలె ఉన్నటువంటి జటాయువును చూచారు. ఒకవేళ ఆ జటాయువే ఒక గద్ద రూపములో ఉన్న రాక్షసుడేమోనని, అతడే సీతను కబళించాడేమోనని అనుమానించాడు. గాని దగ్గరకు వెళ్లి చూస్తే చావ సిద్ధంగా జటాయువు రక్తం కక్కుతూ కనిపించాడు. నీవు వెదకుతున్న సీతను, నా ప్రాణాలను రెంటిని కూడ రావణుడపహరించాడని చెప్పాడు. జరిగినదంతా చెప్పాడు. ఆ తరువాత కొన ఊపిరితో ఉన్న ప్రాణాలు విడిచాడు. ఇంతకుముందే జటాయువు రెక్క తెగి పడినచోటు రేకపల్లి అని, ప్రాణాలు విడిచినచోట ఎటపాకగా నిలిచిందని చెప్పుకున్నాం. రాముడు కొనప్రాణంతో అటూ ఇటూ కదలుతూ రాఘవాశ్రమానికి సమీపాన నేలమీద పడియున్న యా జటాయువును చూశాడు.

**తమల్ప జీవితం గృధ్రం స్ఫురంతం రాక్షసాధిపః
దదర్శ భూమౌపతితం సమీపే రాఘవాశ్రమాత్.**

(అరణ్యకాండ 52 సర్గ 1వ శ్లోకం)

ఇక చనిపోయిన జటాయువుకు అంత్య క్రియలు జరిపి పిండప్రదానం చేశాడు. ఆ తరువాత గోదావరీ నదికి వెళ్లి జలతర్పణం చేశారని వాల్మీకి చెప్పిన విషయం.

**తతో గోదావరీం గత్వాం నదీం నరవరాత్మజౌ
ఉదకం చక్రతు స్తస్మై గృధ్రరాజాయ తావుభౌ**

(అరణ్యకాండ 68వ సర్గ 35వ శ్లోకం)

కనుక జటాయుమరణం సంభవించింది కూడ పర్ణశాలకు, గోదావరి నదికి సమీపాననే అని అర్థమౌతుంది. అయితే జటాయువుకు పిండం పెట్టింది ఈనాటి గోదావరి జిల్లాలోని పెండ్యాలలో అని ఒక అభిప్రాయముంది. అది సరికాదేమోననిపిస్తుంది లేదా పెండ్యాలలో తన తండ్రికి జలతర్పణం చేశా డేమో! లేదా తనకు సహాయము చేసిన వారందరికీ పుణ్యప్రాప్తి కోసం శివలింగ ప్రతిష్ఠలు చేసినట్లు ఆ తరువాత వచ్చినప్పుడు ఇక్కడ పితృదేవతలకు పిండ ప్రదాన, జలతర్పణం చేశాడేమో.

ఇక జటాయువు వలన సీతాపహరణము గురించి విన్నచోటు ఈనాటి గుంటూరు జిల్లాలోని వినుకొండ - విన్నకొండ అని ఆ తరువాత వినుకొండగా మారిందని ఒక వాడుక ఉంది. అలాగే అనంతపురం జిల్లాలో పడిపోయిన జటాయువును "లే పక్షీ!" అని అన్నాడని, అదే తరువాత "లేపాక్షి" అయిందని ఒక అభిప్రాయము చెప్పబడుతోంది. ఈ సంఘటనకు జటప్రోలుకు సంబంధ ముందని, జటాయువు పడినందునే జటప్రోలనే పేరు వచ్చిందనే అభిప్రాయ ముంది. కాని దీనికి తగిన ఆధారము రామాయణంలోగాని, ఇతరత్రా గాని కనిపించటం లేదు.

నా యీరచన ప్రధానోద్దేశమేమో ఇంతకు ముందే చెప్పాను. శ్రీరాముడు ఆంధ్రదేశంలో పర్యటించి సందర్శించిన ప్రదేశాలను, సాధ్యమైనంతవరకు ఏ యే సందర్భాలలో ఆ సందర్శన జరిగిందో చెప్పాలని ప్రయత్నం. అయితే శ్రీరాముడు మొదటిసారి వచ్చిన సందర్భం విశ్వామిత్రుని యాగ సంరక్షణకోసం. అయితే ఆంధ్రదేశంలో శ్రీరామ పాదముద్రాంకితమైన స్థలాలెన్నో ఉన్నాయి. అన్నింటిని వనవాసకాలంలోనే చూచాడా అంటే - కాదేమోననిపిస్తుంది. అలా ఎందుకు అనుకోవలసి వస్తోందో చూద్దాం!

## యుద్ధానంతర శివలింగ ప్రతిష్ఠలు :

మారీచుడు, రావణుడు మొదలైన వారిని సంహరించటం వలన కలిగిన బ్రహ్మహత్యా పాప పరిహారార్థం ఆయన ఎన్నోచోట్ల శివలింగ ప్రతిష్ఠలు చేశాడు. అనుశ్రుతంగా చెప్పుకొనేదేమంటే రావణ సంహారానంతరం, లంక నుంచి అయోధ్యకు తిరిగి వెళుతూ పాపపరిహారార్థం శివలింగ ప్రతిష్ఠలు చేస్తూ వెళ్లాడని! కాని ఆ ప్రతిష్ఠలన్నీ అప్పుడే చేశాడనిపించదు. తిరుగు ప్రయాణంలో కొన్ని చేసి ఉండవచ్చు. ఆయన కోటిలింగాలు ప్రతిష్ఠ చేశాడని చెప్పబడుతోంది. లంకలో విభీషణునికి పట్టాభిషేకం జరిపించింది ధాతనామ సంవత్సరము చైత్రశుద్ధ తదియ రోజున. ఆ తరువాత లంకలో బయలుదేరి నవమి నాటికి అయోధ్య చేరుకున్నాడు. మధ్యలో కాలవ్యవధి ఐదు రోజులు మాత్రమే. ఎంత విమానంలో పయనించినా అంత బహుళ సంఖ్యలో శివలింగ ప్రతిష్ఠలు జరపటానికి ఐదు రోజుల వ్యవధి చాలదు. కనుక ఆయన కొన్ని ప్రతిష్ఠలు తిరుగు ప్రయాణంలో చేసినా, ఆ తరువాత మరొకసారి ఆయన ఆంధ్రదేశానికి వచ్చి అయా ప్రదేశాలు సందర్శిస్తూ, ప్రతిష్ఠాదికాలు చేసి ఉండవచ్చు! అయితే అరణ్యవాసమప్పుడు కాక మరొకసారి వచ్చినట్లు రామాయణంలో లేదే అంటే రావణ వధ వరకే పరిమితమైన కథ వాల్మీకిది. అందుచేత ఈ విషయాలు రామాయణంలో ఉండే అవకాశం లేదు. అంతేకాక వారి వంశంలో పూర్వులు ఆంధ్రదేశాన్ని దర్శించిన నిదర్శనాలున్నాయి. శ్రీరాముని తాత, తండ్రి ఇద్దరూ కూడ ద్వారకాతిరుమల దర్శించినట్లు తెలు స్తోంది. ఇందుమతీదేవిని వివాహము చేసికొని వెళ్లేటప్పుడు అజమహారాజు, తన పరిపాలనా కాలంలో దశరథుడు దర్శించినట్లు చెప్పబడుతోంది. అంతే కాక కౌసల్య జన్మస్థలం ఈనాటి ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని రాయపూర్‌కి 50 కి.మీల దూరంలో ఉన్న చంద్రఖురి అని చెప్పబడింది. అక్కడ ఈనాటికి కూడ ఒక పురాతన కౌసల్యా మందిరముంది. ఆనాడు ఛత్తీస్‌ఘడ్ ప్రాంతానికి దక్షిణ కోసల అని పేరు. కౌసల్యా దశరథుల వివాహానికి అనుసంధాన కర్త విశ్వామిత్రుడని చెప్పబడింది. విశ్వామిత్రునికి ఆంధ్రదేశంతో గల సాన్నిహిత్యం సత్రయాగ ప్రస్తావనలో ఇంతకు ముందే మనం చూచాము.

ఆ విధంగా శ్రీరాముడు మరొకసారి వచ్చి ఉండకపోతే సందర్శనమూ కష్టమే. ప్రతిష్ఠలూ కష్టమే! ఉదాహరణకు తాపసియైన మారీచుణ్ణి సంహరించినందుకు గాను ఆయన కొన్ని ప్రదేశాలలో శివలింగాలను ప్రతిష్ఠ చేశాడు. అలాగే రావణుని గురించి, మిగతా వారి గురించి కూడ! వారికి పుణ్య ఫలప్రాప్తి కోసం! అవి ఎక్కడెక్కడ

జరిగాయో చూద్దాం! మరొక విషయం. శ్రీరామ లక్ష్మణులు యుద్ధంలో చాల మందిని సంహరించిన పాపం తొలగటానికి సీతారామలక్ష్మణులు ముగ్గురకు వసిష్ఠుడు ముంజేతి కంకణాలు ధరింపచేసి వారిని పంపాడని, ఆ ముంజేతి కంకణాలు ఎక్కడ తెగి క్రింద పడ్డాయో అక్కడ వసిష్ఠుడు తాను నిర్దేశించిన విధంగా ప్రతిష్ఠాదికాలు నిర్వర్తింపచేశాడని చెప్పబడింది. అవి లంక నుండి తిరుగు ప్రయాణంలో సాధ్యమయ్యేవి కావు. కాలి నడకన సీతారామ లక్ష్మణులు బయలుదేరితే ఒక్కొక్కరి ముంజేతి కంకణాలు ఒక్కొక్క చోట పడిపోయినవి. అలా నడుస్తూ వెళ్లటం వేరు వేరు చోట్ల అవి పడిపోవటం అక్కడ పాప పరిహారార్థం శివలింగ ప్రతిష్ఠలు చేయటం నాలుగైదు రోజుల తిరుగు ప్రయాణంలో సాధ్యమై ఉండవనిపిస్తుంది. వారందుకు మరొకసారి వచ్చి ఉండాలి. శ్రీరాముడు పట్టాభిషిక్తుడై పరిపాలన చేసిన 11000 సంవత్సరాల కాలంలో అవి యెప్పుడైనా జరిగి ఉండవచ్చు.

పైన చెప్పిన ప్రతిష్ఠాదికములు ఏ వరుసలో జరిగినవో చెప్పలేము గాని స్థానిక చరిత్రలు, స్థల పురాణములు, క్షేత్ర మాహాత్మ్యముల ద్వారాను, విబుధ జనుల వలన విన్నవి పరిశీలించే ప్రయత్నము చేద్దాం.

అయితే సీతారాముల పర్యటనకు సంబంధించిన వివరాలను తెలుసుకునే ముందు, ఖమ్మం జిల్లాలో వారిచే దర్శింపబడిన మరికొన్ని ప్రదేశాల గురించి తెలుసుకుందాం.

ఇంతకుముందు వారు పంచవటికి రావటం, పర్ణశాల నిర్మించుకోవటం, జటాయుపర్వతము, దుమ్ముగూడెం, కూనవరాల గురించి చెప్పుకున్నాము. అలాగే ఉష్ణగుండం, లక్ష్మణగుట్ట, రావణగుట్ట, సీతంపేట, రేకపల్లి, ఎటపాకల గురించి చెప్పుకున్నాము.

**దశకంఠేశ్వరుడు :**

పంచవటిలో ఒక శివాలయముంది. దానికి దశకంఠేశ్వరాలయమని పేరు. రావణాసురుడు సీతాపహరణానికి వచ్చినప్పుడు, లంక నుండి ఒక శివలింగాన్ని తీసికొని వచ్చి తనపేర ప్రతిష్ఠించాడని చెప్పబడుతోంది.

**వామనగుంటలు :**

అలాగే సీతవాగు దగ్గర ఒక బండమీద వామన గుంటలున్నవి. అయితే అవి ఈనాడు ఆడుతున్న ఆట పద్ధతికి కొంచె భిన్నంగా ఉన్నవి. అక్కడే సీతాదేవి కాలక్షేపానికి వామన గుంటలాట ఆడేదని చెప్పుకుంటారు.

**వటవృక్షము :**

సీతారాములు పంచవటి ప్రాంతానికి చేరిన నాటినుండి ఈనాటి వరకు ఆవృక్షముల వ్యాప్తి అవిచ్ఛిన్నముగా కొనసాగుతూనే ఉందని, ఆనాడు అక్కడ నిలచిన వటవృక్షమే ఇప్పుడున్నది కూడ అని ఒక వటవృక్షాన్ని గురించి చెప్ప బడుతోంది. ఈ వటవృక్షము క్రింద ఒక శిల మీద రామపాదాలున్నవి. ఆ పాదాలకు, ఈనాటికి భక్తులు పూజ చేసుకుంటూనే ఉన్నారు.

**రావణుకొలను :**

శ్రీరాములవారి ఆలయానికి వెనుక ఒక గుంట ఉంది. సీత నిలచిన స్థలాన్ని భూమితో సహా పెళ్లగించి రావణుడు ఎత్తుకొని వెళ్లాడని, ఆవిధంగా ఆ ప్రదేశములో ఏర్పడిన పల్లమే రావణుని పేరు మీద రావణు కొలనయిందని చెప్పబడుతోంది.

**సారపాక :**

సీతారాములు పంచవటికి రావటానికి ముందు వారికి జటాయువుతో పరిచయమేర్పడటం ఇంతకుముందు చూచాము. జటాయువుకొక సోదరు దున్నాడు. అతడి పేరు సంపాతి. వీరిరువురు నిశాకరుడనే ముని ఆశ్రమంలో ఉండేవారు. ఆయన స్వర్గానికి చేరిన తరువాత, అన్నదమ్ములిద్దరు పందెము వేసికొని సూర్యుణ్ణి చేరబోయినారు. సంపాతి సూర్యుని ఉష్ణప్రభావమువలన ఱెక్కలు తెగి పడిపోయాడు. అతడు కొన్నాళ్లు సారపాకలో నివసించినట్లు స్థానిక కథనము. ఇది కూడ భద్రాద్రి ప్రాంతములోనిదే.

అయితే అంతకు ముందే నిశాచరముని, సంపాతి ఇలా ఱెక్కలు కోల్పోతాడని రాముని అరణ్యవాసము, సీతాపహరణము జరుగుతుందని చెప్పాడట. అలాగే జరిగింది. సీతను వెదకుతూ వచ్చిన వానరులను ఆహారము చేసుకుందామని ఒక గుహ నుండి బయటకు వచ్చిన సంపాతికి, ఆ వానరులు సీతాన్వేషణలో ఉన్నారని తెలిసి చాల సంతోషిస్తాడు. అలాగే తన తమ్ముడు జటాయువు గురించి వింటాడు. వారికి సీతను రావణుడెత్తు కొనిపోయాడని చెప్పాడు. ఆ తరువాత సంపాతికి పోయిన ఱెక్కలు తిరిగి ఏర్పడినవట.

**జనస్థానము :**

రామాయణంలో జనస్థాన ప్రస్తావన ఉంది. పైన చెప్పబడిన పంచవటి జనస్థానములోని భాగమే. అలాగే రావణుని సోదరుడైన ఖరుడు పరిపాలన సాగిస్తున్న

ఖరాలయం కూడ! అది జనస్థానానికి రాజధానియట! మధ్య పరగణాలలోని రాయపూర్ – అంటే ఈనాటి ఛత్తీస్‌ఘడ్‌లోని రాయపూర్ జిల్లా ప్రాంతము, బస్తరు సంస్థానములో కొంత భాగము, సంబల్‌పూర్ జిల్లాలో చాల భాగము, జయపురం సంస్థానములో గోదావరికి ఉత్తరమందున్న భూభాగము, గోదావరికి దక్షిణాన గల కొంతభాగము, తెలంగాణములోని చాల భాగము కలసి రామాయణ కాలమునాటి జనస్థానంగా గుర్తింపబడింది. ఇదంతా రావణ రాజ్యములోనిదన్నమాట. పరిపాలన చేస్తున్న వాడు మాత్రం ఖరుడు.

**స్నానాల లక్ష్మీపురం :**

ఇక్కడ శివాలయానికి సమీపంలో ఒక స్నానఘట్టముంది. అందులో శ్రీరాముడు స్నానమాచరించాడని చెప్పబడుతోంది. ఈనాటికి కూడ అక్కడ శివరాత్రికి స్నానం చేసే భక్తుల సంఖ్య లెక్కింపలేము. లక్షలలో ఉంటుంది. ఈ సంఖ్యా బాహుళ్యం స్నానమాచరింపటం వలన కలిగిన ప్రాముఖ్యాన్ని బట్టే ఆ ఊరికి స్నానాల లక్ష్మీపురమనే పేరు వచ్చినట్లు తెలుస్తుంది. ఇది వైరా మండలంలో ఉంది.

**నాగుల వంచ:**

ఖమ్మం పట్టణానికి 22 కి.మీల దూరంలో ఉన్న గ్రామమిది. వంచ అంటే వాగు అని అర్థం! ఒకప్పుడు నాగుపాములు ఎక్కువగా మసలుతూ ఉండే జలవనరులున్న ప్రదేశంగా ఈ స్థలాన్ని గురించి చెప్పవచ్చు. ఇక్కడకు రాముడు వచ్చిన గుర్తుగా నిలుపుకున్న అతి ప్రాచీనమైన కోదండ రామాల యముంది. గర్భాలయంలో సీతారాములిద్దరు భద్రాద్రిలో వలె ఒకే వేదికపైన కొలువుదీరి ఉంటారు. ఇంకా భరత శత్రుఘ్నులు లక్ష్మణుడు కూడ ఉన్నారు. ఇక్కడ విష్ణువు మత్స్యావతారమూర్తిగా ప్రతిష్ఠితమై పూజలందుకుంటున్నాడు. జయ విజయులు సతీసమేతంగా ఉంటారు. ఇక్కడింకా చిన్న రామాలయం, ఆంజనేయాలయము శివాలయమున్నవి. శివాలయంలో కూడ శివపార్వతు లిద్దరు ఒకే వేదికపై కొలువుదీరి ఉండటము విశేషము. ఈ ఊరిలో రెండు చెఱువులున్నవి. ఒకటి రాముని పేరు మీద రామసముద్రమని పిలువబడుతుండగా, రెండవది సీతాసాగరమనే పేరుతో ఉంది. ఇక్కడ రామాయణ ఘట్టము కూడ ఒకటి చెక్కబడి ఉంది. యుద్ధంలో దెబ్బతిని మూర్ఛబోయిన లక్ష్మణుడు తెల్లవారితే చనిపోతాడని వైద్యులు చెప్పారు. ఆంజనేయుడు తెస్తున్న సంజీవని ఉన్న పర్వతపు ఓషధులకాంతులు చూచి సూర్యోదయమౌతున్నదనుకొని శ్రీరాముడు సూర్యుణ్ణి ఉదయింపవద్దని విల్లెక్కుపెట్టినట్లున్న సన్నివేశమిది.

ఇక్కడొక గట్టు ఉంది. అది గజగిరి నరసింహస్వామిది. మంగళగిరి కొండమీది పానకాల స్వామివలె ఈయన కూడ పానకం త్రాగుతాడు.

**తూర్పు గోదావరి జిల్లా :**

**అయితంపూడి :**

మారీచుని సంహరించిన పాప పరిహారార్థం శ్రీరాముడు 5 శివలిం గాలను ప్రతిష్ఠించాడు. వానిలో ఒకటి అయితంపూడిలోని శ్రీ రామలింగేశ్వ రాలయము. ఇది కాకినాడకు 18 కి.మీల దూరంలో ఉంది.

**కాజులూరు :**

రెండవది కాజులూరు. ఇక్కడ ప్రతిష్ఠింపబడిన స్వామి కూడ రామలింగే శ్వరుడే. అమ్మవారు ఉమ! ఇది కాకినాడకు 25 కి.మీల దూరాన ఉంది. ఆత్రేయ నదీతీరాన ఉన్న ఈ గ్రామములో అగస్త్యేశ్వరస్వామి ఆలయం కూడ ఉండటం ఆ స్థల ప్రాచీనతను తెలుపుతుంది. అమ్మవారు సర్వమంగళాదేవి.

**కోరంగి:**

మాయకురంగాన్ని చంపిన పాపం పోవటానికి కోరంగేశ్వరుడనే పేరుతో శ్రీరాముడు ప్రతిష్ఠించాడు. ఇది కాకినాడకు 20 కి.మీల దూరంలో ఆత్రేయ గోదావరి సముద్ర సంగమం చేస్తున్న స్థానంలో ఉంది. ఇక్కడి స్నానఘట్టానికి ఆత్రేయ సాగరమని పేరు

**తూరంగి :**

నాల్గవది తూరంగి. మారీచుడు భక్తి ప్రపత్తులతో శివారాధన చేసేవాడు గనుక ఆ బ్రహ్మహత్యాపాతకం పోవాలని ఇక్కడ శ్రీరాముడు పార్వతీతురంగే శ్వరులను ఏక పీఠము మీద ప్రతిష్ఠించాడు. ఇది కాకినాడకు 3 కి.మీల దూరంలో ఉంది.

**ఐలండు పోలవరము :**

అమలాపురానికి సుమారు 15 కి.మీలలో ఉన్న మురమళ్లకు సుమారు 7 కి.మీల దూరంలో ఐలెండు పోలవరమనే గ్రామముంది. మురమళ్ల నుండి కాలిబాటలో నడచివెళ్లాలి. ఇక్కడ కొలువుదీరిన బాణేశ్వరస్వామికి శ్రీమద్రామాయణముతో సంబంధముంది. మాయలేడిని వెంటాడుతూ వెళ్లిన శ్రీరాముడు అది నిజమైన లేడికాదని గ్రహించగానే దాన్ని బాణంతో కొట్టిన ప్పుడు

ఆ లేడి పడిపోయింది. ఆ స్థానం కురంగేశ్వరము కాగా లేడిని దూసు కుంటూ వెళ్లిన బాణము (ఐలెండు) పోలవరంలో పడింది. శివప్రతిష్ఠా కార్య క్రమంలో ఆ బాణము పడిన ప్రదేశంలో శ్రీరాముడు శివ ప్రతిష్ఠ చేశాడు. కురంగంపడిన చోట కురంగేశ్వరుడుగా ప్రతిష్ఠితుడైనట్లు బాణంపడిన చోట ప్రతిష్ఠితుడైన స్వామి బాణేశ్వరుడైనాడు. అర్ధాంగితో కూడి ఉమాబాణేశ్వరుడై నాడు. ఇది ఐదవది.

**క్షణముక్తేశ్వరము :**

అమలాపురానికి 10 కి.మీల దూరంలో అయినవిల్లి మండలములోని శ్రీముక్తికాంతా సమేత క్షణముక్తేశ్వరుడు కూడ రావణబ్రహ్మ హత్యాదోష నివారణార్ధము శ్రీరామునిచే ప్రతిష్ఠింపబడినట్లు చెప్పబడుతోంది. రావణ వధానంతరం శ్రీరాముని అయోధ్యకు తీసుకువస్తున్న పుష్పక విమానము ముక్తేశ్వరం ప్రాంతానికి రాగానే ఆగిపోయిందని, ఆయన దిగి ఆ ప్రదేశాన్ని పరిశీలించగా అక్కడొకచోట పుట్టగానున్న మట్టిగుట్టలో ఒక శివలింగం కనిపించగా దానిని తీసి ప్రతిష్ఠించాడని, ఆ లింగమే క్షణముక్తేశ్వర లింగమని చెప్పబడుతోంది. ఒక శ్రమణి (సన్యాసిని, తపస్విని)కి శ్రీరాముని ప్రార్థనపై అక్కడ ప్రతిష్ఠితుడైన ఈశ్వరుడు క్షణంలో ముక్తిని ప్రసాదించాడు గనుక ఆ స్వామి క్షణముక్తేశ్వరుడైనాడు. ఆ గ్రామం తరువాత క్షణముక్తేశ్వరమైంది.

**తొత్తరమూడి :**

ఇది అమలాపురానికి 13 కి.మీల దూరంలో ఉంది. శ్రీరాముడు క్షణ ముక్తేశ్వరస్వామిని ప్రతిష్ఠించి, సేవించుకొని ఆ తరువాత తత్త్వపురి అనే చోటుకు వచ్చి, అక్కడ లక్ష్మణునికి తత్త్వోపదేశం చేశాడని, కాలక్రమంలో ఆ తత్త్వపురి తొత్తరమూడి అయిందని చెప్పబడుతోంది. ఇక్కడ శ్రీరాముడు ప్రతిష్ఠించిన శివునకు మూలేశ్వరస్వామియని పేరు. శ్రీరాముడు లక్ష్మణునకు చేసిన తత్త్వోపదేశ సారాంశమే తరువాత శ్రీరామగీతగా పేరొందినట్లు తెలుస్తోంది. భగవద్గీతకున్నంతటి వ్యాప్తి లేకపోయినా శ్రీరామగీత కూడ ఈనాటికి నిలచిఉంది.

**శ్రీరామగిరి :**

సీతావియోగ వ్యథతో నిద్రాహారాలు మాని ప్రాణాలు వదలడానికి సిద్ధపడుతున్న శ్రీరాముని వద్దకు అగస్త్యుడు వచ్చి ఆయన్ను ఓదార్చి ఈ ఐహిక బంధాలలో ఉన్న మాయను వివరించి, ఈ జీవులు ఒకరికొకరు ఏమీ కారని, ఎవరికి వారే వారి

వారి దుఃఖాల్ని, కష్టాల్ని వివేకంతో తొలగించుకొని ఈ జీవనయానాన్ని సాగించాలని చెప్పినా శ్రీరాముడు సీతావియోగ దుఃఖాన్నుండి బయటపడలేక బాధపడుతుంటే అందుకు పరిష్కారంగా అగస్త్యుడు విరజాదీక్షనిచ్చి శ్రీరాముణ్ణి మానసిక క్షోభ నుండి కొంతవరకు తప్పించగలిగాడని చెప్పబడుతోంది. ఈ దీక్ష శివపూజతో ముడిపడి ఉన్న కారణం చేత శ్రీరాముడు గోదావరిలో స్నానం చేసి, గోదావరి తీరాన ఉన్న రామగిరిలో శివలింగాన్ని ప్రతిష్ఠించి, అర్చించి ఆ తరువాత అగస్త్యుని నుండి విరజాదీక్షను గ్రహించినట్లు చెప్పబడింది. ఆవిధంగా శ్రీరాముడు శివానుగ్రహాన్ని, అమేయమైన అస్త్రశక్తిని పొందినట్లు చెప్పబడింది. గోదావరి ఒడ్డున కూనవరం దగ్గర ఒక రామగిరి, రాజమహేంద్రవరములో ఒక రామగిరి ఉన్నవి. ఈనాటి రాజమండ్రిలో అది దర్శనీయము కాకపోయినా ఒకనాడున్న మాట నిజమేననీ స్థల చరిత్ర చెబుతుంది.

**కోటిలింగాల పేట, రాజమండ్రి :**

బ్రహ్మదేవుడు ఈ స్థానంలో కోటి లింగాలు ప్రతిష్ఠించి మళ్లీ తన లోకానికి వెళ్లిపోయాడని, కొంతకాలం తరువాత వానిలోని ఒక లింగం స్థానంలో లేక కోటి సంఖ్యకు లోపం ఏర్పడటంతో మహర్షులు ఆ స్థానంలో లింగాన్ని మళ్లీ యధావిధిగా ప్రతిష్ఠించారని ఆ స్వామియే కోటిలింగేశ్వరుడని, శివుని అర్ధాంగి ఉమాదేవి కనుక ఇక్కడున్న స్వామి ఉమాకోటి లింగేశ్వరుడుగా ప్రసిద్ధిచెందాడు. శ్రీరాముడు తన అరణ్యవాస కాలంలో కాని లేదా బ్రహ్మహత్యా పాపపరిహారార్థము చేసిన తీర్థయాత్రా సందర్భములోగాని ఈ స్వామిని దర్శించినట్లు చెప్పబడుతోంది. ఆయన కొంత కాలమిక్కడ నివాసముండి ఈ క్షేత్రాన్ని సేవించుకొన్న గుర్తుగా ఇక్కడొక రామాలయముంది. రాజమండ్రిలోని ఈ ప్రదేశానికి కోటి లింగాలపేట అని పేరు. ఇక్కడ కొలువుదీరి ఉన్న శ్రీరాముడు కళ్యాణ రాముడు మరియు ఆనంద రాముడు. ఇది కూడ గిరి ప్రదేశమే గనుక దీనికి కూడ రామగిరి అనే పేరుండేది. ఇప్పుడది రామగిరిగా వాడుకలోలేదు. స్థల చరిత్ర వలన మాత్రమే మనకావిషయం తెలుస్తుంది. ఒకప్పుడు రాజమండ్రి పంచగిరులున్న పట్టణము. అందులో ఈ రామగిరి ఒకటి.

**శ్రీరామ ఘట్టక్షేత్రాలు :**

రామచంద్రపురం తాలుకాలో క్షణ ముక్తి రామేశ్వర క్షేత్రానికి దగ్గరగా రామఘట్టాలున్నవి. రామఘట్టాలంటే శ్రీరాముడు స్నానమాచరించిన గుర్తుగా ఉన్న స్నానఘట్టాలన్నమాట. ఇవి ఒకటి కాదు. ఇక్కడ శ్రీరాముడు స్నానమాచరిం చిన

గుర్తుగా శ్రీరామ పాదముద్రలు ఒక శిలాపీఠము మీద ఉన్నాయి. అవి ఆయన పాదముద్రలేఅని చెప్పబడుతున్నాయి. లేదా ఆయన పాదముద్రలకు గుర్తుగా శిలాపీఠం పైన చెక్కించి నిలిపిన పాదముద్రలు కావచ్చు. ఇక్కడ కూడ ఒక శివాలయముంది. రావణ వధానంతరము పాపపరిహారార్థము చేసిన ప్రతిష్ఠలలో ఇది కూడ ఒకటి అని చెప్పబడింది. భక్తులు మాఘమాసంలో ఈ శ్రీరామ ఘట్టాలకు వచ్చి ఆదివారం పవిత్ర స్నానాలు చేస్తారు.

**అన్నవరం :**

ఆంధ్రుల అభిమాన దైవంగా 118 సంవత్సరాల క్రితం రత్నాచలంపై వెలసి భక్తులు కోరిన కోరికలు తీరుస్తున్న శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి వారు కొలువు దీరిన కొండ ప్రక్కనే పంపానది నెమ్మదిగా ప్రవహిస్తూ ఉంటుంది. తూర్పు కనుమలు కూడ ఇక్కడి నుండే ప్రారంభమౌతాయి. శ్రీరాముడు అరణ్యవాసంలో ఈ ప్రాంతాన్ని దర్శించి ఈ పరిసరాల్లో పర్యటించి నట్లు స్థానికుల మాటల్లో వినిపిస్తుంది.

**దక్షారామం :**

దీనికే ద్రాక్షారామమని వ్యవహారనామం. యుగ యుగాలనాటి ప్రాచీన చరిత్ర కలిగిన స్వామి దాక్షారామ భీమేశ్వరుడు. అది దక్షయజ్ఞము కథతో ముడిపడిన ప్రదేశము. అక్కడ లక్ష్మీనారాయణ స్వామి క్షేత్రపాలకుడు. ఆ క్షేత్రపాలకుడైన లక్ష్మీనారాయణస్వామిని శ్రీరాముడు ప్రతిష్ఠించినట్లు చెప్పబడు తోంది. ఈ క్షేత్ర పరిసరాలో ద్వాదశ లింగాలు. అష్టశక్తులు అమ్మవారి పీఠములు, షోడశ (సప్తదశ కూడకావచ్చు) తీర్థాలున్నవి. ఆ ద్వాదశ లింగములలో ఒకరు వేదవతీ సమేత సప్త కోటి రామలింగేశ్వరుడు. అక్కడున్న తీర్థము రామేశ్వర తీర్థము. ఈ విధంగా దక్షారామక్షేత్రం శ్రీరాముడు మానవరూపంలో నడయాడిన నిదర్శనంగా పైనుదహరించిన దాక్షారామ క్షేత్రాంతర్గత విషయాలు గోచరి స్తాయి.

**సామాంతకుర్రు శివారు రామేశ్వరము :**

తూర్పుగోదావరి జిల్లాలోని చల్లపల్లికి 6 కి.మీల దూరము. కౌశిక సాగర సంగమస్థలి వద్ద రామేశ్వరస్వామి ఆలయముంది. శ్రీరాముడే ఈ స్వామిని ప్రతిష్ఠించాడు గనుక ఆయన పేరు మీద ఇక్కడున్న స్వామి రామేశ్వర స్వామియైనాడు. రావణ వధానంతరం బ్రహ్మహత్యా పాపపరిహారార్థం చేసిన ప్రతిష్ఠలలో ఇది కూడ

ఒకటి. శ్రీరాముని చేతికి వసిష్ఠుడు కట్టిన ముంజేతి కంకణం ఇక్కడే జారిపడినందున, వసిష్ఠుడు సూచించిన విధంగా ఈ ప్రతిష్ఠ జరిగింది.

## సీతానగరం :

రాజమండ్రికి 20 కి.మీల దూరంలో గోదావరి ఒడ్డున సీతానగర ముంది. ఈ ప్రాంతమంతా ఆనాడు దండకారణ్యము. వసిష్ఠుని సూచనపై ముంజేతికి కంకణం ధరించి వెళుతున్న సీతారామ లక్ష్మణులలో సీత ముంజేతి కంకణం జారిపడిన చోటు సీతానగరం. అక్కడ సీత పేరు మీద శివలింగము ప్రతిష్ఠితమై ఆతరువాత ఆ ప్రదేశము సీతానగరమైంది. మరొక సీతానగరము కృష్ణానదికి కుడివైపు ఒడ్డున ప్రకాశం బ్యారేజిని ఆనుకొని ఉంది. దానిని గురించి తరువాత చెప్పుకొందాం.

## ధవళేశ్వరము లేక ధవళగిరి :

రాజమండ్రికి అతి సమీపాన ఉన్న ధవళేశ్వరమే ధవళగిరి. రాజ మండ్రిలోని ఒకనాటి పంచగిరులలో ఇది కూడ ఒకటి. శ్రీరామ పట్టాభిషే కానంతరం శ్రీరాముని వద్ద నుండి వారి యొక్క కులదైవమైన శ్రీమహావిష్ణువు యొక్క అర్చామూర్తిని బహుమానపురస్సరంగా అందుకొన్న విభీషణుడు, ఆ మూర్తిని తీసికొని తిరుగు ప్రయాణమై, త్రోవలో ధవళగిరి చుట్టూ ప్రదక్షిణము చేస్తుండగా, చీకటిలో విభీషణుని పాదమొక మహర్షికి తగలడంతో ఆ మహర్షి విభీషణునికి చలనం లేకుండా చేశాడు. విభీషణుడు ప్రార్థింపగా శ్రీరాముడు వచ్చి మునులను క్షమింపుమని కోరగా, గౌతమిలో స్నానం చేస్తే దోషం తొలగుతుందని వారు చెప్పారు. ఆ విధంగా విభీషణుడు చేసిన తరువాత శ్రీరాముడు కూడ గౌతమిలో స్నానం చేసి రామలింగేశ్వరుని పేరుతో శివలింగ ప్రతిష్ఠ చేశాడు. ఇక్కడ ఇంకా ఇతర మహర్షులు ప్రతిష్ఠించిన శివలింగాలుండగా, ఆంజనేయస్వామి దేవాలయం, గిరిపాదము అగస్త్యేశ్వరస్వామి, నారద గుహ మైదలైనవి ఉన్నాయి. సీతారాముల పాదముద్రల చిహ్నాలున్నాయి. ఆంజనేయ స్వామి గుడి వద్దనున్న రెండు రావిచెట్లు సీతారాముల నాటివని చెప్పబడుతోంది. శ్రీరామ పాదముద్రలున్న క్షేత్రము గనుక ఈ ధవళగిరి ఉన్న ధవళేశ్వరం శ్రీరామపాదక్షేత్రమైంది. వసిష్ఠపాయ ఒడ్డునున్న నవజనార్ధనాలయాలలో ఒకటి ఇక్కడనే ఉన్నది.

## పేరవరం :

ఆత్రేయపుర మండలంలోని పేరవరం గ్రామానికి రామాయణ కథతో సంబంధముందని చెప్పబడుతోంది. ఆత్రేయపుర ప్రాంతమంతా ఆనాటి

దండకారణ్యములోని భాగము. బొబ్బర్లంక నుండి రావులపాలెం వెళ్లే బస్సు మార్గంలో బొబ్బర్లంకకు 3 కి.మీల దూరంలో ఉన్న పేరవరం పరిసరాలలో జటాయువు రావణాసురుని యెదిరించి యుద్ధము చేసిన ఘట్టము జరిగిందని స్థానిక చరిత్ర. శ్రీరాముడు అగ్ని సంస్కారము జరిపి పెండ్యాల రేవులో పిండప్రదానం చేశాడని చెప్పబడుతోంది. ఆ తరువాత జటాయువుకు మోక్ష ప్రాప్తికోసం శివలింగ ప్రతిష్ఠ చేశాడని చెప్పబడుతోంది. ఆ స్వామివారు శ్రీ ఉమారామలింగేశ్వరస్వామి.

అయితే భద్రాద్రి సమీపంలోనే జటాయు మరణం జరిగిందనే విషయానికి ఎక్కువ బలము కనిపిస్తోంది. ఒకవేళ జటాయు మరణం అక్కడే జరిగినా, శ్రీరాముడు మారీచాదుల ముక్తికోసం శివలింగ ప్రతిష్ఠలు చేసి నట్లుగా, జటాయువుకు ఉత్తమగతి సిద్ధించటం కోసము ఇక్కడ ఉమారామ లింగేశ్వరస్వామిని ప్రతిష్ఠించాడేమో!

**ఉప్పంగల :**

కాకినాడకు 40 కి.మీల దూరములోనున్న ఈ ప్రదేశానికి అరణ్యవాస కాలంలో సీతారామ లక్ష్మణులు వచ్చినట్లు చెప్పబడింది. శూర్పణఖ శ్రీరాముని కామించి భర్తగా కోరుకున్న సన్నివేశంలో లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసిన సన్నివేశం ఇక్కడే జరిగిందని చెప్పబడుతోంది. ముక్కు చెవులు కోసిన కత్తిని ఈ ప్రాంతములో ఉన్న గుండములో కడిగాడని స్థల చరిత్రగా చెప్పుకొంటారు. ఒక స్త్రీని అవమానించినందువలన కలిగిన పాపాన్ని పోగొట్టు కొనటానికై శ్రీరాముడిక్కడ శివలింగాన్ని ప్రతిష్ఠించాడు. ఆ స్వామి వారు రామ లింగేశ్వరస్వామి. ఆ ప్రాంతానికి శ్రీరామక్షేత్రమని పేరు వచ్చింది. అయితే ఖమ్మం జిల్లాలోని దుమ్ముగూడెంలో శూర్పణఖకు ముక్కు చెవులు కోయటం జరిగిందని ఆ ప్రదేశాన్ని గురించిన వివరంలో చెప్పుకున్నాం.

**శివకోడు :**

రావణుని సంహరించిన బ్రహ్మ హత్యాపాప నివారణార్థం శ్రీరాముడు కోటి లింగాలను ప్రతిష్ఠించాడని, అందులో చివరి శివలింగాన్ని కోనసీమలోని శివకోడులో ప్రతిష్ఠించాడని, అసలీ ప్రదేశము పేరు శివకోటి కాగా అది కాలక్రమంలో శివకోడుగా మారిందని చెప్పబడుతోంది. ఈ స్థలంలో ప్రతిష్ఠింపబడిన శివలింగంతో కోటి సంఖ్య పూర్తయినదట. ఇక్కడి స్వామివారి పేరు ఉమా శివలింగేశ్వరస్వామి. పశ్చిమ ముఖద్వారం, అతి పెద్దదయిన గర్భాలయంతో అలరారుతూ ఉంటుంది. శివకోడులోని లింగాన్ని తమ గ్రామానికి తరలిద్దామని విశ్వేశ్వరరాయ పురానికి

చెందిన కొందరు పెద్దలు ప్రయత్నించి, ఎంత లోతు తవ్వినా ఆ లింగాన్ని పైకి తీయటం సాధ్యం కాలే దని చెబుతారు. శివకోడు రాజోలుకు ఆగ్నేయంగా 3 కి.మీల దూరంలో ఉంది.

తూర్పుగోదావరి జిల్లా శ్రీరాముని వలన ప్రభావితమై, భక్తి భావ ప్రదర్శన అధికంగా చేసినట్లనిపిస్తుంది. ఈ జిల్లాలో రామేశ్వరస్వామి పేరుతో 3, రామలింగచౌడేశ్వరాలయాలు 4, శ్రీరామలింగేశ్వరస్వామి ఆలయాలు 46 మొత్తం కలిపి రామశబ్దంతో కూడిన శివాలయాలు 53 ఉన్నాయి. సమా చారము అందనివి మరికొన్ని ఉన్నవేమో తెలియదు.

**చీపురుపల్లి :**

తూర్పు గోదావరి జిల్లాలోని సీతానగరానికి సుమారొక 15 కి॥మీ॥ల దూరంలో చీపురుపల్లి అనే గ్రామముంది. దాని దగ్గర ఒక గుట్ట ఉంది. దానికి రామగిరిగుట్ట అని పేరు. సీతానగరానికి సీతారాములు వచ్చినప్పుడు బహుశా ఈ పరిసరాలకు కూడ వచ్చి ఉండవచ్చు. ఈ గుట్టను శ్రీరాముడు దర్శించి కొద్దిరోజులుండటంచేతనే ఈ గుట్టకాపేరు వచ్చినట్లు స్థానిక కథనము. మరొక ముఖ్యమైన విశేషమేమంటే ఈ గుట్టపైన ఈనాటికి కూడ రాత్రి 12 గంటలు దాటిన తరువాత భక్తి తత్పరతో రామనామం వినిపిస్తుంది. అది చేస్తున్నదెవరో మాత్రం తెలియదు. బహుశా ఆకాశగమనం గల మహర్షులై ఉండవచ్చునని అందరూ అనుకుంటూ ఉంటారు.

**పశ్చిమగోదావరి జిల్లా :**

ఖమ్మం, తూర్పుగోదావరి జిల్లాలతోబాటు శ్రీరాముడు పర్యటించిన ప్రదేశాలు పశ్చిమగోదావరిలో కూడ గణనీయంగానే కనిపిస్తాయి. గోదావరి నదికి ఇరువైపుల ఉన్న తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలోని ప్రదేశాలు అరణ్య పరిసర ప్రాంత భూములైనప్పటికీ వాల్మీకి మాటల్లో ఇవి కొంతవరకు ఆనాటి జనావాసాలున్న ప్రదేశాలై యుండవచ్చు. సీతను రావణుడు ఎత్తుకొని పోయింది జనస్థానము నుండి అంటాడు వాల్మీకి. ఆ జనస్థానంలో ఋష్యాశ్రమాలు, రాక్షసావాసాలు ఉన్నట్లుగా మనం గమనించాము. అవి కొంతవరకు సామాన్య జనావాసాలు కూడనేమో! అలా ఎందుకనుకోవలసి వస్తోందంటే - గోదావరీ పరిసర ప్రదేశాలు తృణ, కాష్ఠ, జలసమృద్ధి గల ప్రదేశాలు కావటమే కార ణము! అయితే జనస్థానమనే మాట

తప్ప గ్రామాదుల వర్ణన రామాయణంలో ఎక్కడా స్పష్టంగా కనిపించదు. అయినా శ్రీరాముడు పర్యటించిన ప్రదేశాలెన్నో పశ్చిమగోదావరి జిల్లాలో కనిపిస్తాయి.

ముందు ముఖ్యంగా రెండు ఏఱుల గురించి చెప్పుకుందాం. అవి రామిలేరు, తమ్మిలేరు. అరణ్యావాసంలోనున్న సీతారాములకు జలము అందుబాటులో లేకపోవటంతో రామలక్ష్మణులు అస్త్ర ప్రయోగం చేసి భూమి నుండి నీరు పైకి రప్పించారు. పైకి పెల్లుబికిన ఆ జల ప్రవాహాలు తరువాత ఏఱులైపారాయి. అవే రామిలేరు, తమ్మిలేరు. రాముడు ప్రవహింపజేసింది రామిలేరు కాగా, తమ్ముడు ప్రవహింపజేసింది తమ్ముడేరు - అదే తరువాత తమ్మిలేరుగా అయింది. ఇవి సృష్టింపబడినచోటు నుండి పశ్చిమ గోదావరి జిల్లాలో బాగా ప్రవహించి, కొంచెం కృష్ణాజిల్లా భూభాగాన్ని కూడ తాకివెళ్ళి కొల్లేరులో కలుస్తాయి. వీటి క్రింద ఖమ్మం జిల్లాలో కూడ కొంత ఆయకట్టు భూములుండి వ్యవసాయానికి ఉపయోగపడుతున్నాయి.

## మక్కెన వారి గూడెం :

పూర్వకాలము నుండి కూడ భారతదేశంలో జీవనానికి పాడి కూడ ముఖ్యమైన ఆధారమేనన్న సంగతి మనకు తెలిసిందే. ఈనాడు మక్కెనవారిగూడెం అని పేరున్న ప్రదేశంలో ఆనాడు యాదవకాంతలు తెల్లవారుఝామునుండి పగలంతా చల్ల చిలికి వెన్న తీస్తూనే ఉండేవారట. ఊరంతా చల్ల కవ్వాలతో చిలుకుతున్న మ్రోతలు, ఎడతెఱపి లేకుండా మ్రోగుతూ ఉంటే వినలేక సీతారాములు ఆ ప్రదేశాన్ని వదలి వెళ్ళిపోయారట!

## రాముని గట్టు :

ఎర్రగుంటపల్లినుండి టి. నర్సాపురం వెళ్ళే దారిలో 3 వ కి. తరువాత ప్రధాన రహదారికి సుమారొక అర కి.మీ. దూరంలో రాముని గట్టు అనే పేరుతో ఒక కొండ ఉంది. పూర్వమీ గట్టు దగ్గిర కొండగణిచర్ల అనే పేరుతో ఒక గ్రామం ఉండేదట. ఇప్పుడది లేదు పైన చెప్పుకొన్న మక్కెనవారి గూడెము నకు సమీపములోనే ఉంది. విస్సావఝుల రామయ్యగారు, విస్సావఝుల భాస్కర శాస్త్రి అనే వారు ఇద్దరన్నదమ్ముల బిడ్డలు. వారిద్దరికి రాముడు కలలో కనిపించి ఈ గట్టుమీదున్న శిథిల దేవాలయాన్ని బాగుచేయింపుమని చెప్పాడట ఆ అన్నదమ్ములిద్దరూ వేరువేరు ఊళ్ళల్లో ఉండేవారు. ఈ కల వచ్చిన మర్నాడు రామయ్యగారు, భాస్కరశాస్త్రి గారు ఈ విషయమై చర్చించేందుకు వారివారి ఊళ్ళనుండి బయలుదేరి వస్తూ ఒక చోట

ఎదురుపడి ఆ విషయం ఒకరికొకరు చెప్పుకొని ఆనందించారు. ఆ తరువాత రాముని సూచననుసరించి ఆ శిథిల దేవాలయాన్ని కొంత వరకు బాగుచేసి సుమారు ఒక 100 మెట్లు కట్టించారు. శ్రీరామనవమినాడిక్కడ కల్యాణం జరుగుతుంది. భద్రాచలంలో తలంబ్రాలు పడే సమయానికే ఇక్కడ కూడ కల్యాణం జరిగి తలంబ్రాలు పడటం జరుగుతుందట ఇది రిజర్వ్ ఫారెస్ట్‌లో ఉన్నది. అందుచేత అక్కడ జనావాసము ఇప్పుడేమీ లేదు. పూర్వము చింతలపూడి రెవెన్యూ అధికారి వచ్చి కావలసిన ఏర్పాట్లు చేసి కల్యాణాన్ని నిర్వహింపజేసేవారు. విస్సావఝల రామనాథం గారు అనే వారు పూర్వమీకల్యాణాదుల పౌరోహిత్యం నిర్వహిస్తూ ఉండేవారు. ఇప్పుడు వారి కుటుంబము ఎర్రగుంట్ల పల్లిలో లేదు. అయినా విస్సావఝల వారి కుటుంబము వారే ఇప్పుడు కూడ దేవాలయ విషయాలు చూస్తున్నారు. ఆ ప్రాంతీయ యమ్. ఆర్. ఓ గారు, జాయింట్ కలెక్టర్ గారు, ఫారెస్ట్ ఆఫీసర్ కూడా దేవాలయానికి సంబంధించిన విషయాలు ఇప్పుడు కూడ చూస్తున్నారు.

ఈ దేవాలయం ఒక గుహలాగా ఉంటుంది. సీతమ్మవారు అక్కడ వంట చేసుకొనేదట. గుహాలయంలో పొగచూరిన గుర్తులు కనిపిస్తాయి. ఇంకా పైన ఒక శిథిల దేవాలయం ఉంది. అది శ్రీరామునిచే పూజలందుకొన్న శివునిది 0అక్కడికి సమీపంలో ఒక కొనేరుకూడా ఉంది. శిథిలమైఉన్న ఆ గట్టు మీది గుర్తులు సీతారాములు నడయాడి నివసించిన గుర్తులు మాత్రమే కాదు ఆ నాటి దండకారణ్యంలో వారు అరణ్యవాసం చేసిన గుర్తులుగా కూడ నిలిచి ఉన్నాయి.

**వసంతవాడ :**

ఖమ్మం జిల్లా కూనవరం దగ్గరున్న వాలి సుగ్రీవుల కొండను గురించి చెప్పుకున్నప్పుడు కామరపుకోటలోని వాలి సుగ్రీవుల గుట్ట గురించి కూడ చెప్పుకున్నాం. ఇది వానరుల యొక్క నివాసాల విస్తృతిని తెలుపుతుంది. కిష్కింధకాండలోని వాలి సుగ్రీవుల కథకు గుర్తులు హంపీ, విజయనగరం, ఋష్యమూక పర్వతం, మాల్యవంతాల దగ్గర కనిపించినా ఇక్కడివరకు గూడ వారి నివాసాలో, పర్యటనో ఉన్నట్లు ఈ గుర్తులు తెలుపుతాయి. సుగ్రీవ - రాముల స్నేహానికి గుర్తుగా శ్రీరాముడే చేశాడో లేకపోతే సుగ్రీవుడే సంకల్పించి చేసిందో తెలియదుకాని వసంతవాడలో సుగ్రీవలింగేశ్వరాలయముంది. ఇది హనుమాన్ జంక్షన్‌కు దగ్గరలో ఉంది. ఈ గ్రామము చెఱువులో నుండి కూడ ఒక లింగం బయటపడిందట. అది రామలింగేశ్వరాలయమనే పేరుతో ప్రతిష్ఠితమై ఉంది.

అలాగే క్రింద చెప్పబోయే ప్రదేశాలలో శ్రీరాముని పేర కొన్నిచోట్ల, సీతపేరిట కొన్నిచోట్ల, లక్ష్మణుని పేరిట కొన్నిచోట్ల శివుడు ప్రతిష్ఠితమైయున్నాడు. ఆయన ప్రతిష్ఠింపకపోయినా, దర్శించిన ప్రదేశాలు కొన్ని ఆనాటికే అతి ప్రాచీనమైనవి. ముందుగా ఆయన దర్శించిన ప్రదేశాలు చూద్దాం.

**పట్టిసము :**

ఇది గోదావరి నదీ గర్భస్థమై ఉన్న స్థానము. దక్షయజ్ఞ సమయమున తనకు జరిగిన అవమానము భరింపలేక సతీదేవి యోగాగ్నిలో ఆత్మార్పణ చేసికోగా శివుడు సృష్టించిన వీరభద్రుడు దక్షుని తల పట్టసముతో ఖండించి, ఆ పట్టసమును కడిగిన క్షేత్రమిది. ఇది ఏమన్వంతరములోని ఏ యుగము నాటిదో చెప్పలేము. ఈ క్షేత్రాన్ని శ్రీరాముడు సందర్శించాడు. భావనారాయణ స్వామి, పరశురాముడు మొదలైన వారు సందర్శించారు. జాంబవంతుడిక్కడ తపస్సు చేశాడు. వీరభద్రావతార రూపంలో ఉన్న ఈశ్వరుని శాంతింపజేయ టానికి ఈశ్వరుడిక్కడ వెలిశాడు. అందుకు దేవకూటునికి ఈశ్వరుడిచ్చిన వరము కూడ కారణము.

**ఆచంట :**

మారుటేరుకు సమీపంలో ఉన్న ఆచంట చాల పురాతనమైన పుణ్యక్షేత్రం. స్వామివారు ఆచంటేశ్వరుడు. ఒక భక్తుడు ప్రియురాలి వక్షోజాన్ని శివలింగ రూపంగా భావించి అర్చించటంచేత ఆ స్వామి ఆచంటేశ్వరుడైనాడు. ముందు పరశురాముడు, ఆ తరువాత శ్రీరాముడు ఈ క్షేత్రాన్ని దర్శించారు. అజ్జరపు పేరయలింగకవిచే రచింపబడిన ఒడయనంబి విలాసము ఆధారముగా మనకు ఆచంటేశ్వరుని క్షేత్రమాహాత్మ్యము తెలుస్తుంది.

**లక్ష్మణేశ్వరము :**

లక్ష్మణేశ్వరమనే పేరుతోనే నరసాపురానికి 8కి.మీల దూరాన ఉన్న గ్రామంలో దుర్గాలక్ష్మణేశ్వరస్వామి ఆలయముంది. ఇది లక్ష్మణుని ప్రతిష్ఠయే అని రూఢిగా చెప్పబడింది. వసిష్ఠుని సూచనపై సీతారామలక్ష్మణులు ముంజేతికి కంకణాలు కట్టుకొని నడుస్తూ రాగా, లక్ష్మణుని ముంజేతి కంకణం ఇక్కడకు రాగానే జారిపడటంచేత లక్ష్మణుని చేత, ఆయన పేర శివలింగ ప్రతిష్ఠ ఇక్కడ చేయింపబడింది. సీతారాములు వారిపేరున చేసిన ప్రతిష్ఠలు గురించి తూర్పుగోదావరి జిల్లాలో చెప్పుకున్నాం. ఈ స్వామివారికి కొప్పు కూడ ఉన్నది గనుక స్వామివారు కొప్పులింగేశ్వరుడు కూడ అయినాడు. ఈ స్వామి వారికి కోడికూత, రోకటిపోటు

వినరానివి గనుక ఈ స్వామి దేవాలయానికి సమీపం లోని సంబరదీవిలో శంబరాసురుడు ఉండేవాడని, అతడు దుర్గను ఈశ్వరుణ్ణి పూజించే వాడని చెప్పబడింది. ఈ శంబరాసురుడు నివసించినదీవి ఆ సమీపంలోనే ఉంది. దానికి సంబరదీవి అని పేరు.

**పాలంగి :**

తణుకుకు 3కి.మీల దూరంలో ఉన్న పాలంగిలో శ్రీరాముడు సీతాసమేతంగా వచ్చి అక్కడ రామలింగేశ్వరుణ్ణి ప్రతిష్ఠించాడు. ఇది గోస్తనీ నదిలో ఉంటుంది. ఉత్తరాన గోస్తనీనది, తూర్పు దక్షిణ దిక్కులలో రామ ఘట తటాకం ఉన్నందున, స్వామికి ఎదురుగా శ్మశానవాటిక ఉన్నందున ఇది కాశీతో సమానమైన క్షేత్రంగా భావింపబడుతోంది. ఇది ఉండ్రాజవరం మండలంలో మండలానికి ఒక కిలోమీటరు దూరంలో ఉంది.



**పాలకొల్లు :**

తారకాసురుని కంఠమున ఉన్న దివ్యలింగము ఐదు ముక్కలై అందులో ఒక ముక్క పాలకొల్లులో శ్రీరామునిచేత ప్రతిష్ఠితము కావటం చేత క్షీరారామ లింగేశ్వర క్షేత్రమైంది.

**రాయకుదురు :**

భీమవరం - తణుకు బస్సు మార్గంలో ఉన్న రాయకుదురులో శ్రీరామ ప్రతిష్ఠితమైన ఈశ్వరలింగమొకటి ఉండగా, ప్రతిష్ఠా ముహూర్తానంతరం ఆంజనేయునిచే తీసికొని రాబడిన శివలింగము ఆంజనేయునిచేతనే ప్రతిష్ఠిత మైంది.

ఆ ప్రదేశము అంతకు ముందు అంత ఎక్కువ జనావాసమున్న ప్రదేశము కాదేమో! శ్రీకృష్ణదేవరాయలు ఆ ప్రదేశాన్ని దర్శించాడని, రాయలు విడిది చేసినచోటు గనుక, ఆయన పేరు మీద ఆ జనావాసానికి రాయకుదురని పేరు వచ్చిందని చెప్పబడుతోంది.

## నత్తారామేశ్వరము :

ఇది రామాయణ కాలమునకు ముందే ఉన్న క్షేత్రము. పరశురాముడు తండ్రి ఆజ్ఞపై తన తల్లి రేణుకాదేవిని వధించి, ఆ పాప పరిహారార్థము, తండ్రి సలహానుసరించి, గోస్తని యందు స్నానమాచరించి తన పూర్వతేజస్సును పొందిన ప్రదేశమిదియట. ఇక్కడ పరశురాముడొక శివలింగాన్ని ప్రతిష్ఠిం చాడు.

శ్రీరాముడు కూడ శివపూజాధురంధరుడైన రావణుని సంహరించిన పాపము తొలగుటకు రామేశ్వరములోవలె ఇక్కడ కూడ శివలింగ ప్రతిష్ఠ కావింప సంకల్పించి లింగబాణము (శిలామూర్తియైన లింగమే లింగబాణమన బడుతుంది) ముహూర్త కాలమునకు రానందున సీత స్వయముగా ఇసుక, నత్తగుల్ల పెంకులు మొదలగువానిచే రూపొందించిన శివలింగమును ప్రతి ష్ఠించెనట. ఆ లింగబాణములో నత్తగుల్ల పెంకులు కూడ ఉండుటచేత ఆ స్వామి నత్తారామేశ్వరుడైనాడు. ఆ ప్రదేశము నత్తారామేశ్వరమైనది. ఇది జలము లోనున్న శివలింగము కావటం చేత నీటిలోని నత్త గుల్లలు శివలింగాన్ని తాకుతూ ఉంటాయట. అందుచేత కూడ నత్తా రామేశ్వరమైందని ఒక అభిప్రాయం.

## ద్వారకా తిరుమల :

ద్వారకా తిరుమల త్రేతాయుగం నాటికే పుణ్యక్షేత్రమై విరాజిల్లుతోంది. కృతయుగమున శ్రీరంగనాయకుడు, త్రేతాయుగాన శ్రీరాముడు, ద్వాపరయుగంలో శ్రీ కృష్ణుడు, కలియుగాన శ్రీ వేంకటేశ్వరులు ఈ లోకానికి అధి దైవతములని చెప్పబడుతున్నా ద్వారక వంటి మరొక పట్టణము తిరుమల వంటి మరోగిరి త్రేతాయుగమునాటికే ఉండి ఆనాటికే ద్వారకా తిరుమల గిరీశుడు భక్తులను అనుగ్రహిస్తున్నాడు. తనపై భక్తి ప్రపత్తులను చూపని వారిని ముందుకు సాగనిచ్చేవాడు కూడ కాదు. అలా ద్వారకాతిరుమల దాటి వెళ్లిపోతున్న ఇందుమతీ అజమహారాజుల పయనం నిలుపుదలచేసి మరీ వారికి దర్శనం కలిగించాడు. ఈయన దశరథ మహారాజు తండ్రి. ఆ తరువాత దశరథ మహారాజు ద్వారకా తిరుమలను ఆయన పరిపాలనా కాలములో దర్శించాడు. సీతారాములు కూడ ఈ క్షేత్రాన్ని దర్శించుకున్నారు.

**సజ్జాపురం :**

తణుకుకు అతి సమీపములోనున్న సజ్జాపురాన్ని సీతారాములు దర్శించారు. వారితోబాటు విభీషణుడు కూడ సజ్జాపురం వచ్చాడు. రావణుని ప్రాణ మర్మాన్ని శ్రీరామునికి విభీషణుడు చెప్పటంచేతనే రావణుడు శ్రీరాముని చేతిలో వధింపబడ్డాడు. ఆ ప్రాణ మర్మ స్థానం నాభి అని చెప్పిన విభీషణుని పాపం పరిహారము కావటానికి శ్రీరాముని సూచనమేరకు విభీషణుడిక్కడ శివ ప్రతిష్ఠచేశాడు. ఆ స్వామి ఉమాసోమేశ్వరుడు.

**కృష్ణాజిల్లా :**

**ప్రాకెర్ల, బలివె :**

శ్రీరాముడు నిడుమోలుకు సమీపంలో పామర్రు మండలములోని కొరిమెర్లకు ఒక కి.మీ దూరంలో ఉన్న ప్రాకెర్లను సందర్శించి అక్కడ రామలింగేశ్వరుణ్ణి ప్రతిష్ఠించాడు. అలాగే నూజివీడుకు దగ్గరలో ఉన్న ముసునూరుకు సమీపంలో ఉన్న బలివెలో కూడ శ్రీరామునిచే శ్రీరామలింగేశ్వర ప్రతిష్ఠ జరిగింది. ఈ రెండు దేవాలయాల విషయంలో ఒక ప్రత్యేకత ఉంది. ఈ రెండు ఆలయాలకు అతి సమీపంలో జలకుండములున్నాయి. వాని వద్ద నిలబడి "హర హరా" అంటే కుండము నుండి బుడ బుడమని శబ్దము చేస్తూ ఐదు బుడగలు వచ్చేవి. ఆ బుడగలు ఇప్పుడు రావటం లేదు. కాని వృద్ధులిప్పటికి ఆ విధంగా జరగటం వారు తమ చిన్నతనంలో చూశామని చెబుతున్నారు. బలివె గ్రామములోని రామలింగేశ్వరస్వామిని బలేరామస్వామి అంటారు. కాలగతిలో బలివె పేరేమారి బలివె రామలింగేశ్వరుడు – బలేరామలింగేశ్వరుడైనాడట! బలివె ఒకప్పుడు బలిచక్రవర్తి పాలనలోని స్థానమట! ఆకారణముచేత బలి చక్రవర్తి పేరుతో ముడిపడి ఆ'బలే' శబ్దం ఏర్పడిందని ఒక అభిప్రాయము. ఈ పరిసరాలలో 101 శివలింగాలు ప్రతిష్ఠింపబడి ఉండే వని తెలుస్తుంది. కాని వానిలో చాల వరకు కాలగతిలో కలసిపోగా ఇప్పుడా పరిసరాలలో నాలుగైదు మాత్రమేమిగిలి ఉన్నవి.

ఒకే చోట ఒక శివలింగాన్ని కాక అధికసంఖ్యలో శివలింగాలు ప్రతిష్ఠింపబడి ఉండటం వలన, అరణ్యవాసంలో కాక శ్రీరాముడు పట్టాభిషేకానంతరం వచ్చినప్పుడు చేసిన ప్రతిష్ఠలలోనివిగా అనిపిస్తుంది. అరణ్యవాసంలో ఉన్న ప్పుడు అవసరాన్ని బట్టి నిత్యానుష్ఠానం కోసం ఒక్కొక్కటి మాత్రమే ఆయన నిలిపి పూజించాడు.

ఈ క్షేత్రంలో మరొక శివాలయముంది. ఆ స్వామి పేరు మృత్యుమల్లే శ్వరుడు. దీనిని తాతగారి గుడి అనిపిలుస్తారు. ఇక్కడ జరిగే రథోత్సవము నాడు - రామలింగేశ్వరస్వామి ఉత్సవానికి బయలుదేరేముందే, మృత్యు మల్లికా ర్జునస్వామి వద్దకువెళ్లి, ఆయన ఆశీస్సులు తీసికొని, ఆ తరువాతనే ఉత్సవానికి బయలుదేరటం సంప్రదాయంగా ఉంది ఇప్పటికీ అలాగే జరుగు తోంది.

## గొల్లపల్లి :

ఈ గ్రామం హనుమాన్ జంక్షన్ నుండి నూజివీడు వెళ్లే మార్గంలో మీర్జాపురం దాటిన తరువాత రహదారి మీదనున్న గ్రామం. ఇక్కడి రఘునాథ స్వామి ఆలయానికి సంబంధించిన కథ లోయపురి చరిత్ర లేక యదుపురి చరిత్ర అనే పుస్తకంలో గ్రంథస్థమై ఉంది. నూజివీడు వైపు నుండి ఒకరైతు తాటాకుల బండి తోలుకొని చదలవాడ పోతుంటే దారిలో ముగ్గురు వ్యక్తులు బండి యెక్కి, ఈనాడు గొల్లపల్లి ఉన్న ప్రదేశం దాకా వచ్చి అక్కడ దిగిపో యారట!ఆ బండిమీదున్న రైతుతో నీవు ఇకవెళ్లు - మేమిక్కడ ఉంటామని చెప్పారు. ఆ మాటలు చెప్పిన వ్యక్తులు ముగ్గురు క్షణంలో మాయమైనారట! వారే సీతారామలక్ష్మణులు! ఆ తర్వాత ఆ గ్రామంలో వెలిశారు. అక్కడ వెలసిన స్వామి పేరు రఘునాయక స్వామి! అక్కడ నీరు లేకపోవటంతో శ్రీరాముడు అస్త్రప్రయోగం చేసి సృష్టించాడట! ఆలయ ప్రాంగణంలోనే ఆ బావి ఉంది. కొద్దికాలం క్రితం వరకు ఆ బావిలో ఒక వెదురు కఱ్ఱ శ్రీరాముడు ప్రయోగించిన అస్త్రానికి గుర్తుగా ఉండేదట! 2003వేసవిలో ఆ కఱ్ఱను తీసివేశారు.

ఈ గ్రామానికి రామిలేరు ఒక కిమీ దూరంలో ఉంది. రామిలేరులో శ్రీరాముడు స్నానమాచరించాడట! అరణ్య వాసంలో శ్రీరామాదులక్కడ నడయాడి స్నానమాచరించిన గుర్తుగా రామపాదాలు శిలారూపంలో ఉన్నవి. ఈ పాదశిల క్రింద నీరు ఊరుతూ ఉంటుంది.

## 4. హనుమాన్ జంక్షన్ :

నూజివీడు నుండి హనుమాన్ జంక్షన్‌కు వచ్చే మార్గంలో ఉన్న గొల్లపల్లి గురించి చెప్పుకున్నాం! అదే రహదారి తిన్నగా గుడివాడ వైపుకు సాగుతుంది. ఏలూరు నుండి విజయవాడ వెళ్లే ప్రధాన రహదారి, నూజివీడు - గుడివాడ రహదారి - ఈ రెండింటి కూడలి లేక జంక్షనే "హనుమాన్ జంక్షన్" ఈ కూడలి హనుమాన్ జంక్షన్‌అనే పేరుతో పిలవబడటానికి కారణం తెలుసు కుందాం!

ఆనాడు సీతారాములు ఆ మార్గం వెంట నడుస్తూ అక్కడకు వచ్చేసరికి వారికి బాగా ఆకలి వేసిందట! అందుచేత వారు ఆంజనేయుణ్ణి తినేటందుకు ఏదైనా వెదకి తెమ్మని పంపారట! ఆంజనేయుడు చాలవేగంగా వెళ్లి వెదకి వెదకి ఎక్కడో అరటిపళ్ల గెల లభిస్తే ఆగెల పట్టుకొని వేగంగా వస్తూ ఉన్న సమయానికి సీతారాములిద్దరూ ఒకరి ప్రక్కన ఒకరు నడుస్తూ వెళుతున్నారు. సీత రామునికి ఎడమవైపు ఉండటం సహజమే కదా! ఆంజనేయుడు కొంత దూరము నుండే ఆహారము లభ్యమైందని, వెనుకనుండి కేకవేశాడు. ఆ కేక విన్న వాళ్లిద్దరు వెనుకకు తిరిగి నిలబడ్డారు. అంటే... వెనుకకు తిరిగి నిలబడిన స్థితిలో సీతకు ఎడమవైపు రాముడు నిలబడినట్లైంది. అదే విషయానికి నిదర్శనముగా హనుమాన్ జంక్షన్‌లో ఉన్న సీతారామాలయములో సీతకు రాముడు ఎడమవైపు ఉంటాడు. ఆ చిన్న ఆలయం రహదారి ప్రక్కనే ఉంటుంది. వారికి అభిముఖంగా ఉన్న వేరొక మందిరంలో అరటి పళ్ల గెలను ఎడమచేతిలో పట్టుకొని ఆంజనేయుడు వారికి చూపుతున్నట్లుగా కనిపిస్తూ గమనంలో ఉన్నట్లు నెలకొని ఉన్నాడు. రెండు రోడ్ల జంక్షన్‌లో పరస్పరాభి ముఖంగా ఉన్న ఈ రెండు ఆలయాలు ఆ మార్గాన వారు పయనించిన గుర్తుగా ఆంధ్ర భక్తజనులు ఆలయ నిర్మాణం చేసి నిలిపి ఉంచారు. వాటిని ఇప్పుడు కూడ మనం చూడవచ్చు. ఈ రెండు ఆలయాలకు మధ్య గుడివాడ వెళ్లే రోడ్డు ఉంటుంది. అయితే ఈ ఆంజనేయుని మందిరాన్ని వుయ్యూరు జమిందారులైన "మేకా" వంశములోని వారిలో ఒకరు – వారికి శ్రీ ఆంజనేయుడు ఆకలి తీరటానికి అరటిపళ్లను మర్కట రూపంలో ఇవ్వటం చేత, వారీ మందిరాన్ని మొదటగా ఏర్పాటు చేశారని వాడుకలో ఉంది. పూర్వమిక్కడేమీ జనావాస ముండేది కాదు. తర్వాత ఏర్పాడింది. హనుమానునితో ముడిపడిన కూడలి కనుక, కాలగతిలో మందిరము ఏర్పడి ఉండటం చేత ఆంగ్లేయ భాషాప్రభా వంతో జంక్షన్ అనే పేరు ఆ స్థలానికి ఏర్పడి, ఆ జనావాసానికి హనుమాన్ జంక్షన్ అనే పేరు ఏర్పడింది.

## 5. ముస్తాబాద :

విజయవాడకు సుమారు 12 కి.మీల దూరంలో ముస్తాబాద అనే గ్రామముంది విజయవాడ – ఏలూరు రైలు మార్గములోని ముస్తాబాద్‌స్టేషన్ ఈ గ్రామానిదే! ఇది ఒక కొండ పాద ప్రదేశమున్న గ్రామం. ఈ కొండకు మరొక ప్రక్కగా వెదురుపావులూరనే గ్రామముంది. ఈ కొండమీద ఒక గుహ వంటి ప్రదేశములో శ్రీరాముని చేపూజలందకొన్న శ్రీ రామలింగేశ్వర స్వామి నెలకొని ఉన్నాడు. ప్రక్కనే ఉన్న మరొక గుహవంటి ప్రదేశములో శ్రీరాముడు కొలువుదీరి ఉన్నాడు. శ్రీరాముడు

దర్శించిన అన్ని ప్రదేశాలలో వలెనే ఇక్కడ కూడ ఆయన ఈ స్థానాన్ని దర్శించిన గుర్తుగా తరువాత శ్రీరాముడిక్కడ నెలకొల్పబడి అర్చింపబడినాడేమో! అదే గుహలోని ఒక గోడపైన శ్రీ ఆంజనేయుని మూర్తి కూడ రూపొందింపబడి ఉంది. ఆ రూపము గోడపైన చెక్కిన శిలారూపమే గాని విడిగా నిలిపిన విగ్రహమూర్తి కాదు.

కొండపైకి ఎక్కటానికి చక్కగా మెట్ల ఏర్పాటున్నది. ఈనాటికి శ్రీరామార్చితుడైన శ్రీరామలింగేశ్వరునికి నిత్యార్చనావిధులు చక్కగా జరుగుతున్నవి.

**ఐలూరు :**

కృష్ణానదికి ఒక వైపు ఒడ్డున చిలుమూరులో శ్రీరామునిచే ప్రతిష్ఠితమైన ఒక రామేశ్వరస్వామి ఉంటే రెండవ వైపు ఒడ్డున ఐలూరులో శ్రీరామునిచే ప్రతిష్ఠితమైన మరొక రామేశ్వరస్వామి ఉన్నాడు. ఆ విధంగా చిలుమూరు, ఐలూరులలో ఉన్న రామేశ్వర క్షేత్రాలు రెంటిని కలిపి ఉభయ రామేశ్వర క్షేత్రాలని పిలుస్తారు. ఈ విషయాన్ని మనం స్కాందపురాణం సహ్యాద్రి ఖండంలో చూడవచ్చు.

***కృష్ణా యాశ్చోభయతటే లింగం రామేశ్వరాహ్వయమ్***
***పురాస్థాపితవాన్ రామో శ్రీమాన్ రాజీవలోచనః*** **(శ్లో॥47)**

## 7. దివిసీమ :

కృష్ణాజిల్లాలోని దివిసీమకొక విశిష్టత ఉంది. ఇది అసలు దీవిసీమ. అయినా వాడుకలో దీవి 'దివి'యై దివిసీమ అయింది. అనేక పుణ్యక్షేత్రాలతో, పవిత్ర కృష్ణానదీస్నాన ఘట్టాలతో ఈ ప్రదేశము పునీతం కావటంతో నిజంగా ఇది దివిసీమ అయిందనిపిస్తుంది. కృష్ణానదికి ఉభయపార్శ్వాలలో ఒకే పేరున శివకేశవులు ప్రతిష్ఠితులై ఉభయతీర క్షేత్రాలేర్పడినవి. వాటిని గురించి తెలుసుకుందాం. కృష్ణకు ఉభయ తీరాలపై నిలచి ఉన్న ఐలూరు - చిలుమూరు రామేశ్వరక్షేత్రాల గురించి పైన చెప్పుకున్నాం.

**పాపనాశనం - కోటిపల్లి :**

ఐలూరుకు సమీపంలోనే ఉన్న పాపవినాశనం, దానికి తిన్నగా కృష్ణకు పడమటి ఒడ్డునున్న కోటిపల్లి (అసలు పేరు కోటిఫలి) ఈ రెండు ఉభయ సోమేశ్వర క్షేత్రాలు. పాపనాశనం తీర్థంలో స్నానం, పితరులకు పిండ ప్రదానం, కోటిపల్లి సోమేశ్వరుణ్ణి దర్శించటం, సోమేశ్వరుల ప్రసాదాన్ని పొందటం సాధారణంగా

లభించేవి కావని స్కాందపురాణం సహ్యాద్రి ఖండం చెబుతుంది. (సహ్యాద్రి ఖండం 1-6 శ్లోకాలు) ఈ ఉభయ సోమేశ్వరులను శ్రీరాముడే ప్రతిష్ఠించాడని చెబుతారు.

## అవనిజాపురం లేక అవనిగడ్డ మరియు గుంటూరు జిల్లా నల్లూరు :

అవనిగడ్డకు ఒకప్పుడు అవనిజాపురమనే పేరుండేదట. అవనిజయైన సీత కొంతకాలమక్కడ ఉండటమే దీనికి కారణము. పులిగడ్డ నుండి అవనిగడ్డ గ్రామంలోకి వెళ్లుతూ ఉంటే, దారి ప్రక్కనే ఈనాటికీ సీతాయలంక అనే పేరుతో ఒక జనావాసముంది. ఒకప్పుడది లంక - ఇప్పుడు జనావాసమైంది.

సీతాయలంకలో సీతకొంతకాలమున్నదని, అక్కడ వసిష్ఠాశ్రమంలో శ్రీరాముడామెకు వసిష్ఠునిచేత వివిధ ధర్మ విషయ శ్రవణము చేయించాడని చెప్పబడింది.

**అస్మిన్ క్షేత్రే తపస్తేపే వసిష్ఠో భాగవన్మునిః**
**అవనీ తనూజా సీతా వసిష్ఠస్యాంతికే స్థితా**
**ధర్మాంచ్ఛృత్వాచసాదేవీ పూజయామాససాదరమ్**
**యాతోఽ వనిసుతాఽ వాసే దవనీపురమీరితమ్**

*(స్కాంద 29-18,19)*

ఆ విధంగా అవనిజాపురం కొంతకాలానికి అవనీపురమై నేడు అవనిగడ్డ అయింది. అదే విధంగా పైన పేర్కొన బడిన పులిగడ్డ ఒకప్పుడు వ్యాఘ్రపాద మహర్షి ఆశ్రమమున్న ప్రదేశమని, ఆదే తరువాత వ్యాఘ్రేశ్వరపురమని పిలువబడి తరువాత పులిగడ్డ అయింది. అలాగే వసిష్ఠాశ్రమ ప్రాంతము వసిష్ఠమెట్ట అయింది. ఈ పరిసరములో వ్యాఘ్రపాదమహర్షి ఆశ్రమముండేదని మోపిదేవి సుబ్రహ్మణ్యస్వామి క్షేత్ర చరిత్ర కూడ చెబుతుంది.

"వ్యాఘ్రేశ్వరాత్ పూర్వదిగ్భాగే కుమారక్షేత్రే...." అని వర్ణింపబడటం దీన్ని బలపరుస్తుంది. అవనిగడ్డ లక్ష్మీనారాయణ స్వామి దేవాలయం పూర్వం లక్ష్మీపతి లంక అనే పేరుగల లంకలో ఉండేదని, నదీపాతం వలన దేవాలయం నష్టమైపోగా తరువాతి కాలంలో అవనిగడ్డలో ఇప్పుడున్న స్థానములో పునఃప్రతిష్ఠితమై రెండవకులోత్తుంగ చోడ గొంకదేవునిచే గోపురాదులు నిర్మింపబడి అభివృద్ధి చెందినట్లు చారిత్రక ఆధారాలు తెలుపుతున్నవి.

బ్రహ్మ హత్యాదోష నివారణార్ధము శ్రీరామచంద్రుడు ఎన్నో ప్రదేశాల్లో శివలింగాలు ప్రతిష్ఠించినా ఇక్ష్వాకుల కులదైవము శ్రీమహావిష్ణువే! ఆయనను శ్రీరంగ నాయకుని రూపంలో ఇక్ష్వాకు వంశములోని పూర్వులు బ్రహ్మదేవుని వద్ద నుండి, అంతకు ముందుతరాలలోనే అందుకొని ఉన్నారు. అయినా ఎందుకో శ్రీరాముడు మాత్రం నిత్య శివపూజానిరతుడుగా కనిపిస్తాడు. ఆయన శ్రీ మహావిష్ణురూపాన్ని ప్రతిష్ఠించిన సందర్భాలు చాల తక్కువ. కాని అవని గడ్డలోని లక్ష్మీనారాయణ స్వామిని, అదే విధంగా కృష్ణకు అవతలి వైపున నల్లూరులో లక్ష్మీనారాయణుని కూడ ఆయనే ప్రతిష్ఠించి సేవించు కున్నాడు. అందుచేత ఈ రెండు క్షేత్రాలు కలసి ఉభయ నారాయణ క్షేత్రాలైనవి! (ద్రాక్షారామ భీమేశ్వరస్వామి దేవాలయములో క్షేత్రపాలకుడైన లక్ష్మీనారా యణుని కూడ శ్రీరామచంద్రుడే ప్రతిష్ఠించాడని ఇంతకుముందే చెప్పుకు న్నాము) ఈ లక్ష్మీనారాయణులు శ్రీరామునిచే ప్రతిష్ఠితమైనట్లు స్కాందపురాణం, సహ్యాద్రి ఖండంలో ఈ విధంగా ఉంది.

**మధ్య వ్యాఘ్రేశ్వర క్షేత్రే వ్యాఘ్రపాదాశ్రమంపరమ్**
**తస్మాచ్చ దక్షిణేభాగే విష్ణుక్షేత్రం మహత్తరమ్** శ్లో॥15

**యత్రనారాయణోదేవో లక్ష్మీయుక్తో సనాతనః**
**వేణ్ణాయాః పూర్వభాగేతు పురా రామ ప్రతిష్ఠితాం** శ్లో॥16

**తథైవ పశ్చిమే తీరే ఏతన్మూర్తిః ప్రతిష్ఠితః**
**నారాయణ ద్వయం క్షేత్రంతతః ప్రోక్తమ్ మహాశుభమ్** శ్లో॥17

## 9. వేకనూరు - మోర్తోట : ఉభయముక్తేశ్వరాలయాలు :

కృష్ణకు తూర్పుననున్న వేకనూరులోను, పడమటి వైపునున్న మోర్తోటలోను శ్రీరాముడు (కాకుస్థుడు) ఉభయ ముక్తేశ్వరులను ప్రతిష్ఠించాడు.

**తస్మాచ్చదక్షిణే భాగే ముక్తి క్షేత్ర ముదాహృతమ్**
**యత్ర ముక్తేశ్వరోదేవో కాకుస్థేన ప్రతిష్ఠితాం**

(సహ్యాద్రి ఖండం శ్లో॥23)

రామ రావణ యుద్ధంలో వధింపబడిన వారికి పుణ్యలోక ప్రాప్తితో బాటు, రావణుని వంటి వాని బ్రహ్మహత్యా దోషము నుండి తనకు కూడ ముక్తి లభించాలని కోరుతూ ఈ ప్రతిష్ఠలు చేసి ఈ విధంగా పేరు పెట్టాడనిపిస్తుంది.

## 10. కళ్లేపల్లి - పిట్టల్లంక : ఉభయ నాగేశ్వరక్షేత్రాలు

కదళీపురమని, కర్కోటక క్షేత్రమని పురాణ ప్రసిద్ధివహించిన పెదకళ్లేపల్లిలోని నాగేశ్వరస్వామిని, కృష్ణ అవతలి ఒడ్డునున్న పిట్టల్లంకలోని నాగేశ్వరస్వామిని కూడ శ్రీరాముడే ప్రతిష్ఠించాడని చెప్పబడుతోంది (చూ: కనకదుర్గా క్షేత్ర మాహత్మ్యము పుట 36) అయితే సహ్యాద్రి ఖండంలో ఈ విషయం లేదు. శ్రీరాముడు కళ్లేపల్లి క్షేత్రానికి వచ్చాడని, అక్కడ ఉండి అగస్త్య మహాముని నుండి ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని విన్నాడని పద్మ పురాణం చెబుతుంది. ఇక్కడే కృష్ణానది ఉత్తర వాహినియై ప్రవహిస్తుంది. ఇక్కడ వసిష్ఠ, విశ్వా మిత్రులిద్దరూ కూడ తపస్సు చేశారని చెప్పబడింది.

**తపస్తప్తుం ప్రచక్రాతే - వసిష్ఠస్సిద్ధిమాప్తవాన్**
**విశ్వామిత్ర స్సిద్ధికామీ - విష్ణుమారాధ్య చాప్తవాన్॥**

విశ్వామిత్రుడీ క్షేత్రంలో మదన గోపాలుణ్ణి ప్రతిష్ఠించాడు.

ఈ విధంగా మనం ఉభయ రామేశ్వర, ఉభయ సోమేశ్వర, ఉభయ నారాయణ, ఉభయ ముక్తేశ్వర, ఉభయ నాగేశ్వర క్షేత్రాలతో శ్రీరామునికి గల సంబంధాన్ని గురించి తెలుసుకున్నాము.

## 11. అయోధ్య :

ఉత్తర ప్రదేశ్‌లోని అయోధ్య కాక కృష్ణాజిల్లా దివిసీమలో ఒక అయోధ్య ఉంది. దక్షిణ కాశిగా చెప్పబడే పెదకళ్లేపల్లికి పశ్చిమ దిక్కులో సీతారాములు నివసించిన ప్రదేశానికి ఒకప్పుడు సీతారామపురమనే పేరుండేదట. ఆ సీతరామపురాన్ని ప్రజలు భక్తి ప్రపత్తులతో అయోధ్యగా భావించుకొని, ఆ తరువాత అలాపిలుచుకోగా, ఆ పేరు ఈ నాటికీ అయోధ్యగానే నిలచి ఉంది.

## 12. గుడివాడ :

గుడివాడకు గృధ్రవాటిక అనే పేరుండేదని, జటాయువు రావణుని ఎదిరించిన ప్రదేశమిదేనని, గృధ్రము ఎదిరించిన స్థానము గనుక గృధవాటికగా పిలువబడేదని, ఆ తరువాత గుడివాడగా పిలువబడుతోందని చెప్పబడింది. అయితే జటాయువు ఎదిరించిన ప్రదేశాలుగా ఖమ్మం జిల్లాలోని ఎటపాక మాత్రమే కాక, వినుకొండ, జటప్రోలు, లేపాక్షి అనే ప్రదేశాలు కూడ చెప్పబడుతున్నవి.

## 13. వేదాద్రి :

ఇది జగ్గయ్యపేటకు 12 కి.మీల దూరంలో ఉంది. ఇది పంచనారసింహ క్షేత్రం. అంటే స్వామివారు ఐదు రూపాల్లో దర్శనమిస్తారు. కృష్ణకు అభిముఖంగా ఉన్న కొండ పైన యోగనరసింహునిగా, కృష్ణానదీ గర్భంలో సాల గ్రామ నరసింహునిగా, వేదాద్రికి 5 కి.మీల దూరములోనున్న గరుడాచలము కొండగుహలో వీర నరసింహునిగా, ఇంకా ఈ క్షేత్రంలో జ్వాలా నరసింహునిగా, లక్ష్మీనరసింహునిగా దర్శనమిస్తున్నాడు. వేదాలు ఈ క్షేత్రంలో కొండల రూపంలో వెలసి ఉన్నాయిగనుక ఈ క్షేత్రానికి వేదాద్రి అనే పేరు వచ్చిందని పురాణాలు చెబుతున్నవి. శ్రీరాముడీ క్షేత్రాన్ని దర్శించినట్లు చెప్పబడింది.

## 14. ముక్త్యాల :

జగ్గయ్యపేటకు 10 కి.మీల దూరంలో కృష్ణ ఒడ్డున ముక్త్యాల గ్రామంలో భవాని దేవితో గూడి కృష్ణానదీ గర్భంలోను, గ్రామం మధ్య ఆలయంలోను శ్రీ ముక్తేశ్వరస్వామి వెలసి ఉన్నాడు. కృతయుగము నాటికి బలి చక్రవర్తికి ఈశ్వరుడు తాను వరమనుగ్రహించిన విధముగా ముక్త్యాల తీర్ధమున సాల గ్రామ రూపంలో అవతరించాడని స్థల పురాణం చెబుతుంది. ఇక్కడ ఉన్న కొండకు భరద్వాజ పర్వతమనే పేరున్నదని, అంతకు పూర్వమీ పర్వతము శ్వేత శృంగాద్రిగా పిలువబడేదని చెప్పబడింది. బలి చక్రవర్తి చేత నిర్మింపబడి ఒక బంగారు దేవాలయము నదీగర్భంలో ఉండేదని చెప్పబడుతోంది. శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణసమేతుడై ఈ క్షేత్రానికి వచ్చి స్వామిని సేవించు కొన్నట్లు తాతంభట్టు గురుమూర్తి శాస్త్రి రచించిన కృష్ణామాహాత్మ్యము అనే గ్రంథము వలన తెలుస్తుంది.

## 15. జగ్గయ్యపేట :

శ్రీరామునితో సంబంధమున్న మరొక ప్రదేశము జగ్గయ్యపేట. శ్రీరాముడీ పట్టణంలో ఉన్న శ్రీ భవానీ ముక్తేశ్వరాలయాన్ని దర్శించినట్లు చెప్పబడుతోది. ఆయన వచ్చి వెళ్లిన తరువాత ఆ గ్రామ ప్రజలు ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీరాముని ఆలయం కూడ అక్కడ నిర్మించారట. ఈ విషయమిలా ఉండగా శ్రీరాముడు తన పట్టాభిషేకానంతరం అందరికీ బహుమా నాలిస్తూ విభీషణునికి, బ్రహ్మదేవుడు తమ వంశీయులకు – దేవలోకాన్ని పీడిస్తున్న రాక్షస సంహారము చేసినందుకు గుర్తుగా – ఇచ్చిన శ్రీ మహావిష్ణువు యొక్క అర్చామూర్తిని ఇచ్చివేశాడట! ఆమూర్తిని తీసికొని విభీషణుడు వెళుతుండగా కావేరీ నది ఒడ్డున శ్రీరంగం దగ్గర ఆయన విమానం

ఆగిపోయిందట! స్వామి వారు భారతదేశం దాటి రాను అని చెప్పారట! అందుచేత ఆ అర్చా మూర్తిని శ్రీరంగంలో విభీషణుడు ప్రతిష్ఠించాడట! ఆయనే శ్రీ రంగశాయి! శ్రీరంగంలో శయన భంగిమలో ఉంటాడు గనుక శ్రీ రంగశాయి అయినాడు.

ఈ పైన జెప్పిన కథకు జగ్గయ్యపేటకు సంబంధమేమంటే 'శ్రీరామ్' వంశీయులు (శ్రీరామ్ అనే ఇంటి పేరుగల వారు) జగ్గయ్యపేటలో ఉన్నారు. తాను జగ్గయ్యపేటలో ఉండాలన్న కోరికను శ్రీరంగనాథుడు శ్రీరామ్ వంశీయులకు కలలో కనిపించి చెప్పటంతో, ఆ వంశీయులు శ్రీరంగశాయి ప్రతిరూపాన్ని జగ్గయ్యపేటలో ప్రతిష్ఠించారు. అయితే అది పూర్వము రామాలయమున్నచోట జరిగిందని, ఆనాటి రామాలయము ఇప్పుడు లేదని చెప్పబడుతోంది. ఈనాటి జగ్గయ్యపేటకు పూర్వ నామము బేతవోలు - చరిత్రలో ఆ విధంగానే ఉంది.

## 16. సంగమేశ్వరము :

కృష్ణాజిల్లాలో ఉన్న సంగమేశ్వర క్షేత్రము దివిసీమ చివర కృష్ణానది సముద్రంతో సంగమించే చోట ఉంది. ఇక్కడ కొలువుదీరి ఉన్న సంగమేశ్వరుణ్ణి శ్రీరామచంద్రుడు దర్శించినట్లు చెప్పబడుతోంది. ఈనాటికి కూడ ఇక్కడ సంగమేశ్వరునికి శివరాత్రి మహోత్సవము కడువేడుకగా జరుగుతుంది.

## చనుబండ :

కృష్ణా ఖమ్మం జిల్లాల సరిహద్దు గ్రామాలుగా చెప్పవచ్చుననిపించే చనుబండ గ్రామం విస్సన్నపేటకు సుమారు 11 కి.మీల దూరంలో ఉంది. ఇక్కడ ఉన్న ఒక బండమిద శ్రీరామచంద్రుడు ప్రయాణంలో కలిగిన అలసట పోవటానికి కూర్చుని సేదదీర్చుకొని విశ్రాంతి పొందాడని స్థానికుల కథనం. చను మార్గమున శ్రీరాముడు కూర్చుని సేదదీరిన బండ కనుక అది చను (మార్గమున నున్న) బండగా పేరు వచ్చి ఆ తరువాత ఆ గ్రామం కూడ అదే పేరుతో స్థిరపడిందనే అభిప్రాయముంది. క్రీ॥శ॥ 1713వ సంవత్సరము వరకు అక్కడ గ్రామములేదు. నరసింహరావుపాలేనికి చెందిన పుచ్చకాయల రామిరెడ్డి అనే భక్తునిచే దేవాలయము నిర్మింపబడి అపర భద్రాద్రిగా వెలుగొందుతోంది. ఇక్కడి శ్రీరామాలయంలో ప్రతిష్ఠింపబడిన విగ్రహాలు మేడూరు దగ్గర అడవిలో ఉన్నాయని రామిరెడ్డి గారికి స్వామి కలలో కనిపించి చెప్పాడట. అవి నిజంగానే అక్కడ దొరికాయి. అంతకుముందు మాత్రము అక్కడ ఒక బండ మాత్రమే ఉండేది. దానికే చనుబండ అని పేరు.

## చనుబండలోని కోదండరామాలయం




### కలిదిండి :

పురాణ కాలంలో ఇక్ష్వాకు పుత్రుడైన దండుడు ఈ ప్రాంతాన్ని పాలించాడట! వేటకు వెళ్లిన దండుడు శుక్రాచార్యుని పుత్రికైన అరజను చూచి బలాత్కరించబోయాడు. అరజ ఈ విషయాన్ని తన తండ్రికి తెలిపింది. శుక్రుడు 7 రోజుల పాటు రాళ్ళ వర్షం కురిపించి, దండుడి రాజ్యాన్ని అరణ్యంగా మార్చివేశాడు. అదే తరువాత దండ కారుణ్యమని పిలువబడింది. రాముడు ఖరదూషణాదులను ఇక్కడే వధించాడు కాబట్టి 'ఖరదిండి'గా పిలువబడి కాలక్రమంలో 'కలిదిండి' అయిందని చెప్పబడుతోంది.

### గుంటూరు జిల్లా : సీతానగరం :

తూర్పుగోదావరి గురించిన ప్రస్తావనలో సీతానగరం గురించి చెప్పుకొన్నప్పుడు గుంటూరు జిల్లాలోని సీతానగరం గురించి చెప్పుకున్నాం. ఇది కృష్ణానదికి దక్షిణపు ఒడ్డున ప్రకాశం బ్యారేజీని ఆనుకొని ఉన్న కొండ నానుకొని ఉన్నది. ఆ కొండ పాదము మీద సీతారాముల దేవాలయముంది. సీతానగరం కొండ మీద కొన్నేళ్ల క్రిందటి వరకు సీతమ్మ వారి పాదాలు - ఆమె అక్కడ నడయాడిన గుర్తుగా ఉండేవట. కాని కొండపైన అవి ఇప్పుడు లేవు. సీతారాములా ప్రదేశాన్ని సందర్శించిన సందర్భంలో శ్రీరాముడు అక్కణ్ణుంచి బయలుదేరి వెళదామని చెప్పగా సీత మాత్రం అక్కడి ప్రకృతి సౌందర్యానికి ముగ్ధురాలై కొంతకాలముందామని శ్రీరాముణ్ణి కోరిందని, అందుచేత సీతానగరంలో వాళ్లు కొన్నాళ్లున్నారని చెప్పబడుతోంది.

సీతారాములకు గుడి కట్టినచోటు పూర్వపు రోజులలో పెద్ద నగరమేమీ లేదు. ఎదురుగా కృష్ణానదిలో స్నానమాడే సౌకర్యము మాత్రముంది. కృష్ణకు అవతలి ఒడ్డున విజయవాడ అయితే ఇవతలి ఒడ్డునున్న సీతానగరం గుంటూరు జిల్లా సరిహద్దుగా నిలుస్తుంది. కృష్ణానది అవతలి గట్టున అంటే విజయవాడ వైపు గట్టునున్న సీతమ్మ వారి పాదాలరేవు అను పేరుతో పిలవబడుతున్న స్థానానికి, సీతానగరం కొండ పాదంలో ఉన్న ఈనాటి దేవాలయం సరిగ్గా ఎదురుగా ఉంటుంది.

అలాగే విశ్వామిత్రుని యాగ సంరక్షణ గురించిన ప్రస్తావనలో మాచర్ల సమీపంలోని రెంటచింతల మండలం సత్రశాల గురించి ఇంతకుముందే చెప్పుకున్నాం.

**బొప్పూడి :**

శ్రీరాముడు అరణ్యవాస కాలంలో చిలకలూరిపేట సమీపంలోని కొండ ప్రాంతాలలో పర్యటించినట్లు తెలుస్తుంది. శ్రీ సీతారాములు నివసించిన ప్రదేశంలో వారి పాదముద్రలకు ప్రతిగా ఏర్పరిచిన చిహ్నాలు ఇప్పటికీ కనిపిస్తాయి. ఇక్కడొక కోనేరు ఉంది. కొండ గుహలో ప్రసన్నాంజనేయ స్వామి దేవాలయముంది. చోళవంశానికి చెందిన బొబ్బిలిదేవ మహారాజుచే బొబ్బిలి దేవపురమనే పట్టణము ఇక్కడే నిర్మించబడింది. ఆ ప్రభువు ఈ క్షేత్రములోని వేంకటేశ్వరుణ్ణి కూడ ఆరాధించాడు. అప్పటి బొబ్బిలిదేవపురం తరువాత బొప్పూడిగా మారింది.

**మంగళగిరి :**

భారతదేశంలోని ముఖ్యమైన క్షేత్రాలలో ఒకటైన మంగళగిరి కృతయుగం నాటికే ఉంది. హ్రూశ్యశృంగుడు అవే భక్తుని కోరిక మేరకు నరసింహుడు లక్ష్మీనరసింహ రూపంలో గజాకార పర్వతంగా రూపుదిద్దుకొన్న భక్తునిపై కొలువుదీరినట్లు స్థల పురాణం చెబుతోంది. ఇదే సప్తకుల పర్వతాలలో ఒకటైన పారియాత్రము. క్షీరసాగర మథనంలో శ్రీ మహాలక్ష్మి ఉద్భవించి, అనేక పుణ్య నదుల నుండి దేవతలు తెచ్చిన జలంతో ఏర్పరచిన పుష్కరిణిలో స్నానం చేసి శ్రీ మహావిష్ణువును వివాహమాడింది. ఆమె స్నానమాచరించిన పుష్కరిణి మంగళగిరిలో ఉంది. దీనిని పెద్ద కోనేరుగా పిలుస్తారు. ఉగ్రనరసింహుణ్ణి శాంత పర్చటానికి శ్రీ మహాలక్ష్మి పానకాన్ని సమర్పించింది. అదే సంప్రదాయం ఈనాటికీ భక్తులచే కొనసాగింపబడుతోంది.

త్రేతాయుగంలో శ్రీరాముడు తాను ఎంతటి ధర్మనిష్ఠాపరుడైనప్పటికీ ముక్తి కలుగలేదని బాధ చెందగా, మహర్షులు మంగళగిరిని దర్శింపుమని చెప్పారట. ఆ విధంగా ఆయన మంగళగిరిని దర్శించినట్లు చెప్పబడింది. ఇది ఆయన పట్టాభిషేకానంతరం అయోధ్యను పరిపాలిస్తూ చాల కాలం గడిచాక జరిగి ఉండాలి. ఎందుచేతనంటే లంక నుండి అయోధ్యకు తిరిగివచ్చే సమయానికి ఆయన వయస్సు 39 సంవత్సరాలు మించి లేదు. అప్పటికి ఆయన రాజ్యపాలనే చేయ్యలేదు. ఆయన పరిపాలించిన కాలము 11000 సంవత్సరాలు. అందుచేత నలుబది సంవత్సరాల సుమారు వయస్సులో ఆయన పైన చెప్పిన నిర్ణయానికి వచ్చి ఉండడు. పాప పరిహారం కోసం చేసిన క్షేత్ర దర్శనం, కోటిలింగ ప్రతిష్ఠాది కార్యక్రమాలు తాను మానసికంగా స్థిమితంగా ఉన్న సమయంలో, ఇంతకు ముందు వచ్చిన రెండవసారిలో గాక తరువాత మరొకసారి వచ్చి మాత్రమే చేసి ఉంటాడనిపిస్తుంది.

కొండపైనున్న స్వామి వారు పానకాల లక్ష్మీనరసింహస్వామి వారు కాగా పర్వత పాదమందున్న స్వామి లక్ష్మీనరసింహస్వామి మాత్రమే. అంటే నివేదనగా పానకం స్వీకరించేది కొండపైనున్న స్వామి కాగా, క్రిందనున్న స్వామికి దానితో నిమిత్తము లేదు. లక్ష్మి పుష్కరిణి కాక, చీకటి కోనేరనే పేరతో మరొక కోనేరు కూడ ఇక్కడ ఉంది. ఇది గోపుర నిర్మాణ విషయంలో కలిగిన ఇబ్బందిని తొలగించటానికి ఏర్పరచిన కోనేరుగా చెప్పబడుతోంది.

అవతార పరిసమాప్తి కాలంలో వైకుంఠానికి వెళుతున్న శ్రీరామునితో తనను కూడ వెంటతీసికొని వెళ్లుమని ఆంజనేయుడు ప్రార్థింపగా, శ్రీరాముడు ఆంజనేయుని మంగళగిరిలోనే ఉండమని చెప్పాడట. ఆ విధంగా ఆంజనేయుడు మంగళగిరి క్షేత్రపాలకుడుగా ఉండిపోయాడని చెప్పబడుతోంది.

మంగళగిరి దేవాలయంలో నరసింహస్వామికి జరిగే బ్రహ్మోత్సవాలతో బాటు శ్రీరామ నవమికి సీతారామ కళ్యాణము, హనుమజ్జయంతి ఉత్సవాలు జరుగుతాయి.

**చిలుమూరు :**

శ్రీరాముడు లంక నుండి తిరుగు ప్రయాణంలో చేసిన క్షేత్రదర్శన, ప్రతిష్ఠాది కార్యక్రమాలలో చెప్పుకోవలసిన క్షేత్రములలో చిలుమూరు ఒకటి. ఇది కృష్ణానది ఒడ్డున ఉన్నది. ఇక్కడ కృష్ణానదీ గర్భంలో శ్రీరాముడు ప్రతిష్ఠించిన రామేశ్వరస్వామి వారున్నారు. కృష్ణానదికి వరద వస్తే, నీళ్లు ఒడ్డు ఒరసి పారే పరిస్థితి కలుగుతుంది. అప్పుడు అర్చనాదులను ఉపచారక రూపంలో అర్చక స్వాములు కృష్ణ ఒడ్డు నుండే

నిర్వర్తింపవలసి ఉంటుంది. కృష్ణాజిల్లాలో చెప్పుకున్న ఐలూరు ఈ చిలుమూరుకు తిన్నగా అవతలి ఒడ్డున ఉంటుంది. వీటి రెంటికి కలిపి ఉభయ రామేశ్వర క్షేత్రాలు అని పేరు.

## నల్లూరు : లక్ష్మీనారాయణ క్షేత్రం :

ఉభయ నారాయణ క్షేత్రాలలో ఒకటి కృష్ణాజిల్లాలోని అవనిగడ్డ కాగా, రెండవది కృష్ణానదికి మరొక వైపున ఉన్న నల్లూరు లక్ష్మీ నారాయణ క్షేత్రము. ఈ స్వామి కూడ అవనిగడ్డలోని స్వామివలెనే శ్రీరామునిచే ప్రతిష్ఠింపబడి ఉన్నాడు. నల్లూరులోని లక్ష్మీనారాయణుని మూల విరాట్స్వరూపము శ్యామల వర్ణములో ఉంటుంది. గనుక ఆ నల్లనయ్య ఉన్న ఊరు నల్లూరయిందని చెప్పబడు తోంది. అసలు శ్రీరామ ప్రతిష్ఠ జరిగిన చోటులోని దేవాలయము నదీ పాతముతో ధ్వంసముకాగా ఇప్పుడున్న చోట తరువాతి కాలములో స్వామి పునఃప్రతిష్ఠి తుడైనట్లు చెప్పబడుతోంది. ఈ క్షేత్రాన్ని శ్రీ నాథుడు కూడ దర్శించాడని, బుర్రాసింగన్న అనే పండితునితో వివాదపడి ఆయనను కోపంతో తిట్టి శాపనా ర్థాలు పెట్టినట్లు స్థల చరిత్ర చెప్పే విషయం.

## మోర్తోట :

వేకనూరులోని ముక్తేశ్వరస్వామి మోర్తోట ముక్తేశ్వరులు కలసి ఉభయముక్తేశ్వరులైనారు. ఉభయ క్షేత్రములలోని స్వాములు కృష్ణానదికి ఈవలివైపు ఆవలివైపున ఈ నాటికీ కొలువుదీరి ఉన్నారు. మోర్తోటలోని ముక్తేశ్వరాలయము కూడ చిలుమూరులోని రామేశ్వరాలయము వలె కృష్ణానదీ గర్భంలోనే ఉంటుంది. పెనుమూడి నల్లూరులకు మధ్యలో ఉంది మోర్తోట. పులిగడ్డ పెనుమూడి కృష్ణ రేవులు ఎదురెదురుగా ఉభయ పార్శ్వాలమీద ఉంటాయి. కృష్ణ మీద వారధి నిర్మాణము జరిగినదీ రెండు రేవుల మధ్యనే!

## పెనుమాక :

గుంటూరు జిల్లాలోని తాడేపల్లి మండలంలో ఇటు సీతానగరానికి, అటు పానకాల స్వామి కొలువైయున్న మంగళగిరి కొండకు సమీపంలో ఒక పర్వతముంది. ఆ పర్వతానికి దక్షిణపు చివరన ఎఱ్ఱబాలెమనే గ్రామముంది. కొండ మధ్య భాగంలో కొండ పాదాన్ని ఆనుకొని పెనుమాక గ్రామముంది. ప్రసిద్ధిచెందిన ఉండవల్లి, గుహాలయాలున్నది కూడ ఇక్కడే. ఉండవల్లి, గుహాలయాలకు చాల దగ్గరగా కొండవీటి వాగు ప్రవహిస్తూ ఉంటుంది. అది కొంచెం దూరం ప్రవహించివచ్చి కృష్ణ నుండి ఏర్పరిచిన బకింగ్‌హామ్‌కాలువలో కలుస్తుంది. ఈ కొండకు చాల

దగ్గరలో మండల కేంద్రమైన తాడేపల్లి గ్రామం ఉంది. విజయవాడ, చెన్నై వెళ్లే జాతీయ రహదారి కూడ ఈ తాడేపల్లి కొండనానుకుని ఉన్న పోలకంపాడు గ్రామాన్ని తాకుతూ వెళుతుంది. ఇక్కడ ఏర్పడిన నాలుగు రోడ్ల కూడలిని పోలకంపాడు సెంటరని, తాడేపల్లి సెంటరని కూడ పిలుస్తారు. ఈ రోడ్డు సెంటరు నుండి ఉండవల్లి మీదుగా పెనుమాక వెళ్లి పెనుమాక ఊరు మధ్యలో నుండి ఏటవాలుగానున్న కొండమీదకు ఎక్కి, అక్కడ నుండి కొండ మీదనే కొంచెం దూరం నడచి వెళితే అక్కడ సీతమ్మ వారి పాదాలు కనబడేవి. అక్కడొక చిన్న ఆంజనేయ స్వామి మందిరం ఉండేదట. గ్రామ చరిత్ర ఈ ప్రదేశాన్ని గురించి స్పష్టంగా చెప్పటంలేదు గాని సీతారాములు ఆ ప్రాంతంలో పర్యటించిన గుర్తుగా ఈ కొండమీద ఈ పాదముద్ర లేర్పరచబడినట్లనిపిస్తుంది. కాని ఇప్పుడవి లేవు.

ఈ కొండదిగువన తర్వాత కాలములో బౌద్ధమతముకూడ కొంతకాలం పరివ్యాప్తమైయున్నట్లుగా కొన్ని ఆధారాలు లభించాయి. ఉండవల్లి గుహాలయాలు కూడ బౌద్ధమత చిహ్నలే అనే అభిప్రాయమున్నా అక్కడున్నది పద్మనాభుడు గనుక అవి అవి బౌద్ధమతానికి సంబధించినవి కావనిపిస్తుంది. ఏమైనా పెనుమాక కొండ మీదనున్న సీతమ్మవారి పాదల విషయము ఇతర ప్రాంతాలకు తెలిసే విధంగా అంత ప్రచారంలో లేవు కాని సీతానగరానికి సమీపాన ఉండటంతో వారి పర్యటన అక్కడకు కూడ జరిగి ఉంటుందనుకోవటంలో అనౌచిత్యము లేదనిపిస్తుంది.

**వినుకొండ :**

రావణ వధానంతరం శ్రీరామచంద్రుడీ ప్రదేశాన్ని దర్శించి ఇక్కడున్న వినుకొండ కొండకు పాద భాగంలో వినాయకుణ్ణి కొండపైన శ్రీ రామలింగేశ్వర స్వామిని ప్రతిష్ఠించి అక్కడ కొంత కాలముండి సేవించినట్లు చెప్పబడుతోంది. ఇక్కడున్న వినాయకుణ్ణి అత్యంత మహిమాన్వితునిగా, మానవులకు జాతక రీత్యాకలిగే దోషపరిహారునిగా చెప్పుకుంటారు. ఆ విధంగా జన్మదోషపరిహారం కోసం కులమతబేధాలు లేకుండా ఈ వినాయకుణ్ణి సేవించుకొని తమ తమ అభీష్ఠసిద్ధిని పొందుతున్నారు. జటాయువు వలన సీతాపహరణ వార్తను విన్న కొండ కూడ ఇదే నన్న వాదన ఉందనే విషయము గురించి ఇంతకు ముందే మనం చెప్పుకున్నాం.

**నందివెలుగు :**

బుద్ధకౌశికుడనే ఋషి తీర్థయాత్రలు చేస్తూ మహర్షుల నిలయమైన ఈ ప్రదేశానికి వచ్చాడు. ఒకనాటి తెల్లవారు ఝామున శివుడు బుద్ధకౌశికునికి కలలో కనబడి 'శ్రీరామ రక్షాస్తోత్రం' బోధించాడట! ఈ స్తోత్ర పఠనా ప్రభావం వలన

జ్యోతిర్మండలంలో శ్రీరాముడు దర్శనమిచ్చాడట. 'నంది' అనేది విష్ణు సహస్రనామాల్లో ఒకటి. ఇది విష్ణువు (రాముని రూపంలో) ప్రత్యక్షమైన ప్రదేశం కనుక నందపురి అని, బుద్ధకౌశికుడు నందిజ్యోతిని దర్శించాడు కాబట్టి నంది వెలుగు అని పిలువబడుతోందట!

**పెదకాకాని :**

ఇక్కడ మల్లేశ్వరస్వామి ఎన్నాళ్ల నుండి కొలువు దీరి ఉన్నాడో చెప్పలేము. కాని శ్రీరామచంద్రుడీ క్షేత్రాన్నికి వచ్చి మల్లేశ్వరుణ్ణి దర్శించుకున్నట్లుగా ఈ స్థల చరిత్ర చెబుతుంది.

**ప్రకాశం జిల్లా : మోక్షగుండం :**

శ్రీరాముడు అరణ్యవాసం ప్రారంభించిన వెంటనే తండ్రి దశరధుణ్ణి కోల్పోయాడు. కాని యెక్కడ ఉన్నా శ్రాద్ధ విధిని నిర్వర్తించేవాడు. అరణ్యవాసంలో ఒకసారి శ్రాద్ధ విధిని నిర్వర్తింపవలసి వచ్చింది. తానున్న అక్కడి కొండమీద నీటి వనరు లేకపోతే శ్రీరాముడు అస్త్ర ప్రయోగం చేసి జలాన్ని పైకి రప్పించాడని, అదే తరువాత కుండముగా నిలిచిందని, ఆ తరువాత ఆ కుండము ఆ గ్రామము కూడ మోక్షగుండంగా ప్రశస్తి పొందాయని చెప్పబడుతోంది. పైన చెప్పబడిన కొండకు కొద్ది దూరంలో క్రింద కూడ కుండము క్షేత్రము ఉంది. ప్రఖ్యాత ఇంజనీరు మోక్షగుండం విశ్వేశ్వరయ్య గారి తండ్రి స్వస్థలమిదే. ఆ కుండమిప్పటికీ ఆ కొండ మీద ఉంది.

**రామతీర్థం - చీమకుర్తి :**

ఒంగోలు నుండి కర్నూలు వెళ్లే బస్సు మార్గంలో చీమకుర్తి సమీపంలో ఒక రామతీర్థముంది. ఇక్కడ మోక్షరామలింగేశ్వరస్వామి కొలువుదీరిఉన్నాడు. ఇది కూడ శ్రీరాముడు శ్రీశైల క్షేత్రానికి వెళ్లే సమయంలో కొన్నాళ్లు నిలచిన ప్రదేశమేమో! శివుడక్కడ అంతకుముందు నుండి కొలువు దీరి ఉన్నాడని, శ్రీరామచంద్రుడిక్కడ ఈశ్వరాలయం వెనుక ఒక కోనేరు మాత్రం ఏర్పరచాడని అదే ఆనాటి నుండి రామ తీర్థముగా ప్రసిద్ధి చెందిందని చెప్పబడుతోంది.

ఈనాడు గ్రానైటు శిలా (నల్లశాణమురాయి) సంపదకు పేరుగాంచిన ఈ రామతీర్థాన్ని పునఃనిర్మించటం 2005లో జరిగింది. ఆ విధంగా ఇది ఒక గొప్ప హరిహరక్షేత్రమైంది.

**ఈతముక్కల మడనూరు :**

శూర్పణఖ ముక్కు, చెవులు కోయబడిన ప్రదేశమిదియని 'ఇంతిముక్కులు' తెగిన ప్రదేశం కాలగమనంలో 'ఈతముక్కల' అయిందని చెబుతారు. ఈ గ్రామం పూర్తి పేరు ఈతముక్కలమడనూరు. అయితే పంచ వటికి సమీపంలోని పర్ణశాలకు శూర్పణఖ వచ్చిందని, అక్కడే కామమోహితయై మొదట శ్రీరామునితో, ఆ తరువాత లక్ష్మణునితో అతిగా వ్యవహరించి ముక్కు, చెవులు పోగొట్టుకున్నదనే సంగతి ఇంతకు ముందే ఖమ్మం జిల్లా దుమ్ముగూడెం విషయ ప్రస్తావనలో చెప్పుకున్నాం. అయితే ఇక్కడ వినిపించే కథ కూడ అలానే ఉంది. ఈ ఇంతిముక్కల కోదండరాముని పై టంగుటూరి సుబ్బకవి ఒక కోదండ రామశతకాన్ని చెప్పాడు.

**పాకల :**

సింగరాయకొండ మండలం పాకల గ్రామం సింగరాయ కొండకు 6 కిమీల దూరంలో ఉంది. ఇక్కడ కూడ శ్రీరామ ప్రతిష్ఠితుడైన శ్రీరామలింగేశ్వర స్వామి ఉన్నాడు. సింగరాయ కొండలో నారద ప్రతిష్ఠితుడైన నరసింహస్వామి ఉన్నాడు. ఈ పవిత్ర స్థలములోనే శ్రీనాథుడు జన్మించాడని స్థానికుల కథనం.

**పశుముద్ర :**

పాకలకు సమీపంలోనే పశుముద్ర అనే గ్రామముంది. అయితే ఇది టంగుటూరు మండలంలో ఉంది. ఇక్కడ ఆంజనేయుడు ప్రతిష్ఠించిన అమర రామలింగేశ్వరుడున్నాడు. ఈ స్వామినే అడవి రామలింగేశ్వరుడని కూడ అంటారు.

**త్రిపురాంతకం :**

శ్రీశైల ప్రవేశ ద్వారాలు ఎనిమిదింటిలో ఇది కూడ ఒకటి కావటం వలన ఆ ప్రదక్షిణ విధిననుసరించి శ్రీరాముడు శ్రీశైలానికి వెళ్లేటప్పుడు ఈ క్షేత్రాన్ని దర్శించి ఇక్కడ కొన్నాళ్లున్నాడు. స్వామి వారు త్రిపురాంతకేశ్వరుడు. ఆయన కుమారగిరిపై కొలువుదీరిఉన్నాడు. అమ్మవారు త్రిపురసుందరి. ఆమె ఆలయం కదంబవనానికి కాసారానికి మధ్యన ఉన్నది. ఇంకా ఇక్కడ వేరువేరు నామాలతో శివుడు కొలువుతీరి ఉన్నాడు. ఎన్నో తీర్థాలున్నాయి. ఇక్కడున్న శివలింగం సీతాదేవిచే ప్రతిష్ఠితమని చెప్పబడుతోంది.

**చదలవాడ :**

ఒంగోలు చీరాల బస్సు మార్గం లో ఒంగోలుకు 15 కి.మీల దూరంలో ఉన్న చదలవాడ గ్రామములోని దేవాలయములో దక్షిణాభి ముఖంగా కొలువుదీరి ఉన్న రఘునాయక స్వామి త్రేతాయుగంలో అగస్త్యుడు ప్రతిష్ఠించినట్లు స్థానిక కథనం! అమ్మవారు స్వామి వారికి కుడివైపున ప్రతిష్ఠితమై ఉంది సీతాన్వేషణకు సుగ్రీవ సైన్యమిక్కడ నుండి నాలుగు భాగములుగా చేయబడి నలుదిక్కులకు కదలుట చేత ఇది చదలవాడ అయిందని చెప్పబడుతోంది. చదలము అంటే సైన్యము లేక దండు విడిసిన చోటు అని అర్థం. అది సుగ్రీవుని యొక్క సైన్యము విడిసిన చోటు, ఆ తరువాతనే అది నాలుగు భాగాలుగా విడదీయబడి నలుదిక్కులకు కదిలింది. చదలము జరిగిన చోటు జనవ్యవహారంలో చదలవాడ అయింది.

మరొక విశేషమేమంటే చైత్ర బహుళ విదియ నాడిక్కడ ఉదయం 10 గంటలకు జరిగే కళ్యాణానికి స్వయంగా గరుత్మాంతుడు విచ్చేసి ఆకాశమార్గాన తన విహంగ వీక్షణాన్ని ప్రసరింపచేస్తూ, మూడు ఆవృతులు తిరుగుతాడు ఆ విధంగా గరుడ పక్షి వచ్చి మూడు ఆవృతులు తిరిగివెళితేగాని తలంబ్రాలు పోయరు. కల్యాణం నాడు ఈ విధంగా జరగకపోవటమనేది ఇంతవరకు ఎన్నడూ జరగలేదని స్థానిక వయోవృద్ధుల కథనం! భద్రాచలం నుండి శ్రీరామచంద్రుడు షోడశకళాప్రపూర్ణుడై వచ్చి 12 కళలతో మాత్రమే తిరిగి వెళతాడట! అది ఆ మూర్తులకున్న అనుబంధము!

**సింగరాయకొండ :**

విజయవాడ చెన్నై రైలు మార్గానికి సుమారు 3 కి.మీల దూరములో వరాహ లక్ష్మీనరసింహస్వామి వారు బిలాలయములో కొలువు దీరివున్న క్షేత్రమిది. అయితే రామాయణముతో సంబంధమేమిటంటే శ్రీరాముడిక్కడ సీతా లక్ష్మణులతో కొన్నాళ్ళిక్కడ ఉన్నాడట. పూర్వమీ ప్రాంతానికి 'పర్ణశాల' అనే పేరుండేదని నృసింహునికి సంబంధించిన పురాణ కథలో తెలుస్తోంది. ఇది వనవాసంలో అయిఉండటానికి వీలులేదు. అయితే ఆయన పట్టాభిషేకా నంతరమే, బహుశా శ్రీశైల క్షేత్రానికి ఆయన రామ ప్రదక్షిణ మార్గంగా వెళ్లి నప్పుడో లేదా మరొకసారి పాపపరిహారార్థము తీర్థ యాత్రలు చేసినప్పుడో వచ్చి ఉండవచ్చు.

గమనింపతగిన విషయము మరొకటి ఉంది. సీతాదేవి అక్కడున్నప్పుడు కొంతమంది ఋషిపత్నులతో కలసి స్నానమాడటానికి వెళుతూ ఉండేదట! అయితే ఆమె ఒకసారి వెలుపల ఉన్న మూడు రోజులు అక్కడున్న ఒక ఏటికి వెళ్లి స్నానం చేసిందని, ఆ కారణంగానే ఆ యేటికి ముట్టేరు అని పేరు వచ్చిందని కథనం!

శుచిస్నానానంతరము సీతాదేవి ముత్తైదువగా అలంకరించుకొన్న పసుపు కుంకుమల గుర్తుగా ఆ రంగుతో ఏర్పడిన చిహ్నాలు అక్కడున్న కరటాలతిప్పపై కనబడుతూనే నేటికీ నిలచి ఉన్నవి.

### నెల్లూరు జిల్లా : రామ తీర్థం :

విడవలూరు మండలంలో మైపాడు అల్లూరుల మధ్య సముద్రతీరాన ఉన్న ఈ ప్రదేశాన్ని శ్రీరాముడు లంకవైపుకు తరలి వెళుతూ దర్శించినట్లు చెప్పబడుతోంది. ఇక్కడ ఆయన 10 నుండి 15 రోజుల వరకు ఉన్నాడట. సీతాన్వేషణ చేస్తూ వెళుతున్న శ్రీరాముడు నిత్య శివపూజా నియమం కలవాడు గనుక శివాలయం అందుబాటులో లేకపోవటంతో ఆంజనేయుణ్ణి ఒక లింగాన్ని తెమ్మని పంపితే, ఆంజనేయుడు సమయానికి రాకపోవటంతో సైకతలింగాన్ని రూపొందించి ప్రతిష్ఠించాడని అదే ఆ తరువాత రామతీర్థ క్షేత్రమై ఆ ప్రదేశము పేరు కూడ రామతీర్థమైనదని చెప్పబడుతోంది. ఈ స్వామిని శ్రీ కృష్ణదేవరాయులు తన దేవేరులతో కలసి సందర్శించి వేయించిన శాసనాలున్నాయి. ఇక్కడున్న నందీశ్వరుడు లేపాక్షి బసవన్నను గుర్తుకు తెస్తాడు. లింగబాణం వివిధ వర్ణాల సమ్మిశ్రితంగా ఉంటుంది. ఇప్పుడు లింగం భిన్నమై వెండికట్లు వేయబడి ఉంది. సమీప సముద్ర జలాలలో 50 కి.లోల బరువు గల గంట ఒకటి సముద్రపు పోటుకు కొట్టుకొని వచ్చి ఒడ్డుకు చేరితే దాన్ని ఈ ఆలయంలో పెట్టారు.

### బుచ్చిరెడ్డిపాలెం :

ఈ గ్రామమున్న ప్రదేశాన్ని ఆనాడు శ్రీరాముడు సందర్శించాడట. ఆ గుర్తుగా అక్కడొక రామాలయం నిర్మింపబడింది. ఇక్కడి శ్రీరాముని అర్చామూర్తి యొక్క విశేషమేమంటే ఆ స్వామి రూపం చిరునవ్వులు చిందిస్తూ, నవ్వులు కురిపిస్తూ ఉంటుంది.

### సోమశిల :

ఇది కూడ శ్రీశైలానికున్న అష్ట ప్రవేశ ద్వారాలలో ఒకటి. శ్రీరాముడు శ్రీశైల ప్రదక్షిణ మార్గంలో, ప్రదక్షిణ పద్ధతిననుసరించి ఈ క్షేత్రాన్ని దర్శించి ఇక్కడ కొద్దిరోజులున్నాడు. ఇది శ్రీశైలానికి ఆగ్నేయ ప్రవేశ ద్వారం. పెన్నానది తీరంలో నల్లమల, ఎఱ్ఱమల, వెలిగొండల కూడలి ప్రదేశమిది స్వామివారు సోమేశ్వరుడు అమ్మవారు కామాక్షీదేవి.

**చిత్తూరు జిల్లా : 1. శ్రీకాళహస్తి :**

ఈ కాళహస్తి చాల ప్రాచీనమైన శైవక్షేత్రము. అది ఎన్ని యుగాల నుండి ఉన్నదో తెలియదు. ఈ క్షేత్రానికి సత్యవ్రత భాస్కర క్షేత్రమనే పేరు కూడ ఉన్నది. ఈ క్షేత్ర నిర్మాణము ఈ శావాస్యమునకు రూపకల్పనమని శ్రీపవని సీతారామయ్య మరియు వారి సోదరులు ఈ శావాస్యోపనిషత్తు సత్యవ్రత భాస్కర క్షేత్రము అను గ్రంధమునందు వివరించారు. శ్రీకాళహస్తి క్షేత్ర నిర్మాణములోని నిగమాగమోద్దేశాన్ని పై గ్రంథకర్తలు చక్కగా వివరింపగలిగారని ఆ దేవాలయ స్థానాపతులైన శ్రీస్థానం ముత్తు కుమార పరశురామగురుక్కళ్ రూఢిపరచారు.

ఈ గ్రంథంలోనే శ్రీరాముడు శ్రీకాళహస్తి క్షేత్రంలో తపమాచరించి జ్ఞానాన్ని, చిత్తశాంతిని, రాజ్యాన్ని పొందాడని, ఆయన తపస్సుకు గుర్తుగా అక్కడ రామతీర్థమున్నదని తెలియచేయబడింది. పైగా ఈ క్షేత్రము శ్రీశైల ప్రదక్షిణ మార్గములోనిది కావటం ఆయనీ క్షేత్రాన్ని దర్శించాడని చెప్పటానికి బలం కలిగిస్తోంది. శ్రీ కాళహస్తీశ్వరుణ్ణి శ్రీరాముదర్చించాదని ధూర్జటి తన శ్రీకాళహస్తీశ్వర శతకములోని ఈ క్రింది పద్యములో స్పష్టీకరించాడు.

*నీరూపంబు దలంపగాఁదుదిమొదల్నే గాన నీవైనచో*
*రారారమ్మని యంచు ఁజెప్పవు వృధారంభంబులింకేటికిన్*
*నీరన్మంపుము పాలముంపుమిక నిన్నే నమ్మి నాడంజుమీ*
*శ్రీరామార్చిత పాదపద్మయుగళా! శ్రీకాళహస్తీశ్వరా!* (పద్యము 19)

త్రేతాయుగంలో శ్రీకాళహస్తికి విష్ణుపురమనే పేరుండేదట!

**2. కాళహస్తి సమీపరామగిరి :**

రావణవధానంతరము అయోధ్యకు తిరిగివెళుతున్న రాముడు లంకకు వెళ్లేటప్పుడు సేతువునిర్మించిన ప్రదేశములో ఒక శివలింగ ప్రతిష్ఠ చేయసంకల్పించి, ఒక శివలింగాన్ని తెమ్మని ఆంజనేయుణ్ణి కాశీకి పంపాడు. శివలింగాన్ని తెస్తున్న ఆంజనేయునికి దప్పిక కావటంతో ఒక చోట ఆగి అక్కడున్న ఒక పశువుల కాపరికి శివలింగాన్నిచ్చి దాహార్తి తీర్చుకోవటానికి వెళుతూ లింగమూర్తిని పట్టుకొని ఉండవలసిందిగా చెప్పాడు. కాని పశువుల కాపరి రూపంలో ఉన్నది కాలభైరవుడు. అతడు తీసికొన్న శివలింగమూర్తిని నేలమీద పెట్టేశాడు. వెంటనే ఆ లింగమూర్తి నేలకు అతుక్కుపోయింది. ఆంజనేయుడు తిరిగివచ్చి చూచి, కోపంతో మండిపోయి, ఆ శివలింగాన్ని వాలంతో పెకలించాలని ప్రయత్నించాడు. కాని ఆ లింగం కదలి

రాలేదు. అక్కడే నిలచిపోయిన ఆ శివుడు వాలాన్ని ధరించిన వారిలో విశిష్టుడైన ఆంజనేయుని పేరు మీద వాలేశ్వరుడైనాడు. ఆంజనేయుడు మళ్లీ కాశీకి వెళ్లి మరొక శివలింగాన్ని తీసికొని రామేశ్వరం వెళ్లాడు గాని, అనుకున్న ముహూర్తకాలము దాటిపో తోందని సీతాదేవి రూపొందించిన సైకత లింగాన్ని ఆంజనేయుడు అక్కడకు చేరేలోపే ప్రతిష్ఠ చేసేశారు. ఆ తరువాత ఆంజనేయుణ్ణి అనునయిస్తూ ఆంజనేయుడు తెచ్చిన లింగాన్ని కూడ ప్రక్కనే ప్రతిష్ఠించాడు. సేతువు కట్టిన చోట రామునిచే ప్రతిష్ఠితుడైన ఆస్వామి సేతు రామేశ్వరుడైనాడు. దానికే రామనాథ క్షేత్రమని కూడ పేరు తరువాత రామేశ్వరములెన్నో ఏర్పడినవి గాని అదే ప్రధానమైన రామేశ్వరమైంది.

ఇక కాళహస్తి సమీప రామగిరి ఆంజనేయుడు తీసికొని వచ్చిన ఈశ్వరుడున్న స్థానమైనా, బహుశా దాన్ని కూడ శ్రీరాముడు దర్శించిన కారణము చేతనేమో ఆ స్థలము ఆయన పేరుమీద రామగిరి అయింది. ఈశ్వరుని అమ్మవారు అక్కడ మరకతవల్లి. ఈ రామగిరి క్షేత్రం నాగపూర్ సమీపంలోని రామ్‌టెక్‌ను గుర్తుకు తెస్తుందని ఈ రెండు క్షేత్రాలను చూచినవారు పోల్చి చెబుతారు. ఒకప్పుడీ పరిసర ప్రదేశాలలో అగస్త్యుడు కొన్నాళ్లు ఆశ్రమం ఏర్పాటు చేసికొని ఉన్నట్లు చెప్పబడింది. ఆ అగస్త్యాశ్రమాన్ని పార్వతీ పరమేశ్వరులు దర్శించినట్లు చెప్పబడింది.

ఇంకా ఇక్కడ కాలభైరవాలయం కూడ ఉంది. ఇక్కడ ఇంకా రెండు విశేషాలున్నాయి. ఇకటి మహానందిలో వలె నందినోట్లో నుండి ఇక్కడ కూడ జలప్రవాహ ముంది. కంచిలో లాగ ఒక బల్లికి విశిష్ఠ స్థానమీయబడి పూజింపబడుతోంది. మరొక విశేషమేమంటే ఏ పర్వతశ్రేణికి తలవైపునున్న ప్రదేశంలో శ్రీకాళహస్తీశ్వరుడు కొలువుదీరి ఉన్నాడో, అదే పర్వతశ్రేణి పృచ్ఛభాగాన ఈ రామగిరి వాలేశ్వరుడు కొలువుదీరి ఉన్నాడు. స్వామిపేరు వాలీశ్వరుడని వాడుకలో ఉన్నా, ఆంజనేయ ప్రతిష్ఠ కనుక వాలేశ్వరుడైయుంటా డనిపిస్తుంది.

### 3. సురుటుపల్లి :

చెన్నై నుండి తిరుపతికి వచ్చే మార్గంలో సత్యవేడు మండలంలో ఉతుకోట్టై అనే గ్రామానికి సమీపంలో ఈ శైవక్షేత్రముంది. సురలెందరో దర్శించిన క్షేత్రం కనుక సురకోటిపల్లి అనే పేరుతో పిలువబడి తరువాత సురులపల్లి – సురుటుపల్లిగా అయిందని చారిత్రకుల అభిప్రాయము. క్షీరసాగర మధనము వలన పుట్టిన గరళాన్ని ఈ లోకాలను రక్షింపటానికి పరమేశ్వరుడు దాన్ని కంఠ గతం చేసికొనటం చేత కలిగిన దుష్ప్రభావాన్ని అనుభవిస్తున్న స్థితిలోనున్న రూపమిక్కడ గోచరిస్తుంది. ఆ

గరళం తీసికొనటం చేతనే ఈశ్వరుడు ముందు గరళకంఠుడై ఆ తరువాత నీలకంఠుడైనాడు. ఆ రూపమే ఇక్కడ దృగ్గోచరమౌతుంది.

శ్రీరాముడు భార్యా వియోగపరితాపాన్ని భరిస్తూ, సీతాన్వేషణ చేస్తున్న సమయంలో ఈ స్వామిని సేవించుకొన్నట్లు చెప్పబడింది. దీనికి శివశయన క్షేత్రమనే పేరుకూడ ఉంది. ఎందుచేతనంటే శివుడు గరళము కంఠగతము చేసికొన్నందున బాధతో కలిగిన బాధతో ఒడలు తెలియని స్థితిలో పార్వతీదేవి ఒడిలో శయనించి ఉన్న రూపంలో దర్శనమిస్తాడు. సామాన్యంగా అనంత పద్మనాభస్వామిని శయనించి ఉన్న భంగిమలో మనము చూస్తూ ఉంటాము. కాని శివుణ్ణి ఆ భంగిమలో చూడటం జరిగేది ఇక్కడ ఒక్కచోటే! తమిళదేశానికి అతి సమీపంలో ఉన్న కారణం చేత స్వామివారు "పళ్లికొండేశ్వరుడు"గా ప్రసిద్ధి చెందాడు. తమిళంలో 'పళ్లికొండ' అంటే పడుకొని ఉన్నవాడని అర్థం కావటంతో ఆ పేరుతోనే ప్రసిద్ధి కలిగింది.

ఇంకా ఇక్కడ వాల్మీకి ఆశ్రమము ఉండేదని, వాల్మీకి ఈశ్వరుని గురించి ఇక్కడే తపమాచరించి ప్రసన్నుణ్ణి చేసికొన్నాడని, ఆ ప్రసన్నరూపుడైన శివుడు అక్కడ ఒక స్వయంభూలింగంగా అవతరించి నిలిచాడని, వాల్మీకి కారణంగా అవతరించటం చేత వాల్మీకేశ్వరుడైనాడని తెలుస్తోంది. ఆయనకు కుడి ప్రక్కన మరకతాంబిక కొలువుదీరి ఉంది. అమ్మవారు స్వామికి కుడివైపున ఉండటం ఇక్కడి ప్రత్యేకత. తమిళ ప్రభావం ఉన్న ప్రాంతం గనుక అమ్మవారిని మరగదాంబిక అంటారు. ఇంకా ఇక్కడ స్వయంభూగణపతి కూడ ఉన్నాడు. అంతేకాక శ్రీరామచంద్రుడు ప్రతిష్ఠించిన శ్రీరామలింగేశ్వరుడు ఆయనతోపాటు సీతారామచంద్రులు సకుటుంబ సపరివారముగా అక్కడ అర్చా మూర్తులై నిలచియున్నారు. ఇంకా ఇక్కడ లవకుశ పాదముద్రలు కూడ వారీ క్షేత్రాన్ని దర్శించిన గుర్తుగా నిలచి ఉన్నవి.

## 4. అర్ధగిరి :

శ్రీమద్రామాయణంలో జరిగినదంతా శ్రీరామ అయనమైనా, ఒక కాండ మొత్తం ఆంజనేయునితో నడచిన కథే. అదే సుందరకాండ. సీతాన్వేషణకు బయలుదేరి, వెనుదిరిగి వచ్చేంతవరకు జరిగిన కథ సుందరకాండలో ఉంది. అయితే ఆ తరువాత కాండలలో కూడ ఆయనకు ప్రాముఖ్యముంది. ముఖ్యంగా యుద్ధకాండలో మూర్ఛపోయిన లక్ష్మణుని ప్రాణాపాయము నుండి కాపాడటానికి ఆంజనేయుడే ఆధారమైనాడు. ఆయన సంజీవని తీసికొని రావటానికి వెళ్లి సంజీవనీ ఔషధ వృక్షాన్ని పోల్చుకోలేక, ఏకంగా కొండను పెకలించుకొని వస్తున్నప్పుడు కొన్ని చోట్ల

కొండచరియలు విరిగి పడ్డాయి. కరీంనగర్ జిల్లాలో 'కొండగట్టు ఆంజనేయస్వామి' నెలకొని ఉన్న కొండ గట్టు ఒకటికాగా చిత్తూరు జిల్లాలోని అరగొండ ఒకటి. ఇది చిత్తూరుకు 2 కిమీల దూరంలో ఉంది. ఈ ప్రదేశంలో సంజీవని పర్వతంలో సుమారు సగం విరిగి పడటంతో ఇది అర్ధగిరి అని పిలువబడింది. ఆ సంస్కృతపదానికి తెలుగులో సమానార్థకము అరగొండ కనుక, ఆ ప్రదేశము తరువాత అరగొండ అని పిలువబడుతోంది.

అక్కడున్న వీరాంజనేయుని దేవాలయ నిర్మాణంలో అప్పటి వాస్తు నిపుణులు చూపిన ప్రతిభ అద్భుతం. ప్రభాత సమయంలో, సూర్యకిరణాలు తిన్నగా ఆంజనేయుని పాదాలు స్పృశిస్తూ క్రమంగా ఆ కిరణాలు పైకి వెళుతూ శిరసు వరకు సాగుతాయి. ఇక్కడ సంజీవని తీసికొనివచ్చిన సంజీవరాయని కొలనులో స్నానం చేస్తే ఎన్నో వ్యాధులకు ఔషధంగా పనిచేస్తుందని ప్రజానుభవం, ఆ రకంగా ఇది వీరాంజనేయుని తీర్థరాజసహిత దివ్యక్షేత్రం.

**5. అంజనాద్రి :**

త్రేతాయుగంలో కేసరి అనే వానర రాజు ఉండేవాడు. ఆయన భార్య అంజనాదేవి. చాల కాలం గడచినా వారికి సంతానం కలగకపోవటంతో ఆమె మతంగ మునినాశ్రయించి తన బాధ చెప్పుకుంది. ఆయన సూచనల మేరకు ఆమె వేంకటాద్రికి చేరుకొని, స్వామి పుష్కరిణిలో పవిత్రస్నానం చేసి అక్కడున్న అశ్వత్థ వృక్షానికి ప్రదక్షిణాలు చేసి, క్షేత్రపాలకుడైన వరహాస్వామిని దర్శించుకొని ఆ తరువాత ఆకాశగంగ తీర్థం దగ్గర ఉపవాసం చేస్తూ నిష్ఠగా తపమాచరించింది. ఈ విధంగా చాల సంవత్సరములు గడువగా వాయు దేవుడు ప్రతిదినం ఒక ఫలాన్ని ఆమెకు అందిస్తుండగా దానిని ఆహారంగా స్వీకరిస్తూ ఆమె తన తపస్సు సాగించింది. ఒకరోజు వీర్యంతో నిండిన ఒక ఫలాన్ని వాయుదేవుడు అంజనాదేవికి అందించాడు. ఆమె అనుదినం స్వీకరి స్తున్నట్లుగానే ఆకలితో ఆ ఫలాన్ని ఆరగించి గర్భవతియై ఏతత్ఫలంగా వాయు దేవుని వరప్రసాదంగా ఆంజనేయుణ్ణి పుత్రునిగా పొందింది. అందుచేతనే ఆంజనేయుడు వాయుపుత్రుడైనాడు. ఆమె కేసరి భార్య గనుక ఆంజనేయుని కేసరి క్షేత్రజుడంటారు. ఆ వేంకటాద్రియే వేంకటాచలము. ఆ సప్త పర్వతశ్రేణిలో అంజనాదేవి పేరు మీద ఒక పర్వతము అంజనాద్రి అయింది. ఆ విధంగా తెలుగు గడ్డపై పుట్టిన ఆంజనేయుడు పెరిగి పెద్దవాడై వాలి సుగ్రీవులున్న కిష్కింధకు చేరుకున్నాడు. కిష్కింధ హంపికి దగ్గరగా విరూపాక్షుడు కొలువై

యున్నచోటు. పంపాసరోవరానికి సమీపంలో ఉంది. ఇది బళ్లారి జిల్లాలో ఉంది. మొన్న మొన్నటి వరకు జస్టిస్ వాంఛూ కమిషన్ నివేదిక వలన ఆంధ్ర కర్ణాటక ప్రాంతాలు విభజన జరుగకముందు వరకు బళ్లారి జిల్లా కూడ ఆంధ్రదేశంలో అంతర్భాగమే. అయితే హంపీ దగ్గర కూడ ఒక అంజనాద్రి ఉంది. ఆమె తపస్సు చేసింది ఆ కొండమీదేనని, ఆంజనేయుని జన్మస్థలం కూడ అదేననే అభిప్రాయముంది.

## 6. తిరుపతి కొండలు :

శ్రీరాముడు అరణ్యావాసం చేస్తున్న కాలానికి కూడ ఆంజనేయుడక్కడ ఉండక తిరుపతి కొండలు వదలి కిష్కింధకు వెళ్లినా, అంజనాదేవి మాత్రం తన తపస్సు కొనసాగిస్తూ, ఎంతో మంది తపమాచరిస్తున్న తిరుపతి కొండలపైననే, అంజనాద్రిపైనే ఉంది. శ్రీరాముడు సీతాపహరణము తరువాత, సీతాన్వేషణ చేస్తూ రావణ సంహారము కోసం బయలుదేరి వెళుతున్నప్పుడు అంజనాదేవి శ్రీరాముని కొండపైకి ఆతిథ్యము స్వీకరించటానికి ఆహ్వానించింది. శ్రీరాముడు తనకున్న పరిస్థితులలో ఆతిథ్యము స్వీకరింపటానికి ముందు అంగీకరించకపోయినా, తరువాత ఆంజనేయుని సూచనపై వానరులతో సహా వెళ్లి అక్కడ ఒక తాత్కాలిక వసతి ఏర్పాటుచేసికొని, వానరులతో సహా ఆతిథ్యము స్వీకరించాడని, నిర్లోముడనే తపస్వి పూజలందుకున్నాడని, తిరుపతిలోని స్వామి పుష్కరిణిలో స్నానమాచరించాడని, రావణాసురుని సంహరించటానికి ఆ పుష్కరస్నానమాహాత్మ్యం కారణమని చెప్పబడింది. అయోధ్యా నగరానికి తిరుగు ప్రయాణంలో కూడ శ్రీరాముడు ఒక రాత్రి తిరుపతి కొండల మీద ఆగిమరీ వెళ్లాడట. అయితే తిరుగు ప్రయాణంలో ఒక వేళ ఆగి ఉండక పోయినప్పటికీ ఆయన మరొకసారి ఆంధ్ర ప్రాంతానికి వచ్చినప్పుడు ఇక్కడికి కూడ రావటం జరిగిందనే నిజం. మరొకసారి ఆయన రాకను గురించి ఇంతకు ముందు ప్రస్తావించుకున్నాము.

## 7. తిరుపతి : కోదండ రామాలయము :

దిగువ తిరుపతిలో ఒకప్పుడు భరద్వాజాశ్రమముండేదని, ఆ ఆశ్రమానికి శ్రీరాముడు వచ్చి కొన్నాళ్లున్నాడని చెప్పబడుతోంది. ఆ స్థానంలో శ్రీరాముడు కొన్నాళ్లున్న గుర్తుగా కోదండ రాముణ్ణి నిలుపుకోవటం జరిగింది. ఈ స్వామిని జాంబవంతుడు ప్రతిష్ఠించినట్లు ఈ కోదండ రామునికి జనమే జయుడు ఆలయ నిర్మాణం చేసినట్లు స్థల పురాణకథనం. ఈ ఆలయం పశ్చిమా భిముఖంగా ఉంటుంది.

తిరుపతి పట్టణము మధ్యలో, తిరుపతి రైల్వే స్టేషనుకు సుమారొక కిలోమీటరు దూరములో ఈ ఆలయ ముంది. ఒకప్పుడీ ఆలయము రఘునాధస్వామి ఆలయముగా పిలువబడేదట. జనమే జయుని తరువాత కలియుగంలో క్రీ॥శ॥ 1480–81 సంవత్సరాల కాలంలో గర్భాలయంపైన విమానము, గోపుర ప్రాకారాల నిర్మాణం జరిగినట్లు తెలుస్తుంది. ఈ దేవాలయంలో సీతారామ లక్ష్మణులు ప్రతిష్ఠింపబడి ఉన్నారు. ఆంజనేయుడు ప్రధానాలయానికి అభిముఖంగా కొలువుదీరి ఉన్నాడు. మహంతుల పరిపాలనా కాలము నుండి ఈనాటి వరకు ఇది తిరుపతి దేవస్థానం వారిపాలనలోనే ఉంది. తిరుపతిలో ఈ దేవాలయమున్న వీధిని రాములవారి సన్నిధి వీధిగా పిలుస్తారు. ఆలయానికి పడమటి దిక్కులోని రామచంద్రగుంట ఒకనాటి రామచంద్ర తీర్థం. ఆ కోనేరులో ఈ ఆలయంలోని స్వామి విగ్రహాలు జనమేజయునికి దొరికినవట. కేవలం ఈ ఒక్క దేవాలయం గురించి 'తిరుపతి శ్రీ వేంకటాద్రి రాముడు' అనే పేరుతో తలుపూరు రామ రమేశ్ కుమార్ ప్రత్యేకంగా ఒక గ్రంథం రచించారు. తిరుపతి దేవస్థానం ప్రచురించారు. మరిన్ని వివరాలు అందులో చూడవచ్చు.



## 8. వైకుంఠ తీర్థము :

స్వామి పుష్కరిణిలో స్నానము శ్రీరాముడు లంకకు వెళ్లేటప్పుడు జరిగిందని పైన చెప్పుకున్నాము. మరొకసారి వచ్చినప్పుడు, బహుశా శ్రీశైల ప్రదక్షిణ క్రమములోనేమో వైకుంఠ తీర్థానికి సమీపంలో శ్రీరాముడు కొన్నాళ్లుండి ఇందులో స్నానమాచరించాడని చెప్పబడుతోంది.

**9. సీతమ్మ తీర్థము :**

పైన చెప్పిన వైకుంఠ తీర్థములో శ్రీరాముడు స్నానమాచరిస్తే, సీతమ్మ తనకు అనువుగా ఉన్న మరొక తీర్థంలో స్నానమాచరించిందేమో! ఆ తీర్థానికి ఆ కారణంగా సీతమ్మ తీర్థమనే పేరు ఏర్పడి ఉండవచ్చు. దీన్ని ఇప్పుడు కూడ యాత్రికులు, స్థానికులు అరుదుగా దర్శిస్తూ ఉంటారు.

**10. సీతాకుండము :**

సీతాకుండము జాబాలి తీర్థానికి ఎగువన ఉంది. పైన చెప్పుకున్నది తీర్థము పేరుతో చెప్పుకోబడగా ఇది గుండముగా చెప్పుకోబడుతోంది. దీనితోబాటు ధ్రువగుండముల పరిసరములలో ఇప్పటికీ ఎందరో పుణ్యాత్ములు తపస్సు కొనసాగిస్తూ ఉంటారని చెప్పబడింది.

**11. మధురాంతకం :**

శ్రీరాముడు తాను చేసిన పర్యటనలో మధురాంతకం వచ్చినట్లుగా చెప్పబడుతోంది.

**కడప జిల్లా : ఒంటిమిట్ట :**

కడప నుండి తిరుపతికి వెళ్లే మార్గంలో కడపకు 27 కి.మీల దూరంలో ఒంటిమిట్ట ఉంది. మృకండుడు, శృంగి మొదలగు వారు తపసు చేసిన ప్రదేశం ఒంటిమిట్ట. ఇక్కడ రామలక్ష్మణులు అస్త్ర ప్రమోగము చేసి జలవనరులను సృష్టించారు. అవి రామతీర్థం, లక్ష్మణతీర్థమనే పేరుతో ఇప్పటికీ ఉన్నాయి. ఈ దర్శించటం అరణ్యవాసంలో మొదటి 13 సంవత్సరములలోపే జరిగినట్లు అనిపిస్తుంది. 14వ సంవత్సరములో సీతాపహరణము జరిగింది. అప్పటికింకా సుగ్రీవునితో శ్రీరామునికి మైత్రి యేర్పడలేదు గనుక ఆంజనేయుడు శ్రీరాముని కలుసుకోలేదు. అందుచేత ఒంటిమిట్టలో ఆంజనేయుడు లేని సీతారామ లక్ష్మణ మూర్తులే ప్రతిష్ఠింపబడ్డాయి.

అయ్యలరాజు రామభద్రకవి పసితనంలో ఆలయంలోకి వెళ్లిపోయాడట! ఈ సంగతి తల్లిదండ్రులు గాని, ఎవ్వరుగాని గమనించలేదు. అర్చక స్వాములు కూడ బాలుడు లోపలుండిపోయిన సంగతి గమనించక ఆలయపు తలుపులు మూసివేయటంతో ఆకలికి పసివాడైన రామభద్రుడు ఏడవగా సీతమ్మ తల్లిపాలిచ్చి ఆ బిడ్డ ఆకలి తీర్చిందట. బిడ్డను వెదకుతూ వచ్చిన రామభద్రుని తల్లిదండ్రులకు, బిడ్డ మూతిపై గల పాల ధారలు ఆ తడి ఆరిపోయి చారికలు కట్టగా అవి ఆమె యొక్క అవ్యాజ కరుణను, ప్రేమను తెలిపాయి. ఆంధ్ర వాల్మీకి వావిలికొలను

సుబ్బారావు గారు ఒంటిమిట్ట కోదండరాముని సేవించుకున్నారు. వైష్ణవ మత ప్రాముఖ్యాన్ని తెలియజేయటంలో చాల కృషి చేశారు. పోతన గారిది కూడ ఓరుగల్లు కాదు, ఒంటిమిట్టేననే అభిప్రాయము కూడ కొందరికి ఉంది. పోతన్నది ఓరుగల్లు దగ్గరే ఉన్న బమ్మెర కావటంతో పోతన్నది ఓరుగల్లే గాని ఒంటిమిట్ట కాదనే అభిప్రాయమే బలంగా కనిపిస్తుంది.

ఒంటోడు, మిట్టడు అనే అన్నదమ్ములు దొంగతనాలు చేసి జీవిస్తూ చివరకు రాముని ప్రభావం వలన మంచివాళ్లుగా మారిపోయారు. వారిద్దరి పేరు మీద అది ఒంటిమిట్ట అయిందట. వారు నివసించి, దొంగలించిన ఆభరణాలు దాచినది ఒక గుహ. ఆ గుహలో సీతారామలక్ష్మణ మూర్తులున్న ఏకశిల ఉన్నది.

**మల్లెంకొండ :**

గోపవరం మండలం ఓబులం గ్రామ సమీపంలోని మల్లెంకొండ మీదనున్న శివాలంయలో శ్రీరామలింగేశ్వరస్వామి వారు కొలువుదీరి ఉన్నాడు. శివునికి మల్లేశ్వరుడనే పేరు కూడ ఉండటం చేతనోయేమో ఈ కొండ మల్లయ్య కొండ అని పిలువబడేదని అది ఇప్పుడు మల్లెంకొండ అని పిలువబడుతోందని స్థానికుల కథనం.

**పుష్పగిరి :**

కడప జిల్లాలో ఇది పెన్నా నది తీరాన ఉన్న ప్రముఖ ప్రదేశం. ఇక్కడ చాలకాలం క్రితం ఒక శైవ పీఠముండేది. అధిపత్యంలో మార్పు వచ్చినా, ఇప్పటికి ఒక పీఠముంది. త్రేతాయుగంలో శ్రీరాముడు మాత్రమే కాక, ద్వాపర యుగంలో పాండవులు పుష్పగిరిని దర్శించినట్లు చెప్పబడుతోంది. శ్రీశైలానికున్న 8 ప్రవేశ ద్వారాలలో ఇది కూడ ఒకటి. శ్రీరాముడు ప్రదక్షిణ విధిననుసరించి శ్రీశైలం వెళుతూ ఈ నైర్రుతి ఉప ప్రవేశద్వార క్షేత్రంలో గూడ కొన్నాళ్లు ఉపవాసదీక్ష నిర్వహించి ఈ క్షేత్రాన్ని సేవించుకున్నాడు. ఇది బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కొలువుదీరిన క్షేత్రం. ఇంకా ఎంతోమంది దేవతలు ఇక్కడ నిలచి పూజలందుకుంటున్నారు. ఈ క్షేత్రానికి పుష్పగిరి అనే పేరు రావటానికి రెండు కారణాలు చెప్పబడినవి. శ్రీరామచంద్రుడిక్కడ కొన్నాళ్లున్నాడు. అది లంకకు వెళ్లే సమయంలో అని ఒక అభిప్రాయం. కాని అది సమంజసమనిపించదు. శ్రీశైల ప్రదక్షిణ మార్గాన్ని అనుసరిస్తూ వెళ్లినప్పుడే ఈ క్షేత్రాన్ని దర్శించి ఉంటాడనిపిస్తుంది. ఇక్కడ కొలువుదీరి ఉన్న ప్రధాన దైవము వైద్యనాథేశ్వరుడు. ఆయనను కొన్ని రోజుల పాటు పుష్పాలతో పూజించాడు.

శ్రీరాముడు ఆ పూజించిన పుష్పాలను తీసివేసి మర్నాడు నదిలో వేసేవాడు. అలాకొన్నాళ్లు వేసిన నిర్మాల్య పుష్పాలు (పూజ చేసి తీసివేసినవి) ఒక కొండవలె ఎత్తుగా నిలచిపోయాయట. నిర్మాల్య పుష్పాలు గిరివలె ఏర్పడటంతో ఆ ప్రదేశానికి పుష్పగిరి అనే పేరు వచ్చిందని అభిప్రాయం. లంకకు వెళ్లేటప్పుడు కొన్ని రోజుల పాటు స్థిమితంగా ఒక చోట నిలచి భారీగా పుష్పాదులు సేకరించి పూజ చేశాడనుకోవటం సమంజసమనిపించదు. తరువాత వచ్చినప్పుడే ఈ పూజా కార్యక్రమం జరిగిన ఉండాలి.

ఇక పుష్పగిరికి ఆ పేరు రావటానికి గల రెండో కారణము - కైలాస పర్వతములోని కొంత భాగాన్ని ఇక్కడ గల జలవనరులో వాయుదేవుని ద్వారా శివుడు వేయించాడని, అది పుష్పమువలె నీళ్ల మీద తేలి నిలిచిందని ఆ కారణం చేత పుష్పగిరి అనే పేరు వచ్చిందని చెప్పబడుతోంది. పుష్పగిరి అన్నపేరు ఎలా ఏర్పడినా శ్రీరాముడీ క్షేత్రాన్ని దర్శించాడనేది నిర్వివాదంశము. పుష్పగిరి కడప పట్టణానికి 16 కి.మీల దూరంలో కడప - కర్నూలు జాతీయ రహదారి నుండి 8 కి.మీల దూరంలోనున్న పంచనదీక్షేత్రం.

## గండిక్షేత్రం :

వేంపల్లి మండలంలోని గండి క్షేత్రంలో చిటికెన వ్రేలు లేని ఆంజనేయస్వామి మూర్తి ప్రతిష్ఠితమై ఉంది. శ్రీరాముడీ స్థానాన్ని దర్శించాడని, ఆంజనేయునికి సంబంధించిన ఒక ముఖ్య సంఘటన ఇక్కడ జరగటం చేత, ఆంజనేయుని అర్చామూర్తిని ప్రతిష్ఠింప పూనుకొన్నారని, ముహూర్తకాలం సమీపించటంతో, అప్పటికి రూపొందించి ఉన్న విగ్రహమూర్తిని ప్రతిష్ఠించారని, అప్పటి స్వామి చేతి చిటికెన వ్రేలు పూర్తికాలేదని, ఆ తరువాత చిటికెన వ్రేలును తీర్చిదిద్దుదామని ప్రయత్నింపగా ఉలి దెబ్బకు రక్తం కారటం మొదలవటంతో ఆ చిటికెన వ్రేలును తీర్చలేకపోయారని చెబుతారు.

## ప్రొద్దుటూరు సమీప రామేశ్వరము :

ప్రొద్దుటూరులో ఇంచుమించు అంతర్భాగమైన రామేశ్వతంలో శ్రీరామునిచే ఈశ్వరుడు రామేశ్వరుడుగా ప్రతిష్ఠితుడైయున్నాడు. ప్రొద్దుపొడవక ముందే శివలింగాన్ని ప్రతిష్ఠించే ప్రయత్నం ఇక్కడ జరగటం చేత అది ప్రొద్దుటూరు అని పిలువబడిందని చెబుతారు. మూహూర్త కాలానికి లింగం సిద్ధం చేయవలసిరాగా, తొందర తొందరగా లింగాన్ని రూపొందించటంలో సైకతలింగంపై ఏర్పడిన చేతి వ్రేళ్ల గుర్తులు ఇప్పటికీ అలా నిలచిఉన్నాయి.

రావణ వధానంతరం భారతదేశంలోకి రాగానే సముద్రపుటొడ్డున మొదటిసారి శ్రీరాముడు తిరుగు ప్రయాణంలో లింగ ప్రతిష్ఠజేస్తే, ఆ స్వామి వారు శ్రీరాముని పేరు మీద రామేశ్వరుడై ప్రసిద్ధంగా చెప్పుకో[illegible] తున్నాడు. కాని రామేశ్వరం అదొక్కటేకాదు. ఆంధ్రదేశంలో ఎన్నో రామే[illegible] ర్పడినవి. ఇంతకు ముందే వాటిలో కొన్నింటిని గూర్చి మనం తెలుసుక[illegible]ం.

**వెల్లాల సంజీవరాయుడు :**

వెల్లాల గ్రామం ప్రొద్దుటూరు పట్టణానికి 22 కి.మీల దూరంలో ప్రొద్దుటూరు, జమ్ములమడుగు పట్టణాల మధ్య ఉంది. త్రేతాయుగంలో ఈ ప్రాంతం కూడ దండకారణ్యమే. పురాణకాలం నాడు కుముద్వతి అనే పేరు గల – ఈనాటి కుందూ నది ఒడ్డున ఆంజనేయుడు సంధ్యోపాసన కోసం దిగినప్పుడు అక్కడి మునులు ఆంజనేయుణ్ణి అక్కడే ఉండిపోమ్మన్నారట. కాని ఆంజనేయుడు యుద్ధంలో దెబ్బతిని మూర్ఛబోయిన లక్ష్మణునికి ప్రాణా పాయం కలుగకుండా రక్షించడం కోసం వెళుతున్నాడు గనుక "వెళ్లాల... వెళ్లాల... ఆగటానికి వీల్లే"దని చెప్పి తనకు మారుగా ప్రతిమను ఇచ్చి వెళ్లాడు. ఆ ప్రతిమనే అక్కడి మునులు ప్రతిష్ఠించారు. సంజీవనిని తీసికొని వచ్చి లక్ష్మణుని ప్రాణాలు నిలిపినవాడు గనుక ఆంజనేయుడు సంజీవరాయుడు అయినాడు. "వెళ్లాల... " ఆగటానికి వీల్లేదన్న ఆస్థలమే ఆ తర్వాత "వెల్లాల"గా మారి ఆ గ్రామ నామమై అదే పేరుతో త్రేతాయుగము నుండి ఈనాటికీ ఉంది.

సంజీవరాయ స్వామిది భారీ విగ్రహం. పూర్వమది రోజురోజుకీ పెరు గుతూ ఉండేదని, స్వామి శిరస్సుపైన రాగి కలశాన్ని ఏర్పాటు చేశాక పెరుగుదల నిలచిందని చెప్పబడుతోంది. ఆలయానికి దగ్గరలో భీమలింగేశ్వరాలయముంది. ఇది భీమునిచే ప్రతిష్ఠింపబడినదిగా చెబుతారు. అక్కడే అమ్మవారితో కూడి ఉన్న నరసింహస్వామి దేవాలయము, ఇతర దేవతల ఆలయాలున్నాయి. ఇక్కడ హనుమంతుడు స్నానం చేసిన కుండానికి హనుమంతుని కుండమని పేరు.

కిష్కింధకాండలో సీతాన్వేషణకు వెళ్లే వానరులలో దక్షిణ దిక్కుకు వెళ్లే వారితో వారు వెదుకవలసిన ప్రదేశాలలో ఆంధ్రపేరిటి రాజ్యము కూడ ఒకటని సుగ్రీవుడు చెప్పాడు.

***అన్వీక్ష్య దండకారణ్యం సపర్వత నదీం గుహాం,***
***నదీం గోదావరీంచైవ సర్వమేవాను పశ్యత.***
***తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యాన్ సకేరళాన్*** *(కిష్కి 41-12)*

ఆ విధంగా పై శ్లోకం త్రేతాయుగం చివరినాటికే ఆంధ్రపేరిటి రాజ్యమున్నదని చెబుతుంటే, పైన చెప్పిన సంఘటనలో ఆంజనేయుని మాటల్లో చెప్పబడిన "వెళ్లాల...' అనే మాటల నుండి పుట్టిన "వెల్లాల...." అనే గ్రామ నామము ఆంధ్ర భాష వ్యావహారికముగ ఆ కాలము నాటికే ఉపయోగింపబడు తోందని తెలుపుతుంది.

**సిద్ధవటం :**

ఇది శ్రీశైలానికి దక్షిణ దిక్కులోని ప్రధాన ప్రవేశద్వారము ప్రధాన దైవము సిద్ధేశ్వరుడు - అష్టమహాసిద్ధి ఇది కూడ పెన్నా నదీతీరాన ఉంది. స్వామి వారి లింగం స్పర్శవేది. ఎన్నో రూపాలలో సంతరించుకొన్న విశిష్టతనే సూచించే నామాలతో పరమేశ్వరుడు కొలువుదీరి ఉన్నాడు. ఎన్నో తీర్థాలు న్నాయి. దీనిని శ్రీరాముడు శ్రీశైల ప్రదక్షిణ మార్గములో దర్శించాడు.

**తాళ్లపాక :**

అన్నమయ్య జన్మస్థలంగా ప్రసిద్ధి చెందిన తాళ్లపాకలో సిద్ధేశ్వరస్వామి వారి ఆలయం ఉన్నది. ఈ ప్రాంతంలోని ప్రకృతి రామణీయకతకు ముగ్ధురాలైన సీతాదేవి అక్కడ కొంతకాలముందామని శ్రీరాముణ్ణి కోరిందట. తాళ్లపాక కూడ ఒకనాటి దండకారణ్యములోని భాగమే. వారక్కడున్న కాలంలో శ్రీరామ చంద్రుడీ ఊరిలోని శివుణ్ణి ప్రతిష్టించి పూజించినట్లు స్థల చరిత్రవల్ల తెలుస్తుంది. అయితే శ్రీరాముని తరువాత ఈ స్వామిని సిద్ధులు కూడ పూజిస్తూ ఉండేవారని ఆకారణంగా ఆయన సిద్ధేశ్వరుడుగా ప్రసిద్ధికెక్కి శివునికాపేరు నిలిచిపోయిందని అంటారు. అమ్మవారి పేరు కామాక్షి. ఇంకా ఈ దేవాలయంలో మహాగణపతి, సిద్ధిగణపతి, సుబ్రహ్మణ్యస్వామి, వీరభద్రుడు, దక్షిణామూర్తి,చండికేశుడు కూడ కొలువుదీరి ఉన్నారు.

**అనంతపురం జిల్లా : చిల్లారిపల్లె గ్రామము :**

ఇకాడొక చింతలతోపు ఉండేదట. ఇక్కడ సీతమ్మను వక్షస్థలం మీద ఒక కాకి పొడిచిందట. దీనిని బట్టి కాకాసురుని కథ ఇక్కడే జరిగినట్లనిపిస్తుంది. శ్రీరాముడు ఒక దర్భను మంత్రించి వేస్తే ఆ అస్త్రం వెంటబడి తరుమగా కాకాసురునికి ఎక్కడా రక్షణ దొరకక తిరిగి తిరిగి వచ్చి సీతారాముల కాళ్ల మీద పడగా శ్రీరాముడు కాకులకు ఒక్క కన్నుకు మాత్రమే దృష్టి ఉండేటట్లు చేసినట్లు చెప్పబడుతోంది.

**లేపాక్షి :**

108 శైవ క్షేత్రాలలో లేపాక్షి కూడ ఒకటని స్కాంద పురాణం చెబుతోంది. ఇక్కడ అగస్త్య మహర్షిచే ప్రతిష్ఠితమైన పాపనాశేశ్వరలింగముంది. సీతా సమేతుడై శ్రీరాముడిక్కడికి వచ్చాడు. జటాయువు పడినచోటిదియనే విషయం కూడ ఉన్నా మనం ఖమ్మం జిల్లాలోని ఎటపాక, రేకపల్లి వద్దే అది జరిగి ఉంటుందని అనుకున్నాం. ఇక్కడ శ్రీరాముడు ప్రతిష్ఠించిన రామలింగే శ్వరుడు, హనుమంతుడు ప్రతిష్ఠించిన లింగం కూడ ఉన్నాయి. ఆంజనేయునితో కూడ కలసి లింగాలు ప్రతిష్ఠింపబడి ఉండటంతో ఇవి అరణ్య వాసములో లంకకు వెళుతూ చేసిన ప్రతిష్ఠలు కావని, శ్రీరాముడు పట్టాభిషేకానంతరం వచ్చి చేసినవైయుంటాయనిపిస్తుంది. ఇక్కడున్న సీతమ్మ పాదముద్ర చాల సహజంగా సున్నితంగా ఉంటుంది. ఒక్క పాదముద్రే ఉంది. రెండోది పెనుగొండ దుర్గం మీద ఉన్నది. ఇలా ఒకే పాదముద్ర ఉండటం విజయవాడలోని సీతమ్మ పాదల రేవు దగ్గర కూడ కనిపిస్తుంది.

**కర్నూలు జిల్లా : శ్రీశైలము :**

శ్రీశైలమంతటి అతి ప్రాచీన చరిత్ర కలిగిన క్షేత్రము ఆంధ్రదేశంలోనే కాదు, మొత్తం భారతదేశంలోనే లేదేమో! ఈ శ్రీశైలభ్రమరాంబాసమేత మల్లికార్జునస్వామిని సీతాసమేతంగా శ్రీరాముడు దర్శించుకున్నాడు. ఆ దర్శనం సామాన్యమైన 'మొక్కుబడి' దర్శనం కాదు. శాస్త్రము నిర్దేశించిన విధంగా, క్షేత్ర సంప్రదాయానుసారముగా ఆయన దర్శించాడు. శ్రీశైల క్షేత్రాన్ని దర్శించటమంటే తిన్నగా శ్రీశైలానికి వెళ్లటంకాదు. ప్రదక్షిణ విధిని పాటిస్తూ దర్శనము చేయాలి. ప్రదక్షిణ విధిని పాటించటమంటే కేవలం గుడి చుట్టూ తిరగటము కాదు. శ్రీశైలానికి అష్ట ప్రవేశద్వారాలున్నాయి. వాటిలో కూడ ఏదో ఒక ప్రవేశద్వారము గుండా ప్రవేశించటము కాదు. అష్ట ప్రవేశద్వారాలను చుట్టుకొంటూ, ఒక్కొక్క ప్రవేశద్వారము దగ్గరున్న తీర్థాలను, ఆయా ప్రదేశాలలో కొలువుదీరి ఉన్న క్షేత్ర దేవతలను దర్శిస్తూ శ్రీశైల ప్రధాన క్షేత్రంలోకి ప్రవేశిం చాలి. ఇది మళ్లీ రెండు విధాలు. ఒకటి పద్మ ప్రదక్షిణము. రెండవది రామ ప్రదక్షిణము. మొదటి పద్ధతిలో పద్మములోని రేకుల వల్లెనున్న ఒక్కొక్క ప్రవేశ ద్వారము చేరి అక్కడి తీర్థ క్షేత్రాలను దర్శించి శ్రీశైలానికి వచ్చి స్వామిని దర్శించాలి. మళ్లీ రెండవ ప్రవేశద్వారము ద్వారా అక్కడి తీర్థ క్షేత్రాలను దర్శించి శ్రీశైలానికి రావాలి. అంటే మొత్తం శ్రీశైలానికి 8 సార్లు వచ్చి దర్శనం చేస్తే గాని దర్శన విధి పూర్తిగాదు. ఇలా బ్రహ్మ చేశాడని చెప్పబడుతోంది.

రెండవ ప్రదక్షిణ పద్ధతికి రామ ప్రదక్షిణ పద్ధతి అనే పేరు. అంటే ఆ విధమైన నియమము రాముని వలననే ఏర్పడిందన్నమాట. ఈ పద్ధతిలో మొట్టమొదటి ఉత్తర ద్వారములో ప్రదక్షిణము ప్రారంభము చేయాలి. ఉత్తర ద్వారము మెహబూబ్‌నగర్ జిల్లా, అచ్చంపేట మండలములోనున్న ఉమా మహేశ్వరము. అక్కడున్న ఉమాసహిత మహేశ్వరుణ్ణి దర్శించుకొని, అక్కడున్న తీర్థాలలో స్నానం చేసి, అక్కడ క్షేత్రములో కొలువుదీరి ఉన్న ఇతర దైవములను దర్శించుకొని ప్రధాన ద్వారములందు 5 రోజుల చొప్పున, ఉప ద్వారములందు 3 రోజుల చొప్పున ఉపవాస దీక్షతో ఉండాలి. ప్రదక్షిణము చేస్తున్న కాలములో శివ దీక్షా నియమాలకు పాటించాలి. అంటే శరీరానికి విబూది పూసుకొని శివ పంచాక్షరి చేస్తూ తిథి వార నక్షత్ర పర్వదిన నియమాలను పాటిస్తూ ప్రదక్షిణము చేయాలి.

మొదటి ప్రవేశద్వారము ఉమామహేశ్వరమయితే రెండవది ఈశాన్య దిక్కులో ఉన్న ఏలేశ్వరము. ఇది నల్లగొండ జిల్లాలో ఉంది. ఇక్కడ కాత్యాయినీ సమేత ఏలేశ్వరుడున్నాడు. ఇంకా హాటకేశ్వర, నీలకంఠేశ్వర, రససిద్ధేశ్వర ఆలయాలు, విష్ణ్వాలయాలు దర్శించాలి. శ్రీరాముడు వీటినన్నింటిని దర్శించా దన్నమాట. కాని నాగార్జున సాగర్ నిర్మాణము వలన ఇప్పుడీ క్షేత్రము లేదు.

ఈ విధిలో మూడవదయిన తూర్పు ప్రవేశద్వారము త్రిపురాంతకము. స్వామి త్రిపుర సుందరీ సమేత త్రిపురాంతకేశ్వరుడు. అక్కడ మొత్తం 30పైగా ఉన్న తీర్థాలను, క్షేత్రాలను దర్శించాలి. నాల్గవదియైన ఆగ్నేయ దిక్కులోని సోమశిలలో ఉన్న కామాక్షీ సహిత సోమేశ్వరుణ్ణి, ఇంకా కుమారస్వామిచే ప్రతిష్ఠింపబడిన శివుణ్ణి దర్శించాలి. ఇది నెల్లూరు జిల్లాలో పెన్నా నది ఒడ్డున ఉంది. ఐదవ ద్వారము దక్షిణ దిక్కులోని సిద్ధవటము. ఇది కడప జిల్లాలో ఉంది. ఇక్కడ స్వామి సిద్ధేశ్వరుడు. 33 తీర్థ, క్షేత్ర దేవతలతో పెన్నా నది ఒడ్డున కొలువుదీరి ఉన్నాడు. ఆరవది నైర్రుతిలోని పుష్పగిరి. ఇదికూడ పెన్నా నది తీరాన కడప జిల్లాలో ఉంది. త్రిమూర్తులు కొలువుదీరిన క్షేత్రమిది. ఇంకా దశ సంఖ్యలో కొలువుదీరి ఉన్న ఇతర క్షేత్ర దైవములను దర్శించాలి. ఏడవ ప్రవేశ ద్వారము పడమటి దిక్కులోని అలంపురము. అష్టాదశ శక్తులలో ఒకరైన జోగులాంబ బ్రహ్మేశ్వరులిక్కడ కొలువుదీరి ఉన్నారు. ఇక్కడే నవ బ్రహ్మాలయాలున్నాయి. ఉమాదేవి సహిత మహేశ్వరుడు అర్ధచంద్రాకార పర్వతముపై కొలువుదీరి ఉన్నాడు. ఎగువన మరొక చతుర్భుజ ఉమాదేవి ఉంది. దందుభిసాగర తీర్థముంది. ఉత్తర ద్వారములోని పేరుతోనే పడమటి ప్రవేశద్వారములోను ఒక స్వామి కొలువుదీరి ఉండటమొక విశేషము. ఇది కూడ మెహబూబ్‌నగర్ జిల్లాలోనే ఉంది.

ఇక ఎనిమిదవ ప్రవేశద్వారము వాయవ్యదిక్కులోని సంగమేశ్వరము. ఇది విశ్వామిత్ర, శాండిల్య మహర్షుల ఆశ్రమాలతోను, వసిష్ఠ ప్రతిష్ఠితమైన నరసింహుడు. కల్మాషపాద, కపిళేశ్వర సప్త సోమేశ్వరులు కొలువుదీరి ఉన్న క్షేత్రం. ఇది కూడ మెహబూబ్‌నగర్ జిల్లాలో ఉంది. వీటినన్నింటిని సీతారాములు దర్శించారు. ఆ విధంగా ప్రదక్షిణము పూర్తి చేసికొని, శ్రీశైల శిఖర దర్శనం చేసి శ్రీశైల క్షేత్రంలో ప్రవేశించారు సీతారాములు. అక్కడెంత కాలమున్నారో తెలియదుగాని సీతారాములిద్దరు చెరియొక సహస్రలింగేశ్వర స్వామిని ప్రతిష్ఠించారు. శ్రీరాముడు ప్రతిష్ఠించిన సహస్ర లింగేశ్వరుడు శ్రీశైల ములోని వృద్ధ మల్లికార్జున లింగము వెనుక ఉన్నాడు. సీతాదేవి ప్రతిష్ఠించిన సహస్ర లింగేశ్వరుడు రెండవ ప్రాకారంలో అమ్మవారి ఆలయ సింహమంట పము దాటిన తరువాత సింహద్వారానికి యెడమ ప్రక్కగా ఉన్నాడు. ఈ విధంగా వారు ప్రదక్షిణ విధిని సక్రమంగా పాటించి మెహబూబ్‌నగర్, నల్గొండ, ప్రకాశం, నెల్లూరు, కడప, కర్నూలు జిల్లాలో ఉన్న 8 ప్రవేశద్వారాలను, అక్కడి తీర్థాలను, క్షేత్రాలలోని స్వామి వారలను దర్శించి శ్రీశైల యాత్రను పూర్తిచేశారంటే అది వారము పది రోజులలో జరిగింది కాదు. లంక నుండి వచ్చేటప్పుడు తిరుగు ప్రయాణంలో పుష్పక విమానాన్ని ఆపుకొని చేసింది కూడ కాదు, శ్రీరామ పట్టాభిషేకానంతరము జరిగిందే. ఎందుచేతనంటే నాలుగు ప్రధాన ప్రవేశద్వారాలలో ఒక్కొక్కచోట 5 రోజుల ఉపవాసము (4×5=20) 4 ఉప ద్వారాల వద్ద 3 రోజుల చొప్పున (4×3=12) మొత్తం 32 రోజులు ఉపవాస దీక్షలు, సుమారు ముప్పదివరకు ఉన్న తీర్థాలలో స్నానము క్షేత్ర స్వాముల దర్శనము, కాలినడక ప్రయాణము పరిగణనలోకి తీసికొంటే నాలుగైదు నెలలు పట్టి ఉంటుంది. కనుక, సీతారాములు ఆంధ్ర దేశానికి మూడవసారి వచ్చి ఉండి, క్షేత్ర దర్శన, ప్రతిష్ఠాది కార్యక్రమాలు నిర్వర్తించి ఉంటారనేటందుకు బలమైన ఆధారంగా కనబడతాయి.

ఈ విధంగా శ్రీశైలాన్ని అష్టదిక్కుల ప్రవేశ ద్వారాలు దర్శిస్తూ ప్రదక్షిణ మార్గం వెంట శ్రీశైలేశుడైన భ్రమరాంబా సమేత మల్లికార్జునస్వామిని దర్శించు కోవటంలో మెహబూబ్‌నగర్, నల్గొండ, ప్రకాశం, నెల్లూరు, కడప మరియు కర్నూలు జిల్లాలలోని క్షేత్రాలను, తీర్థాలను దర్శించి సేవించు కున్నారు. సీతా రాములు. తీర్థాలు, క్షేత్రాలు అప్పటివే. జిల్లాల పేర్లు మాత్రం వాటిని పోల్చుకొని గుర్తించేటందుకు ఈనాడు ఆ జిల్లాలకున్న పేర్లు చెప్పుకున్నాం! అంతే!

**అహోబిలం :**

కర్నూలు జిల్లాలోని నంద్యాలకు 42 కి.మీ దూరంలో అహోబిల క్షేత్రముంది. ఆళ్లగడ్డ నుండి కూడ అహోబిలక్షేత్రాన్ని దర్శించుకునే మార్గముంది. శ్రీ నరసింహుడిక్కడ

9 మూర్తులుగా నవ నరసింహులై కొలువుదీరి ఉన్నాడు. స్వామి కొలువుతీరి ఉన్న బిలము ఒక పెద్దకొండ బిలము కావటంచేత ఆ స్థానానికి 'అహోబిలము' - అంటే 'అబ్బోఎంత పెద్ద గుహో' అనే అర్థము గల మాటలతో అహోబిలమనే పేరు వచ్చిందని, ఆయన బలాన్ని కీర్తిస్తూ 'అహోబల'స్వామి అని కూడ అంటారని చెప్పబడింది. ఈ బిలం అంటే పర్వత సొరంగ ప్రదేశములోనున్న నవ నరసింహులను చూడటానికి దిగువ అహో బిలము నుండి ఎగువ అహోబిలము వరకు సుమారు 9 కిమీల దూరము నడిచివెళ్లి దర్శించుకోవాలి. బిలమార్గమే మార్గము. ఈ క్షేత్రాన్ని శ్రీరాముడు సీతాన్వేషణ చేస్తున్న సమయంలో సందర్శించుకున్నాడని చెప్పబడింది.

హిరణ్యకశిపుణ్ణి అతని నివాసములోనే నరసింహస్వామి గోళ్లతో చీల్చి చంపాడని భాగవతములో చెప్పబడినా, అహోబిలములోనేనని ఇచ్చటి కథనము. హిరణ్యకశిపుణ్ణి అంత మొందించటానికి నరసింహుడెత్తిన ఉగ్రరూపము లక్ష్మీదేవి చేసిన ఉపచారముల వలన శాంతి పొందిందని, నరసింహుడు ఆ తరువాత ఇచ్చటనే స్థిరపడి నిలచిపోయాడని స్థల పురాణము చెబుతుంది. అమ్మవారు చెంచులక్ష్మిగా అవతారం ధరించి ఇక్కడ కొలువుదీరి ఉంది.

## నందివర్గం :

కడప - కర్నూలు రహదారిలో పాణ్యం దాటిన తరువాత రహదారికి సుమారు 3 కి.మీల దూరంలో నందివర్గమనే పేరుగల గ్రామమొకటి ఉంది. ఆ గ్రామంలో ఒక రామతీర్థముంది. ఒక రాతిబండ క్రింద నుండి నీరూరుతూ ఉంటుంది. శ్రీశైల ప్రదక్షణ సమయంలోనో లేక మరొకమారు వచ్చినప్పుడో తెలియదు కాని - సీతమ్మకు దాహం వేస్తే - లక్ష్మణుడు బాణ ప్రయోగం చేసి ఒక జలవనరును సృష్టించాడని చెప్పబడుతోంది. దాన్నే బుగ్గరామేశ్వరతీర్థం అంటారు. ఆ బుగ్గ నుండి నీరు నిరంతరము వెలువడుతూ ఉంటుంది. అక్కడ శ్రీరామునిచే ప్రతిష్ఠితుడైన రామేశ్వరస్వామి ఉన్నాడు. శ్రీరాముని రాకకు చిహ్నంగా అక్కడొక రామాలయం కూడ నిర్మింపబడి ఉంది.

## సిద్ధేశ్వరము :

కర్నూలుకు సుమారు 56 కి.మీల దూరంలో సంగమేశ్వరమనే చిన్న గ్రామము ఒక కొండపాదము వద్ద ఉంది. ఇక్కడికి దగ్గరలోనే చిన్న సంగమేశ్వరమనే పేరుగల మరో ప్రదేశముంది. అక్కడే తుంగభద్ర వచ్చి కృష్ణానదిలో కలుస్తుంది. కృష్ణానది ఇక్కడ కొండల నంటి మలుపులు తిరుగుతూ పాఱుతుంది. ఇక్కడికి సమీపంలోనే భవనాశి కూడ కృష్ణానదిలో కలుస్తుంది.

సంగమేశ్వరానికి రెండు కిలోమీటర్ల దూరంలో సిద్ధేశ్వరముంది. ఇక్కడ కూడ నది అక్కడున్న కొండనంటుకుని ప్రవహిస్తూ ఉంటుంది. నీళ్ళల్లో పెద్ద పెద్ద నల్లబండలు కనిపిస్తూ ఉంటాయి. కొన్ని బండలు నీళ్ళపైకి కూడ కనిపిస్తూ ఉంటాయి. ఈ బండలపైన సీతాదేవి తన చీరెలను ఆరవేసికొన్నదని అక్కడి స్థానికులు గుర్తులు చూపుతూ ఉంటారు.

సిద్ధేశ్వరానికి ఆనుకొని పాఱుతున్న కృష్ణకు అవతలి ఒడ్డున సోమేశ్వరము, మల్లేశ్వరమనే ప్రసిద్ధ శైవ క్షేత్రాలున్నాయి. సంగమేశ్వరానికి సుమారు 6 కి.మీల దూరంలో భవనాసి ఒడ్డున కపిలేశ్వరమనే శైవ క్షేత్రముంది. ఈ విధంగానున్న సంగమేశ్వర, సిద్ధేశ్వర, సోమేశ్వర, మల్లేశ్వర, కపిలేశ్వర స్వాములకు పంచలింగాలని పేరు. వీటిని కూడ శ్రీరాముడు దర్శించినట్లు పై ఆధారము వలన మనము చెప్పుకొనవచ్చును.

## మెహబూబ్‌నగర్ జిల్లా :

శ్రీరాముడు శ్రీశైల ప్రదక్షిణ మార్గములో వెళ్లి శ్రీశైలేశ్వరుణ్ణి దర్శించుకున్నప్పుడు మెహబూబ్‌నగర్ జిల్లాలోని కొన్ని ప్రదేశాలను దర్శించుకున్నట్లు పైన చెప్పుకున్నాము. అవి కాకుండా శ్రీరాముడు దర్శించుకున్న మరికొన్ని క్షేత్రాల వివరాలు ఇప్పుడు చూద్దాం.

## చాగదొన :

చ్యవనకుడనే ఋషి శివుని గురించి ఘోరతపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై వరమిస్తాను కోరుకొమ్మన్నాడు. అప్పుడు చ్యవనకుడు శివదర్శనంతో భవబంధాలు తొలగిపోయాయని ముక్తినిమ్మని కోరాడు. అందుకు పరమే శ్వరుడంగీకరిస్తూ, తన వైభవాన్ని వివరిస్తూ కొంతకాలం జీవించాలని చ్యవనుణ్ణి ఆదేశించాడు. అక్కడే ఉన్న రాతిమీద శివలింగ ప్రతిష్ఠ చేసి రామలింగేశ్వరుడని పిలువమన్నాడు. అక్కడొక గ్రామం వెలసి అది చ్యవనకదొన అని పిలువ బడుతుందని చెప్పి శివుడదృశ్యుడైనాడు.

చ్యవనకుడు శివాదేశాన్ని పాటించాలనుకొని ప్రయాణమైనాడు. కాని ఒక్క అడుగు కూడ ముందుకు సాగలేదు. అతడు దివ్యదృష్టితో చూడగా ఈ క్రింది కారణం తెలిసింది. రాముడు త్రేతాయుగంలో సీతాన్వేషణ చేస్తున్నప్పుడు ఒకరాతి మీద కూర్చున్నాడు. అదే ఇప్పుడు చ్యవనకుడు నిలచి ఉన్నరాయి. అక్కడ ఎందుకు కూర్చుని ఉన్నావని అప్పుడు లక్ష్మణుడు రాముణ్ణి అడిగాడట! అప్పుడు రాముడు

కొన్ని వేల సంవత్సరాల తర్వాత కలియుగంలో చ్యవనకుడనే ఋషి ఇక్కడ శివలింగ ప్రతిష్ఠ చేసి దానికి రామలింగేశ్వరుడని పేరు పెడతాడని అందువలన అక్కడ ఆగానని రాముడు చెప్పాడు. చ్యవనకుడు ఆ రాతిని సూక్ష్మంగా పరిశీలించి, దాని మీద రామపాద చిహ్నాలున్నట్లు తెలిసికొని, అదే తాను లింగ ప్రతిష్ఠ చేయవలసిన రాయి అన్ని నిర్ణయించుకొని లింగబాణం కోసం 3 నెలలు ప్రయాణము చేసి కాశీ వెళ్లాడు.

అక్కడొక మహాభక్తుడు పాలరాతి లింగ బాణంతో ఉండి, తాను చ్యవనకుని రాకకోసం ఎదురుచూస్తున్నానని, మరునాడు ఉదయం గంగా స్నానం చేసిరమ్మని చ్యవనకునితో చెప్పాడు. చ్యవనకుడలానే చేసి శివలింగాన్ని తీసికొనివచ్చి ప్రతిష్ఠించి రోజూ తుంగభద్రానదీ జలంతో అభిషేకిస్తూ ఉండేవాడు. ఆ స్థలానికి తుంగభద్ర సుమారు 15 కి.మీల దూరముంది. చ్యవనకుడు ముసలితనము వలన ఒకనాడు నదీజలము తేలేక అభిషేకం ఎలా చెయ్యాలా అని ఆలోచిస్తూ నిద్రపోయినాడు. కలలో తుంగభద్రానదీ దేవత ప్రత్యక్షమై తాను దేవాలయ సమీపములో వెలుస్తానని చెప్పింది. మరునాటి ఉదయం చ్యవనకుడు గుడివెనుక ఒక క్రొత్త చెలువు ఏర్పడి ఉండటం చూశాడు. ఆ నీటితో అభిషేకిస్తూ కొంతకాలానికి ముక్తి పొందాడు. ఆ తరువాత ఆ చెలువు చ్యవనకుదొన అని పిలువబడింది. దొన అంటే నీరునిలిచే పల్లపు ప్రదేశము అని అర్థము. అదే క్రమంగా ఆ ఊరిపేరైంది. ఆ గ్రామమిప్పుడు కాలగతిలో చాగదొనగా పిలువబడుతోంది.

## మెహబూబ్‌నగర్ : కోయిలకొండ :

మెహబూబ్‌నగర్‌కు 25 కిమీల దూరంలో ఉన్న కోయిల కొండకు చారిత్రకంగా చాల ప్రాముఖ్యముంది. ఇదొకగిరి దుర్గమున్న స్థానం. 1516 నుండి గోల్కొండను పాలించిన కులీకుతుబుల్ మరియు వారి వంశం వారికి ఈ కోట పరిపాలనకు సంబంధించిన పోరాటాలతో సంబంధముంది. ఈ విషయాలు అక్కడున్న శాసనాల వలన తెలుస్తున్నవి. ఇక్కడున్న కోట సప్తప్రా కారాలతో, బురుజులతో, నాలుగువైపులా ముఖద్వారాలతోను ఉంది. అంత కంటే ప్రముఖమైన విషయమేమంటే ఆనాడు కోయిల్ సాగర్ అనే పేరుతో వారేర్పరచుకొన్న పెద్దజలవనరు ఆనాటి కోటవాసులకు, ఆ పరిసర వాసులకు త్రాగునీరే కాక సాగునీరు కూడ అందించిన 'సాగర'మది.

ఈ కోట ఉన్న కొండకే పూర్వము నుండి 'రామగిరి' అనే పేరుండేదని స్థానికుల కథనం. అరణ్యవాస కాలంలో శ్రీరాముడిక్కడ కొంతకాలమున్నాడని చెబుతారు. ఆ కొండమీద ఆయన పాదముద్రలు పడిన గుర్తుగా ఇప్పటికి ఒక పాదముద్ర

నిలచి ఉంది. అది ఒకనాటి జనావాసమైన కోట కనుక అనేక దేవాలయాలున్నాయి. వీరభద్రస్వామి, లక్ష్మీనరసింహస్వామి, ఆంజనేయస్వామి దేవాలయాలున్నాయి. ఇక్కడి కనకదుర్గ ఆలయంలోని అర్చామూర్తి మహ మ్మదీయుల దండ యాత్రల కాలంలో వేరొక స్థానానికి తరలించబడిందని చెబుతారు.

ఏమైనా శ్రీరాముడు వేసిన అడుగుజాడల గుర్తుగా ఆయన పాదముద్ర ఇప్పటికీ అక్కడ నిలచి ఉంది.

**మన్యంకొండ :**

మహబూబ్‌నగర్ నుండి రాయచూర్ వెళ్లేదారిలో 20 కి.మీల దూరాన ఉన్న మన్యంకొండ శ్రీ వేంకటేశ్వర క్షేత్రంగా ప్రసిద్ధమై ఉన్నా, ఇది ఎన్నో యుగాల చరిత్ర కలిగిన ప్రదేశం. ఒకప్పుడీ కొండమీద నరసింహస్వామి కొలువుదీరి ఉండేవాడు. త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడీ కొండపైన కొంత కాలము మునుల సేవలందుకొన్నాడని చెప్పబడింది. ఈ కొండ చుట్టూ ఎన్నో గుహలున్నవి. వానిలో మునులు తపస్సుచేస్తూ ఉండేవారని, ఆ కారణం గానే అది మునుల కొండ అని పిలువబడేదని, ఆ తరువాత అదే మన్యంకొండగా రూపాంతరం చెందిందని చెప్పబడుతోంది. ఈ కొండను రాముడు దర్శించిన కారణంగా రాములకొండయని గూడ పిలువబడుతోంది. ఆ తరువాత కాలంలో శ్రీ కృష్ణుడు కూడ గొల్లపిల్లవాని రూపంలో ఇక్కడ తన లీలలు ప్రదర్శించాడని, గోపికా కృష్ణుల తేజోరూపమిక్కడ ఇప్పటికీ నిలచి ఉందని, హనుమద్దాసువంటి ప్రముఖ భక్తులకు గోపికల దర్శన భాగ్యం కలిగిందని చెబుతారు.

మన్యం కొండ పరిసరాలలో గల పర్వతాలు తులసివనాలతో నిండి ఉంటాయి. భృగుమహర్షి తన భర్తను అవమానించిన కారణంగా లక్ష్మీ దేవి భూలోకానికి తరలివచ్చినప్పుడు ఈ మార్గాన వెళ్లిన కారణంగా తులసివనా లేర్పడినాయని చెప్పబడుతోంది. శ్రీ వేంకటేశ్వరుడు లక్ష్మీదేవిని వెదకుతూ భూలోకానికి వచ్చి మునుల నుండి ఆమె అటు వచ్చిందేమోనన్న సమాచారము సేకరించాడని, కలియుగంలో తానక్కడ వెలుస్తానని చెప్పాడని, ఆ మాట నిలుపుకొనేటందుకే ఇప్పుడా కొండమీద కొలువుదీరాడని చెప్పబడుతోంది.

**నల్లగొండ జిల్లా : జీడికల్లు :**

హైదరాబాదు నుండి వరంగల్లుకు వెళ్లే రైలు మార్గము మధ్యలోగల ఆలేరుకు సుమారు 16 కి.మీల దూరంలో ఉన్న జీడికల్లుకు శ్రీరామచంద్రునితో ప్రగాఢ

సంబంధముంది. శ్రీరాముడు ఇక్కడ కూడ ఒక లేడిని చంపాడు. కాని అది మాయలేడిగా మారిన మారీచుడు కాదు. అతడొక గంధర్వుడు. పేరు చిత్రరథుడు. తానెవరో రామునికి తెలిపి కౌశిక మహర్షి శాపము నుండి తనకు విముక్తి కలిగించినందుకు కృతజ్ఞతలు చెప్పుకొని, అప్పుడు తానున్న ప్రదేశము తన జన్మ స్థలమని కూడ వినమ్రతతో తెలిపి శ్రీరాముని అభిమానానికి పాత్రుడైనాడు చిత్రరథుడు. శ్రీరాముడు ఆదరముతో వరమిస్తాననగా, శ్రీరాముని పవిత్ర పాదజలాన్ని కోరుకున్నాడు. శ్రీరాముడు తానింతకు ముందు గట్టిగా మోకాలు నేలకానించి బాణ ప్రయోగము చేసిన చోటును గట్టిగా నొక్కి, గంగను ప్రార్థించి ప్రత్యక్ష పరచుకొని ఆ జలాన్ని చిత్రరథునికీయగా ఆ జలమును ఎల్లప్పుడు వచ్చేటట్లు వరమును ప్రసాదింపు మని చిత్రరథుడు కోరుకున్నాడు. ఆ బండకు లేడి బండ అనే పేరు పెట్టమని కోరాడు. ఆయన ఒక కాలి మోకాలు, రెండవ కాలి పాదము మోపిన గుర్తులు ఇప్పటికి ఉన్నాయి.

అదే స్థానంలో మరికొద్ది సేపటి తరువాత ఎక్కడినుండో ఒక సన్నని ధ్వని వినిపిస్తూ ఉంటే శ్రీరాముడు పరిశీలించి చూడగా అది ఒక పొద వంటి స్థానము నుండి వస్తోంది. ప్రక్కనే ఒక బండ. ఆ బండ మధ్యలో ఒక కుండం. ప్రక్కనే ఒక తాపసి. ఎదురుగా రాముని విగ్రహం. దాన్ని పూజిస్తూ తన నామాన్ని జపిస్తూ ఆ తాపసి కనిపించాడు. అతడిపేరు వీరముని. మేనకామేరువులకు వరప్రసాదమైన పుత్రుడతడు. అతడికి ముక్తిని ప్రసాదించి శ్రీరాముడు తన విగ్రహరూపానికి ప్రాణ కళలను కూర్చాడు. ఆ విధంగా వీరముని కలియు గారంభమయ్యే వరకు అక్కడే ఉండి ఆ తరువాత మోక్షము పొందాడు.

ఆ తరువాత వంగదేశానికి చెందిన చంద్రగుప్తుడు, సుమతి అనే దంపతుల బిడ్డలైన బాల చంద్రిక, బాలచంద్రుడనే సోదరీ సోదరులు తెలియక దంపతులై, పాపకర్మ వశమున నల్లగా దేహాలు మారిపోగా, అనేక తీర్థాలు క్షేత్రాలు తిరిగి చివరకు వీరాచల క్షేత్రాన శ్రీరాముని సేవించి, ఆయన అనుగ్రహముతో సృష్టింపబడిన రెండు కుండములలో స్నానమాచరింపగా వారికి పాపపరిహారమై మళ్లీ మామూలు రూపాలు పొందారట. ఆ విధంగా జీడివంటి నల్లని రూపాన్ని అంటే పాపాన్ని పోగొట్టుకున్నందున ఆనాటి వీరాచల క్షేత్రమిప్పుడు జీడికల్లుగా వ్యవహరింపబడుతోంది. పాప ప్రక్షాళన గావించే లేడిబండలోని ఆ గుండాలు ఇప్పటికీ ఉన్నాయి. అవి రాముని మహత్తుకు, అనుగ్రహానికి చిహ్నాలు. అయితే శ్రీరాముడు ఇష్టపడనందునేమో అక్కడ అర్భాటంగా దేవాలయాలు లేవు. శ్రీరాముడు

నిరాడంబరముగా మాత్రము కొలువు దీరి అక్కడ ఈనాటికీ పూజలందు కుంటున్నాడు.

## వరంగల్ జిల్లా : రామప్ప చెఱువు, లక్నారం చెఱువు :

ఈ రెండు చెరువులు ఈ జిల్లాలో ప్రసిద్ధమైన చెరువులు. మరొకటి పాకాల చెఱువు. లక్నారం చెఱువు అసలు పేరు లక్ష్మణుని చెఱువు. ఇది కాలగతిలో లక్నారం చెఱువు అయింది. రామప్ప చెఱువు రాముని పేరను, లక్నారం చెఱువు లక్ష్మణుని పేరను నిర్మితమైనట్లు చెప్పబడుతున్నాయి. అసలిలా రామలక్ష్మణుల పేర్లతో ఏర్పడినాయంటే రామలక్ష్మణులే వాటిని వారి అవసరానికి ఏర్పరచారేమోనని పిస్తుంది. ఇలావారు అస్త్రప్రయోగం చేసి అవసరానికి జలవనరును సృష్టించుకోవటం అలవాటే. పశ్చిమ గోదావరి ఖమ్మం జిల్లాలోని రామిలేరు, తమ్మిలేరు వంటి వానిని సృష్టించుకొన్న సన్నివేశములను ఇంతకుముందే ఆయా సందర్భాలలో మనం చూశాము. గణపతి దేవుని కాలంలో 1213లో రామప్ప చెఱువు నిర్మించబడిందని అభిప్రాయముంది. దానికి ఒక శాసనం ఆధారంగా చెప్పబడుతోంది. బహుశా గణపతి దేవుడు దానిని వ్యవసాయానికి అనుకూలంగా చెఱువు యొక్క రూపురేఖలుదిద్దాడేమో. ములుగుకు 20 కిమీ దూరంలో లక్నారం చెఱువు ఉంది. లక్ష్మణ శబ్దానికి 'లక్న' శబ్దం వికృతి రూపము. లక్ష్మణ శబ్దము 'లక్న'గా మారటం ఇక్కడొక్క చోటే జరగలేదు. అయోధ్యకు 130 కి.మీల దూరంలో ఉన్న లక్నో పట్టణం కూడ లక్ష్మణుని పేరు మీద ఈ విధంగా లక్నోగా రూపాంతరం చెంది ఏర్పడినట్టిదే.

## పోతన భాగవతము :

శ్రీరామ అయనానికి సంబంధించి కాకపోయినా, ఆంధ్రులు మరచిపోలేని, మరచిపోరాని ఒక ముఖ్య విషయం ఈ జిల్లాతో ముడిపడి ఉంది - పరమ భాగవతోత్తముడైన పోతనామాత్యునికి భాగవతము వ్రాయటానికి స్ఫూర్తి కలిగించిన వాడు శ్రీరాముడే!

కం. *పలికెడిది భాగవతమట!*
*పలికించెడివాడు రామభద్రుండట! తా*
*బలికిన భవహరమగునట!*
*పలికెద! వేఱొండు గాథ పలుకగనేలా!*

అని పోతన చెప్పుకున్నాడంటే ఆయన మనస్సుపై శ్రీరామచంద్రుడెంతటి గట్టి

ముద్ర వేశాడో మనకర్థమవుతుంది. అంతేకాదు! శ్రీరామచంద్రుడు తెలుగులో కవిత్వం కూడ చెప్పాడు. పోతన భాగవతము వ్రాస్తున్నాడు!

గజేంద్ర మోక్ష ఘట్టం:

"అల వైకుంఠపురంబులో, నగరిలో నామూల సౌధంబుదా

పల...."

పద్యమెందుకనో ముందుకు సాగలేదట! పోతనగారు గంటాన్ని ప్రక్కనపెట్టి దైవదర్శనానికి వెళ్లాడు. మళ్లీ వచ్చి చూస్తే పద్యము పూర్తిచేయబడి ఉంది. ఇంట్లో వారిని అడిగితే "నీవే వచ్చి కొంచెం సేపు వ్రాసి మళ్లీ బయటకు వెళ్లావు కదా" అని వారన్నారు. పోతన నిశ్చేష్టుడైనాడు. తనకు ఊహ సాగనిచోట శ్రీరాముడే వచ్చి ఆ పద్యాన్ని పూరించి వెళ్లాడని ఆయన పరమాశ్చర్యంతో గుర్తించి, భక్తి పారవశ్యంతో ఆయనకు చేతులెత్తి నమస్కరించాడు.

శ్రీమద్రామయణ కల్పవృక్ష రచనలో కూడ శ్రీరాముడు తనకూ సహాయపడ్డాడని శ్రీ విశ్వనాథ వారు కూడ చెప్పారు. అయితే శ్రీరాముడే వచ్చి వ్రాసి వెళ్లాడని కాదు!

## రంగారెడ్డి జిల్లా : కీసరగుట్ట :

జంట నగరాలకు ఈశాన్యంగా సుమారు 30 కి.మీల దూరంలో మండల కేంద్రమైన కీసరకు సుమారు 5 కి.మీల దూరంలో కీసరగుట్ట ఉంది. ఇది శ్రీరాముడు అరణ్యవాసంలోనే దర్శించి ఉండవచ్చు. అలా అనుకొనటానికి అక్కడి సీత గుహ, సీతాదేవి పూజలందుకున్న మహిషాసు రమర్దని అమ్మ వారుండటం కారణం. కాని ఆయన తన పట్టాభిషేకానంతరం మరొకసారి తప్పక ఆంధ్రదేశానికి విచ్చేశాడనటానికి ఆయన అనేక ప్రదేశాలలో లింగ ప్రతిష్ఠలు చేయటమే సాక్ష్యము. సీతను రావణుడు ఎత్తుకొని పోయేనాటికి రామునికి ఆంజనేయునితో పరిచయమేర్పడలేదు. కాని కీసరగుట్టకు ఆంజనేయు నితో వీడని సంబంధమున్నది. తీర్థయాత్రా పుణ్యక్షేత్ర దర్శనాదులకు శ్రీరాముడీ ప్రదేశానికి వచ్చినప్పుడు అక్కడున్న మునులు శ్రీరామునికి బ్రహ్మహత్యా పాపపరిహారార్థము శివలింగ ప్రతిష్ఠ చేయుమని చెప్పారు. శ్రీరాముడు వారి సూచనపై ఆంజనేయుణ్ణి శివలింగం తెమ్మని పంపాడు. అతడు సకాలంలో శివలింగాన్ని తీసికొని రాలేకపోయాడు. శ్రీరాముడు ఆవేదన చెంది పరమేశ్వరుణ్ణి ప్రార్థింపగా, పరమేశ్వరుడు లింగ రూపంలో ప్రత్యక్షమైనాడట! ఆ లింగాన్ని శ్రీరాముడు ముహూర్తకాలానికి ప్రతిష్ఠించాడు. ఆలస్యంగా వచ్చిన ఆంజనేయుడు

ఒక్క లింగాన్ని కాక, 101 లింగాల్ని తెచ్చాడు. కాని అప్పటికే శ్రీరాముడు ప్రతిష్ఠా కార్యక్రమం నిర్వర్తించి ఉండటంతో, ఆ లింగాలన్నీ ప్రతిష్ఠింపబడలేదే అని ఆంజనేయుడు బాధ పడ్డాడు. ఆ విసుగులో ఆంజనేయుడు వాటినన్నింటిని తోకతో చుట్టి విసరి పారేశాడట! అవి అక్కడే కాకుండా దూరంగా కూడ చాల చోట్ల పడ్డాయి.

ఇక్కడ శ్రీరాముడు ప్రతిష్ఠించిన స్వామి శ్రీరామలింగేశ్వరస్వామి. స్వామి పశ్చామాభిముఖుడై ఉంటాడు. ఇంకా ఇక్కడ భవానీదేవి, శివదుర్గ, ఉభయ దేవేరులతో సుబ్రహ్మణ్యేశ్వరుడు, కాలభైరవుడు కొలువుదీరి ఉన్నారు. ఆంజనేయునిచే కొనిరాబడి, ప్రతిష్ఠింపబడక ఉండిపోయిన కొన్ని శివలింగాలు ఇప్పటికీ కూడ అక్కడ పడి ఉన్నాయి.

ఒకప్పుడిది విష్ణుకుండినుల ఏలుబడిలోనున్న ప్రముఖ స్థానంగా ఇక్కడ బయలుపడిన చారిత్రక ఆధారాలు తెలుపుతున్నవి. విష్ణుకుండినులు మొదట బౌద్ధులని, తరువాత వైష్ణవమతానుయాయులై చివరకు శైవులైనారట. వారీ క్షేత్రానికి ఎంతో సేవచేసినట్లు కనిపిస్తుంది. ఆ తరువాత అక్కన్న మాదన్నలీ క్షేత్రానికి తమ సేవలందించి క్షేత్రాన్ని తీర్చిదిద్దినట్లు తెలుస్తుంది. ఏదిఏమైనా ఇది రామలింగేశ్వరుడున్న ప్రసిద్ధ శైవక్షేత్రం. ప్రతిష్ఠించినది మాత్రము విష్ణు రూపుడైన శ్రీరాముడు.

**జుంటుమిల్లి :**

జుంటుమిల్లిలోని దేవాలయములో ప్రతిష్ఠితమైయున్న శ్రీరామస్వామి మూర్తి యొక్క పీఠభాగము నుండి నీరు నిరంతరం పెల్లుబుకుతూ ఉంటుంది. ఈ రామాలయంలో శ్రీరామునికి ఆదిశేషుడు పడగపడుతూ ఉండటం మరొక అరుదైన విశేషము ఈ ప్రాంతాన్ని శ్రీరాముడు దర్శించినది వనవాసకాలం లోనని, స్నానాదులకు జలవనరులేకపోవడంతో శ్రీరాముడిక్కడ జలవనరొకటి కల్పించుకున్నాడని చెప్పబడుతోంది. గుడికి దగ్గరలోని కొండపైన శ్రీరాముడు అస్త్ర ప్రయోగంతో సృష్టించినట్లుగా చెప్పబడుతున్న దొనలు రెండున్నాయి. 12 అడుగుల పొడవు 2 అడుగుల వెడల్పు గల దొన ఒకటి. మరొక దొన సీతమ్మ పేరుతోనే సీతమ్మదొనగా పిలువబడుతోంది. ఈ రెంటికి గూడగాడి ఏర్పడిఉన్నది గనుక గాడి దొనలు అనే పేరుతో పిలువబడుతున్నవి. వీనిలో ఎల్లప్పుడూ నీరుంటుంది.

## హైదరాబదు జిల్లా : తాడుబందు :

యాగాలుడనే రాక్షసుడు శివుని వలన పొందిన వరముతో తన ప్రాణానికేమీ ముప్పు లేకపోవటంతో విజృంభించి అందరినీ హింస పెట్టటం మొదలు పెట్టాడు. దానికి శ్రీ మహావిష్ణువు పరమేశ్వరుని ఆశ్రయింపగా పరమేశ్వరుడు – యాగాలుడు తన భక్తుడు కావటంతో తానేమీ చేయలేనన్నాడు. శ్రీ మహావిష్ణువు తానే స్వయంగా యాగాలుణ్ణి అంతమొందిస్తానంటే, ఆ పని జరగదని పరమేశ్వరుడు చెప్పాడు. శ్రీ మహావిష్ణువు అతణ్ణి అంతమొందిస్తానని, అలా చేయలేకపోతే శివునికి దాసుణ్ణవుతానని ప్రతిజ్ఞ చేస్తే, అలా చేయగలిగితే శ్రీమహావిష్ణువుకు తాను దాసుణ్ణవుతానని శివుడు ఎదురు ప్రతిజ్ఞ చేశాడు. ఎలాగైతేనేం శ్రీ మహావిష్ణువు యాగాలుణ్ణి చంపగా, శివుడు తన మాట ప్రకారం శ్రీ మహావిష్ణువుకు దాసుడు కావటానికి సిద్ధపడ్డాడు. కాని శ్రీ మహా విష్ణువు త్రిమూర్తులలో ఒకడైన ఈశ్వరుడు తనకు దాసుడు కావటానికి ఇష్టపడక, రామావతార మెత్తినప్పుడు ఆంజనేయునిగా జన్మించి ఆ మాట నెరవేర్చుకోమని చెప్పాడు.

ఇదిలా జరుగగా, ఒకసారి పార్వతీ పరమేశ్వరులు వేంకటాద్రికి వచ్చి ఒక వానరముల జంట రతిక్రీడను చూచి ఉత్ప్రేరితులై వారు కూడ వానర రూపం ధరించి క్రీడింపగా పార్వతీదేవి ఆ వానర వీర్యాన్ని భరింపలేక అగ్నిలో వేయగా, అగ్ని తాను భరింపలేక వాయువుకు అందింపగా, వాయువు దాన్ని సంతానం కోసం నిరాహారంగా తపమాచరిస్తున్న అంజనాదేవికి ప్రసాదంగా అందించాడు. అంజనాదేవి ఆ ప్రసాదాన్ని స్వీకరించింది. కేసరి భార్య అయిన అంజనాదేవి ఆ వీర్యాన్ని లోపలికి తీసుకున్న ఫలితంగా గర్భవతియై ఆ తర్వాత ఆంజనేయుణ్ణి కన్నది. ఆంజనేయుడు జన్మించింది అంజనాద్రిపైననే. తిరుపతి సప్తగిరులలో అంజనాద్రి ఒకటికాగా, పంపాసరోవరం దగ్గర విరూ పాక్షస్వామి కొలువై ఉన్నచోట బళ్లారి జిల్లా హోస్పెట దగ్గరలో ఒక అంజనాద్రి ఉన్నది. అయితే శ్రీరాముడు ఆంజనేయుని సేవలకు బహుమానంగా తన ఏలుబడిలోని ఒక ప్రదేశాన్ని ఆంజనేయుని కొలువుదీరి ఉండేటందుకు బహూ కరించాడు.

ఈ కథ ఇలా ఉండగా శ్రీరాముడు అరణ్యవాసానికి బయలుదేరినప్పుడు భరతుడు రాముని వెళ్లవద్దని చిత్రకూటానికి వచ్చి బ్రతిమాలాడు. ఆయన అభిప్రాయాన్ని మరింత గట్టిగా చెప్పి జాబాలి శ్రీరాముణ్ణి వెనక్కు రమ్మని వత్తడి చేశాడు. శ్రీరాముడందుకు కోపించి జాబాలిని అఘపాశబంధంతో బాధపడమని శపించాడు. జాబాలి ఆ అఘపాశబంధాన్నుండి బయటపడటానికి ప్రయత్నిస్తూ శ్రీరాముడు

రామేశ్వరంలో రామేశ్వరుణ్ణి ప్రతిష్ఠించినట్లుగానే శ్రీరాముడు ఆంజనేయునికి కానుకగా ఇచ్చిన హనుమత్పుర ప్రదేశంలో ఆంజనేయుణ్ణి ప్రతిష్ఠించి తపస్సు చేశాడు. ఆ సంగతి తెలిసిన శ్రీరాముడు జాబాలి మహర్షిని నీకు అఘపాశబంధ విముక్తి కలిగిందని చెబుతాడు. ఆ విముక్తి కలిగిన ప్రదేశము అఘపాశబంధాన్ని హరించింది గనుక ఆ హనుమంతుడు కొలువైన ప్రదేశము పాశబంధపురమని వ్యవహరింపబడి ఆ తరువాత పాశమంటే తాడు కనుక తాడుబంధపురమని, ఆ తరువాత 'తాడుబందు'గా వ్యవహారములో నిలిచిపోయింది. ఇది సికిందరాబాదుకు సమీపంలో బోయినపల్లి – సిఖ్ గ్రామం మధ్యలో ఉంది. జాబాలి మహర్షి తిరుపతి కొండపై అంజనాద్రిలో కూడ ఒక ఆంజనేయుణ్ణి ప్రతిష్ఠించాడు. ఆ విధంగా శ్రీరాముడు ఆంజనేయుణ్ణి, జాబాలిని గూడ అభిమానించి భక్తులకు అభిమానాన్ని చూపిన గుర్తుగా 'తాడుబందు' నిలచి ఉంది.

## మెదక్ జిల్లా : కల్పగూర్ :

కల్పవృక్షమంటే కోరిన కోరికలు తీర్చేవృక్షమని అర్థము. ఆ సంగతి తెలిసిందే! కల్పగూర్ వృక్షము కాదుగాని కల్పవృక్షము వలె – కోరిన కోర్కెలు నెరవేర్చే ఊరు. 1956వ సంవత్సారము వరకు తాలూకా కేంద్రంగా ఉన్న కల్పగూరిప్పుడు సంగారెడ్డిని తాలుకా చేయటంతో జరిగిన మార్పు వలన సంగారెడ్డి తాలుకా అదే మండలంలోని గ్రామమైంది. ఈ గ్రామం హైదరాబాదు నగరానికి 64 కి.మీల దూరంలో ఉన్నది.

ఇక్కడున్న కాశీవిశ్వేశ్వరాలయము చాల ప్రాచీనమైంది. ఈ దేవాలయములోని గర్భాలయము మూడుగా విభజింపబడి కాశీ విశ్వేశ్వరుడు అనంత పద్మనాభస్వామి, వేణుగోపాల స్వాములు కొలువుదీరి ఉండే విధంగా ఏర్పాటు చేయబడి ఒకే అచ్ఛాదన క్రింద ఉన్నవి. ముగ్గురు స్వాములకు సమాన ప్రతిపత్తి కలిగించే విధంగా చేయబడిన ఆ ఏర్పాటు వలన ఇది త్రికూటాలయమైంది. దక్షిణ దిశలోని గర్భ గృహములో చాల ఎత్తైన పాన వట్టము మీద శివుడు కొలువుదీరి ఉండగా ఉత్తరాన ఉన్న గర్భాలయములో వేణుగోపాలుడు కొలువుదీరి ఉన్నాడు. అరుణోదయ వేళకాంతి కిరణాలు అనంత పద్మనాభునిపై ప్రసరిస్తూ కాంతులు వెదజల్లుతాయి. ఆ ఉదయ సంధ్యా కిరణాలు ప్రసరించే వేళలో ఈ స్వాముల దర్శనం చేస్తే కోరిన కోరికలు (కల్పవృక్షము తీర్చినట్లు) తీరుతాయని ప్రగాఢ విశ్వాసము. శ్రీ రామచంద్రు డిక్కడ తన కోటి శివలింగ ప్రతిష్ఠా కార్యక్రమంలో భాగంగా ఇక్కడ శివుణ్ణి ప్రతిష్ఠించి సేవించుకొన్నాడని స్థానిక కథనం! అంటే పాపపరి హారార్థము చేసిన ప్రతిష్ఠలలో ఒకటి అన్నమాట!

## కరీంనగర్ జిల్లా :

గోదావరి నదికి ఒకవైపు ఆదిలాబాదు జిల్లా ఉండగా నదికి రెండవ వైపు నిజామాబాదు కరీంనగర్ జిల్లాలుంటాయి. వీని మధ్య గోదావరి సరిహద్దుగా నిలుస్తుంది. కరీంనగర్ దండకారణ్య ప్రాంతమే. కరీంనగర్ జిల్లాలో శ్రీరాముడు పర్యటించిన ప్రదేశాలను చూద్దాం.

## ఇల్లింద కుంట :

శ్రీరాముడు అరణ్యవాసం చేస్తున్న కాలంలో దశరథుని ఆబ్దీకము వచ్చింది. తండ్రికి తద్దినము పెట్టటానికి తగిన ద్రవ్యాలు లభించలేదు. ఇల్లిందకుంటగా పిలువబడుతున్న ప్రదేశంలో ఇల్లిందకాయల పప్పు తీసి దానితో తయారుచేసిన పదార్థాన్ని పిండ ప్రదానం చేయగా పితృదేవతయైన దశరథుడు ఆ శ్రాద్ధపిండాన్ని స్వయంగా చేతితో అందుకొన్నట్లు జనశ్రుతి. ఇక్కడ ఈనాటికీ ఒక ప్రసిద్ధమైన దేవాలయముంది. ఇది ఢిల్లీ బలార్షా మార్గంలో జమ్మికుంటకు 4 కి.మీల దూరంలో హుజూరాబాద్ తాలూకాలో ఉంది.

## ధర్మపురి :

కరీంనగర్ పట్టణానికి 65 కి.మీల దూరంలో జగిత్యాలకు 30 కి.మీల దూరంలో గోదావరి దగ్గరున్న ఈ క్షేత్రం వరాహావతారం కాలం నుండి ఉన్నది. ఆ తరువాత శ్రీరాముడీ క్షేత్రాన్ని దర్శించి శ్రీరామలింగేశ్వరుణ్ణి ప్రతిష్ఠించాడు. ధర్మవర్మ అనే మహారాజు తపస్సు చేసి నృసింహుని అనుగ్రహం పొంది ఆయన అనుమతితో నృసింహస్వామిని ప్రతిష్ఠించాడు. ధర్మపురిలో లక్ష్మీనృసింహ, యోగనృసింహ, శ్రీ వెంకటేశ్వర, ప్రసన్నాంజనేయస్వాములు నెలకొని ఉన్నారు. ఇంకా గౌతమేశ్వరుడు. దత్తాత్రేయుడు, మహాలక్ష్మి మొదలైన దైవరూపాలు నెలకొని ఉన్న ప్రదేశం. సామాన్యంగా ఒక క్షేత్రం దగ్గర ఒకటో రెండో తీర్థాలుంటాయి. వరాహస్వామి స్నానమాచరించిన శ్వేతవరా హతీర్థము, గోదావరి శాక, బ్రహ్మపుష్కరిణి, పుష్పసరోవరము, బ్రహ్మగుండము, సత్యవతీ గుండము, చక్రగుండము, యమగుండములనే సప్తతీర్థాలున్నాయి. యమధర్మరాజు కూడ ఈ క్షేత్రాన్ని దర్శించి తీర్థస్నానమాచరించి మనశ్శాంతి పొందినట్లు చెప్పబడుతోంది. ధర్మపురి రామాయణమనే పేరుతో ఈ క్షేత్రమా హత్మ్యముంది. శ్రీరాముడు ప్రతిష్ఠించిన సైకతలింగంపై చేతి వ్రేలిముద్రలు కనిపిస్తాయని చెబుతారు.

**వేములవాడ :**

ఇది కరీంనగర్‌కు 30 కి.మీల దూరంలో ఉంది. వేములవాడలో వేంచేసియున్న శ్రీరాజరాజేశ్వర స్వామి త్రేతాయుగం నాటికే ఉన్నట్లు చెప్పబడు తోంది. పౌరాణిక గాధలు చాల వానితో ముడిపడియున్న ఈ క్షేత్రాన్ని సీతా రాములు సందర్శించారు. ఇక్కడున్న అనేక దేవాలయాలతో బాటు సీతారాముల దేవాలయము కూడ ఉంది. రాజరాజేశ్వరస్వామికి శివరాత్రి మహోత్సవము తోబాటు సీతారాములకు శ్రీరామనవమికి కల్యాణం కూడ జరుగుతుంది. శ్రీరాముడు దర్శించిన లేక ప్రతిష్ఠ జరిపిన చాల క్షేత్రాలలో శివరాత్రితోబాటు ప్రతి సంవత్సరము శ్రీరామనవమి జరగటం ఈ విషయాన్ని బలపరుస్తుంది. విజయనగరం జిల్లాలోని రామతీర్థం వలె ఇక్కడ కూడ ఆ తరువాత బౌద్ధ సంస్కృతి నెలకొని కొంతకాలం బౌద్ధ క్షేత్రంగా విరాజిల్లినట్లు కనబడుతుంది. ఏమైనా ఈనాడది రాజరాజేశ్వర శైవ క్షేత్రమే. ఈ క్షేత్రంలో ఇంకా భీమేశ్వర, నగరేశ్వర దేవాలయాలు కూడ ఉన్నవి.

**కొండగట్టు ఆంజనేయస్వామి :**

ఈ స్థానానికి ఆంజనేయస్వామితో సంబంధముంది. ఇంద్రజిత్తు చేతిలో దెబ్బతిన్న లక్ష్మణుడు మూర్ఛపోయి ప్రాణాపాయస్థితి కలిగినప్పుడు, ఆంజనే యుడు సంజీవనిని తీసికొని రావటానికి వెళ్లి ఆ ఔషధిని గుర్తింపలేక కొండను పెకలించుకొని వస్తున్నప్పుడు ఆ కొండ చరియ ఒకటి విరిగి పడిందని చెప్తారు. ఆ కొండ చరియ మీద ఇప్పటికి శ్రీ ఆంజనేయుని దేవాయలము మనము చూస్తాము. ఇక్కడ ఆ కథ వింటాము.

**శ్రీ కాళేశ్వరము :**

మంథెనకు తూర్పుగా 30 కి.మీల దూరంలో గోదావరి నదికి దక్షిణతీరంలో కాళేశ్వరముంది. ఇది మహారాష్ట్ర మధ్యప్రదేశ్ ఆంధ్రదేశాల కూడలి ప్రదేశము. త్రిలింగదేశమని తెలుంగుదేశానికి ఆ పేరు రావటానికి కారణమైన మూడు లింగాలలో ఒకటైన కాళేశ్వరలింగము కాళేశ్వరుడనే పేర ఇక్కడ కొలువుదీరి ఉన్నాడు. శ్రీరాముడీ కాళేశ్వర క్షేత్రాన్ని దర్శించు కున్నాడు. ఈ క్షేత్రంలో ఒక్క కాళేశ్వరుడు మాత్రమే కాక ఒకేపానవట్టముపైన ముక్తేశ్వర స్వామి కూడ కొలువుదీరి ఉన్నాడు. ముందు కాళేశ్వరుణ్ణి ఆ తరువాత ముక్తేశ్వరుణ్ణి పూజించటం ఇక్కడి సంప్రదాయము. ముక్తేశ్వరునికి ఎంత నీరు అభిషేకించినా అది లింగానికున్న రెండు రంధ్రాల ద్వారా ఎక్కడికో వెళ్లిపోతుంది. అనీరు గోదావరిలోకి చేరుతుందని చెబుతారు. ప్రాణహిత

అనే ఉపనది ఇక్కడే గోదావరిలో కలుస్తుంది. ఇక్కడ ముక్తేశ్వరాలయంలో సూర్యుడు, కూడ కొలువుదీరి ఉన్నాడు. ఇంకా ఇక్కడ చంద్రశేఖర, సంగమేశ్వర, సోమేశ్వర, వెంకటేశ్వర, బిందుమాధవ, సరస్వతీదేవి ఆలయాలు కూడ ఉన్న పవిత్ర క్షేత్రం. శ్రీరాముడు బహుశా పాపపరిహారార్థము పుణ్యక్షేత్ర దర్శనం కోసం దక్షిణాదికి వచ్చినప్పుడు, ఇటుగా పయనించి వెళ్లి ఉండవచ్చు. శ్రీశైల ప్రదక్షిణ విషయములో కూడ ఉమామహేశ్వరము నుండి ప్రారంభిం చటం సంప్రదాయము గనుక మధ్యప్రదేశ్ నుండి కాళేశ్వరము వచ్చి అక్కడ నుండి ఉమామహేశ్వరము వెళ్లి తన పేర ప్రచలితమవుతున్న రామప్రదక్షిణాన్ని ప్రారంభించి శ్రీశైలానికి వెళ్లి ఉండవచ్చు.

## రామగిరి దుర్గము :

కరీంనగర్ నుండి 50 కిమీల దూరాన ఉన్న కమాన్‌పూర్ మండలంలో ఉన్న బేగంపేట గ్రామ శివారులో ఒక పర్వతం ఉంది. దాని మీద అతిప్రాచీనమైన కోట ఒకటి ఉంది. ఒక చిన్న గుట్ట మీద ఖిల్లా కూడ ఉన్నది! దానికే రామగిరి దుర్గమని, రామగిరి ఖిల్లా అని, రత్నగిరి అనే పేర్లున్నాయి. ఇక్కడ సీతారాముల ఆలయం, సీతపాదాలు, సీతాదేవి ఉపయోగించిన పసుపు కుంకుమల పాత్రల చిహ్నాలు దర్శనీయమై ఉన్నాయి. రామగిరికి దగ్గరగా 2 కిమీల దూరంలో గల 'బహుగుళ్లు' అనే పేరుగల కొండపైన గూడ శివలింగాలు కనిపిస్తాయి. ఇంకా మరికొన్ని చారిత్రక కట్టడాలు, కోట బురుజులు, పాత ఫిరంగి కూడ ఉన్నవి. క్రీ॥పూ॥ 250 సంవత్సరాల కాలం నుండి 15 శతాబ్ది మధ్య కాలం వరకు మౌర్యులు, శాతవాహనులు, చాళుక్యులు, కాకతీయులు, బహుమనీ సుల్తానులు, రెడ్డి రాజులు పరిపాలింపగా మళ్లీ వారి నుండి మహమ్మదీయుల పాలకుల హస్తగతమై బహమనీ సుల్తానులు, మొగలులు, ఆ తరువాత గోల్కొండ నవాబుల పరిపాలనలో ఉన్నదని చారిత్రకుల వివరణ. కోట లోపలి నిర్మాణాల శిథిలాలను చూస్తుంటే పరమాశ్చర్యకరంగా వాని పూర్వ వైభవము మనోనేత్రాలకు దర్శన మిస్తుంది.

ఇక రామాయణ విషయానికి వస్తే శ్రీరాముడీగిరిపైన కొంతకాలమున్నట్లు స్థానిక కథనము. ఇంతకు ముందే మనం చెప్పుకున్నట్లుగా – వనవాస కాలంలో కాక మరొక సారివచ్చినప్పుడు ఈ గిరిప్రాంతాన్ని దర్శించి ఆయన సీతాసమేతంగా ఇక్కడ కొన్నాళ్లున్నాడేమో! సీతారాములు కొన్నాళ్లున్నారనుకునే ప్రతిస్థలంలోనూ తప్పకుండా ఒక జలవనరుంటుంది. కొండపైనున్న ఒక బావిలో సంవత్సరమంతా పుష్కలంగా నీరుంటుంది. అలాగే ఒక జలధార నిరంతరం ప్రవహిస్తూ ఉంటుంది. అక్కడ నుండి ఒక బిలము ద్వారా ఆ జలము ఎక్కడికో సాగిపోతుంది. ఆ జలధార

క్రింద సీతమ్మ స్నానమాచరిం చేదట. వారి రాకకు గుర్తుగా కొండ మీద నిలిపి ఉంచిన సీతారాముల, ఆంజనేయుని విగ్రహాలున్నాయి. ప్రతి శ్రావణమాసంలోను నాలుగు సోమ, శుక్ర వారాల్లోను వివిధ ప్రాంతాల ప్రజలిక్కడకు వచ్చి ఈనాటికీ ఉత్సవాలు చేసుకుంటారు. అయితే రత్నాపూర్ నుండి రామగిరిపైకి 6 కిమీల దూరం అక్కడకు నడచి వెళ్లాలి. ఆ శ్రమను ఓర్చుకోగలిగితేనే ఆ పైనున్న సీతారామాంజనేయుల పాదదర్శనం.

### నిజామాబాద్ జిల్లా : భింగల్‌మండలం నింబాపురం :

నింబాపురం ఎన్నో యుగాలుగా నిలచిఉన్న లక్ష్మీనృసింహ క్షేత్రం! బ్రహ్మాదులెందరో ఇక్కడ తపమాచరించారని శివపార్వతులు, ప్రహ్లాదుడు, యముడు, శ్రీకృష్ణుడు ధర్మరాజాదులతోడి అనుబంధము గల ఈ క్షేత్రాన్ని శ్రీరాముడు దర్శించాడని, ఋషులను సమర్చించాడని చెప్పబడుతోంది. శ్రీ మహావిష్ణువు ప్రసాదించిన వర ప్రభావం చేత విరజా అనే పుణ్యాంగన విరజా నదియైందని చెప్పబడుతోంది.

మరొక ముఖ్యమైన విషయమేమంటే ఆంజనేయుడు శ్రీరాముని అవతార పరిసమాప్తి సమయంలో బ్రహ్మ పదవిని కోరినప్పుడు శ్రీరాముడు ఆంజనే యుని ఈ నింబాపురములో తపమాచరిస్తే సిద్ధికలుగుతుందని చెప్పాడని అందుచేత ఆంజనేయుడక్కడ తపమాచరించాడని చెప్పబడుతోంది. అయితే ఇలాంటి కథనము మంగళగిరి క్షేత్రముతో కూడ కొంతవరకు ముడిపడి ఉంది. శ్రీరాముడు ఆంజనేయుణ్ణి ఈ నింబాపురంలో తపమాచరించటం వరకే చెప్పాడు కాని, మంగళగిరిలో అలా బ్రహ్మ పదవి లభించే వరకు నిలచి ఉండవలసిందిగా చెప్పినట్లు మంగళగిరి క్షేత్ర చరిత్ర కథనము.

### మోర్తాడ్ మండలం : తడపాకల :

మోర్తాడ్ మండలం తడపాకల శివార్లలో గోదావరి ఒడ్డునున్న పుణ్యక్షేత్రంలో సీతాదేవిచే పూజలందుకున్నట్లు చెప్పబడే శివలింగాలు కనిపిస్తాయి. సీతారాములు పర్యటించిన గుర్తులు కనిపిస్తాయి. అక్కడున్న ఒక శిథల మందిరము పురాతన శివాలయముగా భావిస్తారు.

### శ్రీరామపాదసాగర్ లేక శ్రీరామసాగర్ :

పోచంపాడు వద్దనున్న గోదావరి శ్రీరామపాదస్పర్శచే శ్రీరామపాద సాగర్ అని శ్రీరామసాగర్ అని పిలువబడుతోంది. అక్కడ ఆధునిక కాలంలో ఏర్పడిన

ప్రాజెక్టుతో ఆ పేరు మరింత ప్రసిద్ధమైంది. ఆ విధంగా గోదావరి శ్రీరామపాద స్పర్శతగిలిన స్థానంలో ఒక కొత్తరూపు సంతరించుకోవటమే కాదు శ్రీరామనామాన్ని తన పేరుగా మార్చుకుంది.

## విశాఖ జిల్లా : బొర్రాగుహలు సీతమ్మ స్నానఘట్టము :

ఇటీవలి కాలంలో ప్రభుత్వము అనేక పర్యాటక కేంద్రాలను తీర్చి దిద్దుతోంది. విశాఖ జిల్లాలో పర్యాటకులు దర్శించే ప్రాచీన ప్రదేశాలలో బొర్రా గుహలు ఒకటి. ఇది ఒక ప్రముఖ పర్యాటక కేంద్రం. అయితే ఈ ప్రదేశములో సీతమ్మ వారి స్నానఘట్టము పర్యాటకులను ఆకర్షిస్తూ ఉంటుంది. సీతారాములీ ప్రదేశాన్ని దర్శించినప్పుడు సీతమ్మ ఈ గుహలలోనున్న జలవనరులో స్నానము చేయటము చేత ఆమె పేరుమీద ఆ స్నానఘట్టమలా నిలచిపోయి ఉంది.

## సీతమ్మ ధార :

విశాఖ పట్టణము నగరములో ఇదొక ప్రసిద్ధి చెందిన పేటకు పేరుగా ఈనాడు కనిపిస్తున్నా కొండమీద నుండి జాలువారిన జల ప్రవాహములో సీతమ్మ అక్కడున్న కాలములో స్నానం చేస్తూ ఉండిన కారణంచేత అక్కడి కొండ పాదములోని ఆనాటి జలవనరుకు సీతమ్మ పేరుమీద సీతమ్మ ధార అనే పేరు ఏర్పడిందని, ఆ తరువాత ఆ పరిసరాలలో ఏర్పడిన జనావాసానికి కూడ అదే పేరు స్థిరపడి సీతమ్మధార అనేది పేట పేరై నిలిచిపోయిందని తెలుస్తుంది.

## హనుమంతవాංక :

విశాఖపట్టణానికి కొంచెం దూరంలో ఒక జలప్రవాహ మార్గముంది. ఇది హనుమంతుని పేరు మీద హనుమంతవాංక అని పిలువబడుతోంది. వాංక అంటే వాగు లేక ఏఱు అని అర్థము. హనుమంతుని పేరు మీద జలప్రవాహానికి పేరు ఎందుకు వచ్చిందో స్పష్టంగా తెలియటం లేదు గాని, బహుశా సీతమ్మధార వంటి జలప్రవాహము నుండి ప్రవహించిన నీరు నిలచిపోతుంటే హనుమంతుడు అది నిలచిపోకుండా ఒక మార్గము ఏర్పరచటంతో ఆయన పేరు మీద అది హనుమంతవాංకగా నిలిచిపోయిఉండ వచ్చుననిపిస్తుంది.

## విజయనగరం జిల్లా :
## రామతీర్థాల క్షేత్రం :

విజయనగరం జిల్లా కేంద్రమైన విజయనగర పట్టణానికి ఈ శాన్యంగా 12 కి.మీల దూరాన చంపావతీ నదీ సమీపంలో, భాస్కర పుష్కరిణికి నీలా చలమునకు

మధ్య సీతా లక్ష్మణ సమేతులైన శ్రీరామచంద్రుల దేవాలయము నెలకొని ఉంది. ఈ క్షేత్రములో హిందూ, జైన, బౌద్ధ మతాల సమష్టి చరిత్ర, సంస్కృతి నెలకొని ఉంది. బోడికొండ అనే వ్యవహార నామముగల నీలాచలము పర్వతముపై సీతారాములు, ఆ తరువాత ద్వాపరయుగంలో పాండవులు సంచ రించిన గుర్తులున్నవి.

దశావతారములలో పరిపూర్ణావతారమైన రామావతార పర్యటన విశేషాలతో బాటు పాండవుల అరణ్యవాసములోని కొంతకాలపు పర్యటన విశేషములీ తీర్థముతో ముడిపడి ఉన్నవి.

పాండవులు అరణ్యవాసంలో తమకు తోడు రమ్మని భగవానుడైన శ్రీకృష్ణుని కోరగా, శ్రీకృష్ణుడు తాను సీతాలక్ష్మణ సమేతుడై రామావతారమున దండకారణ్య ప్రాంతములో సంచరించినట్లు చెప్పి, పాండవులను కూడ అక్కడే సంచరింప వలసిందని చెబుతూ, వనవాస దీక్షా మూర్తులను తన లీలచే సృష్టించి పాండవులకిచ్చి వాటిని శ్రద్ధతో పూజించితే వారికి రక్షణ చేకూరుతుందని చెప్పి పంపగా వారు రామతీర్థాల ప్రాంతంలో వాటిని నెలకొల్పి, ప్రతిష్ఠించి పూజించి, అజ్ఞాతవాసానికి వెళ్లేటప్పుడు వేదగర్భుడను వైఖానసునకు, ఆ దేవాలయాన్ని అప్పగించి వెళ్లారని చెప్పబడుతోంది. ఆ విధముగా వేదగర్భుని వంశము వారిచే క్రీ॥పూ॥ 6వ శతాబ్దమువరకు అనగా జైన బౌద్ధ మతాదుల విజృంభణ వరకు ఉండి, ఆ తరువాత భూగర్భములో దాచబడి మఱుగున పడిపోయి, మరల చాల కాలము తరువాత, 17వ శతాబ్దము చివర పూసపాటి సీతారామచంద్ర మహారాజుచే పాండవ నిర్మితమై శిథిలమైన దేవాలయ స్థానమున నూతన దేవాలయము నిర్మింపబడి అర్చనాదికము లేర్పాటు చేయబడినవి. సీతారాముల విగ్రహములు రాజుగారికి నీటియందు లభించుట వలన ఆ తీర్థం మరింత ప్రాధాన్యము సంతరించుకుంది. ఆ విధంగా ఈ క్షేత్ర రాజానికి రామతీర్థమనే పేరు కలిగిందని చెప్పబడుతోంది. బౌద్ధ సంస్కృతిలో క్షేత్రాలకు ఆరామమనే పేరు వాడుకలో ఉండటం, ఆంధ్రదేశంలో ఒకనాడు ఆరామాలనే పేరుతో పంచ బౌద్ధ క్షేత్రాలుండటం మనకు తెలిసినదే. ఈ క్షేత్రము కూడ బహుశా అదే విధంగా అరామతీర్థమని కూడ పిలువ బడటానికి ఆ బౌద్ధ సంస్క ృతే కారణమైయుండవచ్చు!

**శ్రీకాకుళం జిల్లా : టెక్కలి మండలం రావివలస :**

శ్రీరాముడు రావణ వధానంతరము లంక నుండి తిరుగు ప్రయాణంలో రావివలస ప్రాంతంలోని కొండలపై సేద దీరి అయోధ్యకు బయలుదేరాడట. అయితే

తమతో కలసి పయనిస్తున్న విభీషణుడు తనతో రాకపోవటం ఆయన గమనింపలేదట. విభీషణుడు అక్కడే మరణించాడట. ఆ సంగతి గమనించిన హనుమంతుడు విభీషణుని మృతకళేబరాన్ని ఒక పెట్టెలో భద్రపరచి తాను కూడ అయోధ్యకు వెళ్లి శ్రీరామునకీ విషయం తెలియజేశాడట. వెంటనే సీతారాములిద్దరూ బయలుదేరి వచ్చి విభీషణుని మృతకళేబరాన్ని చూచే ప్రయత్నంలో ఆ పెట్టెను బ్రద్దలు కొట్టబోతే ఎంతకూ అది పగలలేదు. చివరకు సీత కూడ తన చేతితో సహాయపడగా ఆ పెట్టె తెరచుకొని అందులో నుండి వెలుగులు ప్రసరింపసాగాయి. పరిశీలించి చూస్తే అందులే మృతకళేబరం స్థానంలో ఒక శివలింగం రూపుదిద్దుకొని ఉందట. అక్కడ జలవనరులేమీ లేకపోవ టంతో సీత తన పాదతాడనంతో జల సృష్టించిందని, ఆ జలంతో ఆ శివ లింగానికి అర్చనాదికాలు నిర్వర్తింపబడ్డాయని, ఆ విధంగా అక్కడే ఆ శివుడు నెలకొన్నాడని చెప్పబడుతోంది. ఆయనే మల్లికార్జునస్వామిగా పిలువబడు తున్నాడు. స్వామి లింగ రూపం రోజురోజుకు పెరుగుతూ ఉండటంతో ఆ మల్లికార్జునునికి దేవాలయ నిర్మాణం జరగలేదు. స్వామి ఎండలోనే ఉండి పోవలసి రావటంతో ఆయన పేరు ఎండల మల్లికార్జును డుగా స్థిరపడింది. పై సంఘటన జరిగిన తరువాతనే సీతారాములు అయోధ్యకు వెళ్లారని, ఆ తరువాతే పట్టాభిషేకం జరిగిందని చెప్పబడుతోంది. అయితే విభీషణుడు అలా మార్గమధ్యంలో మరణించటం రామాయణంలో లేదు.

**పెదకొంజరియా :**

ఒకప్పుడిది ఉద్యానవనమని పిలువబడేదట! శ్రీరాముడు తన వనవాస కాలంలో ఇక్కడ కొంతకాలమున్నాడని చెప్పబడుతోంది.

శ్రీరాముని యొక్క మహిమను చాటే ఆ రామాయణ కథ ఏనాడో విశ్వపరివ్యాప్తమైంది. శ్రీరాముడెందరో కవులకు, రచయితలకు ప్రేరణ కలిగించి ఆయా విషయాలను గురించిన వివరణ చేయించాడు. అయితే రామాయణ కథలో ఎంతో కొంత ఆంధ్రదేశంలో జరిగినప్పటికీ, ఆ కథకు ఆంధ్రదేశంలోని ఆయా ప్రదేశాలతోడి సంబంధము రామాయణములో స్పష్టంగాలేదు. అయితే కథలో ముడిపడి కొన్ని ప్రదేశాలు మాత్రం రేఖామాత్రంగా వర్ణింపబడి రామాయణ గ్రంథస్థమైనవి. అయితే స్థానిక చరిత్రలలో మాత్రము ఆయా ప్రదేశాలకు శ్రీరామునితోడి, ఆయన అయనము తోఁడి సంబంధము లక్షలాది ఏళ్లుగడచినా ఈనాటికి నిలచి ఉంది. వానిని సేకరించి ఒక క్రమంలో పాఠకులకు అందించే ప్రయత్నము ఈ గ్రంథ రచనలో జరిగింది. అయితే ఆంధ్ర దేశమంతటిలోనూ

ఈపైన నేను వివరించినవి మాత్రమే సీతారాముల పర్యటించినవని చెప్పటానికి వీలులేదు. త్రికరణ శుద్ధిగా నా ప్రయత్నాన్ని నేను చేశాను. శ్రీరాముడనుగ్రహించి నంతవరకు నాకు అందిన సమాచారాన్ని ఎంచుకున్న ఈ పద్ధతిలో పాఠకమహాశయుల ముందుంచే ప్రయత్నము చేశాను. నిన్నటి చరిత్ర నేటకి మిగలకుండా గుర్తులు లేకుండా చెఱగిపోతున్న ఈ కాలగతిలో నేను ఏర్చికూర్చినది మాత్రమే ఆంధ్ర జన పదములకు సంబంధించిన రామాయణమని నేననలేను. ఇంకా ఎంతో ఉండే ఉంటుంది. రానున్న కాలములో ఆంధ్ర పండిత మహాశయులు, చారిత్రక దృష్టితో, భక్తి ప్రపత్తులతో తమకందిన సమాచారాన్ని మరింత వివరంగా సంకలితము చేసి ఈ నా ప్రయత్నానికి పరిపుష్టి చేకూర్చగలరని, ఆ అవకాశము నాకు కలిగినంతవరకు ఇప్పటికి చేశానని, ఈ ప్రయత్నంలో వెలుగు చూడని విషయాలను అందుకొనగలిగితే, సీతారాముల అనుగ్రహముతో దాన్ని మరింత విస్తృత పరచిచూపే ప్రయత్నం చేయగలందులకు ఆ శ్రీరాముని కటాక్షవీక్షణాల కొరకు ప్రార్థిస్తూ ఇంతవరకు నాకు లభ్యమైన సమాచారాన్ని మీ ముందుంచుతు న్నాను. తమిళనాడులోని షోలంగీర్ (అసలుపేరు చోళలింగపురం)కు శ్రీరామ చంద్రుడు విచ్చేశాడని, షోలంగీరు తమ జన్మస్థలమైన శ్రీ రావూరి దొరసామి శర్మగారు తమ గ్రంథము తెలుంగు సాహిత్యము రామకథ అనే గ్రంథంలో చెప్పారు. ఇంక ఆ రాష్ట్రంలో ఏయే ప్రదేశాల్లో శ్రీరాముడు పర్యటించాడో తెలియదు. దానికి తమిళము తెలిసి ఉండాలి!

అలాగే ఒరిస్సా రాష్ట్రం గుండా కూడ శ్రీరాముడు సీతతో కూడి పయనించినట్లు మన తెలుగు దినపత్రికల్లో ఒకప్పుడు ప్రచురితమైంది. ఆ మార్గాన వస్తున్నప్పుడు సీత ఒక కొలనులో స్నానమాడుతూ ఉండగా అక్కడి గిరిజన స్త్రీలు నవ్వారని దానికి సీతాదేవికి కోపమువచ్చి, కాలిబాటను నడచి వెళ్లుతున్నప్పుడు బాట పక్కనున్న కొలనులో స్నానము చేయక తప్పదని, అలా తనను చూచినవారు స్త్రీలైయుండి కూడ ఎకసక్కెముగా నవ్వారు గనుక, రానున్న కాలములో ఆ జాతి స్త్రీలు రవికలు తొడుగుకొనరాదని, తలపైన వెంట్రుకలుంచుకోరాదని శపించిందట. ఒకవేళ తన మాటను అతిక్రమించి ఎవరైన రవికలు తొడిగినా, గుండు చేయించుకోకుండా తలనీలాలు ఉంచుకొన్నా వారికి ఐదవతనము నిలవదని శాపమిచ్చిందట. ఇప్పటికీ అక్కడ పుణ్యవతులైన గిరిజన స్త్రీలు బోడితలలతో, రవికలు ధరించకుండానే ఉంటారట. ఆంధ్రదేశంలో కూడ 'తూర్పు వాళ్లు' అనే పేరుతో పిలువబడుతున్న ఒక కులపు స్త్రీలు వంటికి చీరె మాత్రము ధరించి, రవికలు లేకుండా చీరెలతోనే

శరీరం పైభాగాన్నంతటా కప్పుకొని ఉండటం శ్రీకాకుళం దగ్గర్నుండి కృష్ణాజిల్లా వరకు చూస్తు ఉంటాము. అది ఒక్క కులము వారికే పరిమితమై ఉన్న ఆచారము. ఇప్పుడు చెప్పుకొన్న ఈ కులపు వారు కొండ జాతి వారు కాదు గాని, పూర్వము జనపద నాగరికతకు కొంచెం దూరంగా ఉన్నవారై యుండవచ్చుననిపిస్తుంది.

**కర్ణాటక రాష్ట్రము :**

**బళ్లారి జిల్లా :**

ఈ రచన ప్రధానంగా ఆంధ్రదేశంలో శ్రీరాముని పర్యటన విశేషాలను చెప్పటానికి మాత్రమే ఉద్దిష్టమైనా, ఒకనాడు ఆంధ్రదేశంలో అంతర్భాగమైన బళ్లారి జిల్లాలోని హంపీ విజయనగర ప్రాంతాన్ని గురించి కొన్ని విషయాలు తప్పక చెప్పుకొనవలసి ఉంది.

ముఖ్యంగా రామాయణ కిష్కింధకాండలో జరిగిన ముఖ్య సంఘటనల ప్రదేశమిదే కావటం అందుకు కారణము. త్రేతాయుగము నాడు సుగ్రీవునికి సంబంధమున్న మతంగాశ్రమము, ఋష్య మూక పర్వతము మొదలైనవి ఉన్న పంపాసరోవర తీర ప్రాంతమే ఆ తరువాత "హంపి"గా పిలువబడింది. విద్యారణ్యుల అనుగ్రహముతో ఆ తరువాత విజయనగర సామ్రాజ్యము ఏర్పడింది కూడ అక్కడే. తెలుగులో 'ప' కారముతో ఉండే మాటలు కన్నడములో 'హ' కారముతో ఉచ్చరింపబడతాయి. ఉదాహరణకు తెలుగులో 'పల్లి' లేక "పల్లె" కన్నడములో "హళ్లి" అవుతుంది. అలాగే తెలుగు సంస్కృతిలోని 'పంప' కన్నడములో 'హంపి' అయింది. బళ్లారి నుండి రైలు మార్గంలో హాస్పేట వరకు వెళ్లి అక్కడ నుండి 11 కి.మీల దూరంలో ఉన్న కమలాపురం వరకు వెళితే హంపి విజయనగర శిధిలాలనేకాక త్రేతాయుగము నాటి రామాయణ సంబంధమైన ప్రదేశాలు కూడ మనం చూస్తాం. కొన్ని విశేషాలు తెలుస్తాయి.

రావణాసురుడు సీతనపహరించుకొని పోయేటప్పుడు ఆమె మూటకట్టి జారవిడిచిన నగలు దొరికింది సుగ్రీవునికే కదా! ఈ సన్నివేశమే సుగ్రీవ రామమైత్రికి బీజమైంది. అప్పటికే సుగ్రీవుని భార్య రుమను వాలి అపహరించి తన స్వాధీనంలో ఉంచుకున్నాడు. పైగా సుగ్రీవుణ్ణి చంపటానికి కూడ సన్నద్ధుడౌతున్నాడు. అందుచేత సుగ్రీవుడు మతంగ మహర్షి శాపము వలన వాలి ప్రవేశించటానికి వీలుకాని ప్రదేశమైన ఋష్యమూక పర్వత ప్రాంతంలో ఉంటున్నాడు. దుందుభిని చంపి వాని శరీరాన్ని వాలి విసరిపారేసినపుడు దుందుభి శరీరం నుండి చిందిన రక్తము

మతంగాశ్రమములో పడటంతో, మతంగ మహర్షి వాలిని, తన ఆశ్రమ ప్రదేశానికి వస్తే చస్తావని శపించాడు. అందుచేత వాలి అక్కడకు వెళ్లలేదు. సుగ్రీవుడు తన అన్న తనను ఎప్పుడైనా చంపవచ్చనే భయంతో కిష్కింధను వదలి వేసి మతంగాశ్రమ సమీప ప్రాంతాలలో ఋష్యమూక పరిసరాలలో కాలం గడపసాగాడు.

హంపీలో ఒకప్పుడు మతంగాశ్రమమున్న ఋష్యమూక పర్వత మాల్యవంత పర్వతములున్నవి. ఋష్యమూక పర్వతముపైన నల్లశాణపు రాయితో రూపొందించబడిన పరశురాముని విగ్రహముంది. విజయనగర రాణుల అంతః పురమని చెప్పబడే భవన శిధిలాలకు, తెనాలి రామకృష్ణుని పేరు మీదున్న ఒక శిలా తోరణానికి దగ్గరగా మాల్యవంత పర్వతముంది. ఇక్కడికి సమీపములోనే తుంగభద్రానది, అవతలి ఒడ్డున పంపాసరోవర ముంది. ఈ మాల్యవంత పర్వతము మీద రెండు జలవనరులున్నవి. వీటికి రామ, లక్ష్మణ తీర్థములని పేరు. వీటిని రామలక్ష్మణులిద్దరు బాణ ప్రయోగము చేసి సృష్టించినట్లు చెప్పబడుతోంది. శ్రీరాముడిక్కడున్న సమయంలో తండ్రికి ఆబ్దీకము పెట్టాడని, ఆ ఆబ్దీకపు పిండాల గుర్తుగా గుండ్రటి శిలలిక్కడ కనిపిస్తాయి. ఇంకా శ్రీరాముడక్కడ ఆ సందర్భంలో గోదానం కూడ చేశాడట - ఆ గుర్తులు కూడ అక్కడ కనిపిస్తాయి. సుగ్రీవ పట్టాభిషేకానంతరము లక్ష్మణునితో కలసి, సీతాన్వేషణ సాగటానికి వర్షాకాలము అడ్డురాగా, సీతా వియోగదుఃఖాన్ని భరిస్తూ గడిపిన మాల్యవంత పర్వతమిదేనని చెప్పబడుతోంది.

ఋష్యమూక పర్వతానికి సరిగ్గా ఎదురుగా, తుంగభద్రానది గట్టు మీద సీతాలక్ష్మణ హనుమత్ సమేతంగా కొలువుదీరి, కోదండపాణియైన రూపంలో ఉన్న రామాలయముంది. ఆయనకీ ప్రదేశంతోనున్న అనుబంధానికి చిహ్నంగా ఈ ఆలయమేర్పడిందని చారిత్రకుల అభిప్రాయము. ఇంకా కోదండ రామాలయము వెనుకనున్న దేవాలయాలలో ఆంజనేయునికి కూడ ప్రత్యేకంగా ఒక దేవాలయముంది.

ఇక్కడొక గుహ సుగ్రీవుని పేరు మీద ఉంది. ఆ గుహలోనే సీతమ్మ జారవిడిచిన నగల మూటను సుగ్రీవుడు దాచాడని చెప్పబడుతోంది. ఆ గుహలోనే, సీతమ్మ నగలు దాచిపెట్టబడిన పవిత్రమైన గుర్తుగా సీతమ్మ వారి పాదాలు నిలుపుకున్నారని చెప్పబడుతోంది. ఆ పాదాలిప్పటికీ ఆ గుహలో దర్శనిమిస్తాయి.

పైన చెప్పుకున్న సుగ్రీవుని గుహకు వెనుక, విజయనగర రాజులచే నిర్మింపబడిన కోట గోడకు దిగువన, దానికి ఎడమ ప్రక్కగా ఒక రాతిపలక మీద రామలక్ష్మణుల పాదముద్రలు కనిపిస్తాయి. ఈ పాదాలొక సర్పరూపముచే పరివేష్టితమై ఉన్నవి. ఈ సర్పానికి నాలుగు వైపుల చిన్న చిన్న రాతి పలకలమీద తూర్పున సూర్యుడు, పడమట చంద్రుడు, ఉత్తరాన శంఖచక్రాలు, దక్షిణాన త్రిశూలము రూపొందింపబడి ఉన్నవి. పైన ఒక శేషుడు, శేషుని పడగకు దగ్గరగా ఒక శివలింగము, నంది కూడ ఉన్నవి. ఈ పాదాలనానుకొని ఒక చెలువు ఉంది.

ఇంకా ఇక్కడ చక్రతీర్థమనే పేరుతో ఒక తీర్థముంది. సుగ్రీవుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థించి, తాను శ్రీరాముని భక్తునిగానే కొనసాగుతానని, శివకేశవులకభేదమని తెలిసినప్పటికి, రామ భక్తునిగా ఉండటం తనకిష్టమని చెప్పాడట. దానికి తన అంగీకారము తెలిపిన పరమేశ్వరుడు శ్రీరాముని రూపములో చక్రతీర్థము వద్ద వెలిశాడట. ఆ విధంగా చక్రతీర్థము దగ్గర శ్రీరాముడు వెలసి ఉన్నాడు.

అలాగే ఆ గుహకు సమీపంలో ఉన్న సీతాసరోవరము నుండి, పైన చెప్పిన గుహ ద్వారము వరకు సీతపైట చెఱుగు చాఱలు అని పిలువబడే తెలుపూ ఎరుపు రంగులచాఱలు బండలమీద ఏర్పడి ఉన్నవి. అవి సరోవర ములో సీతాదేవి స్నానమాడి వచ్చేటప్పుడు చెఱగురాపిడి వలన ఏర్పడి అలా నిలచిపోయినట్లుగా చెబుతారు. చీరెకొంగు నేలకు తగిలినంత మాత్రాన ఆ రాపిడికి చాఱ ఏర్పడుతుందా అనే ప్రశ్నకు సమాధానము చెప్పటము కష్టమే గాని సీత విషయంలో ఇలాంటివెన్నో సంఘటనలు కనిపిస్తాయి. అయితే కిష్కింధ ప్రాంతములో రామలక్ష్మణులు ప్రవేశించినప్పుడు వారితో సీత లేదుగదా అనే ప్రశ్న ఉదయిస్తుంది. సీత ఇక్కడ ఉన్నది మాత్రము సీతారాముల అరణ్య వాసంలో కాదు.

వాల్మీకి సీతాదేవిని ఇక్కడకు తీసికొని వచ్చి ఇక్కడ కొంతకాలముంచాడని, ఆమెతో ఈ క్షేత్రంలో గౌరీ పూజ చేయించాడని, ఆ సమయంలో ఆమె ఈ గుహలో కొన్నాళ్లున్నదని చెప్పబడుతోంది. (ఇలా ఆమె ఉండటం కృష్ణాజిల్లాలో సీతాయలంకగా ఈనాడు పిలువబడే స్థానంలో కూడ జరిగినట్లు అక్కడ చెప్పుకున్నాము. రాముడు కూడ అగస్త్యుని నుండి ధర్మసూక్ష్మాలు విన్నట్లు కళ్లేపల్లి (కృష్ణాజిల్లా) విషయంలో కూడ చెప్పుకున్నాము. ఒక వేళ రామాయణ ఉత్తర కథలో సీతను లక్ష్మణుడు వదలి వచ్చిన తరువాత, ఆమె వాల్మీకి ఆశ్రమ ప్రదేశం చేరినప్పుడు, వాల్మీకితో బాటు సీత ఇలాంటి ప్రదేశాలకు వాల్మీకితో వచ్చి ఇలా ఉండటం జరిగిందేమో

తెలియదు. ఇలా అనుకొనటానికి కారణము చిత్తూరు జిల్లా వాయల్పాడు మొదలైన ప్రదేశాలలోను, గోదావరి జిల్లా కపిళేశ్వరపుర ప్రాంతాలలోను కూడ వాల్మీకి ఆశ్రమాలున్నట్లు స్థానిక కథనముంది.

అయితే సుగ్రీవుడు ఋష్యమూక పర్వత ప్రాంతానికి రాకమునుపు వాలి సుగ్రీవులు ఎక్కడుండేవారనే విషయానికి వస్తే వారు కిష్కింధలో ఉండే వారని సమాధానము. ఇక్కడ కూడ మనమొక విషయాన్ని పరిశీలింపవలసి ఉంది. కిష్కింధ పంపాసరోవర ప్రాంతములో ఉంది. వారి నివాసాదులు అక్కడే ఉన్నప్పటికిని వారు ఆ ప్రదేశము వరకే పరిమితము కాలేదేమోనని పిస్తుంది. వానరులు సంచార జీవులు కనుక వారి జాతివారి నివాసాలు బహు ప్రదేశాల వరకు వ్యాప్తి చెంది ఉండేవో లేక వారు తమ సంచారములో తమకు ఇష్టమైన చోట్ల తాత్కాలిక ఆవాసాలు ఏర్పాటు చేసికొని నిలచే వారో స్పష్టంగా తెలియదు గాని గోదావరీ పరిసర ప్రాంతాల వరకు వారి సంచార జీవన రేఖలు గోచరిస్తాయి. ఆంధ్రదేశములో ప॥గోదావరి జిల్లాలోని కామవరపు కోట గ్రామానికి నైరృతి దిక్కుగా ఉన్న పర్వతాన్ని వాలి సుగ్రీవుల గట్టని పిలుస్తారు. ఆ కొండ దిగువన హంపిలో వలెనే రెండు పెద్ద బండరాళ్ల మీద చేతులెత్తి యుద్ధానికి సన్నద్ధంగా ఉన్న వాలి సుగ్రీవుల విగ్రహాలు నిలచి ఉన్నవి. ఆ రాళ్ల బండలు చాలా పెద్దవి 1, 2 చిత్రాలు


1


2

ఈ రెండు విగ్రహాల మధ్యగా పైకి చూస్తే కొండ శిఖర భాగాన ఒక గుహ కనిపిస్తుంది. అది చాల ప్రాచీనమైన గుహ....



ఈ గుహ ప్రక్కనే తారాదేవి విగ్రహమున్న ఒక మందిరముంది. మందిర గోడల నిర్మాణములో ఆధునికత కనిపించినా, గుహ - దాని పరిసరాల ప్రకృతి చాల ప్రాచీనమైనవి. ఈ ఆధారాలు వాలికీ స్థానంతో ఏదో సంబంధమున్నదనే విషయాన్ని బలపరుస్తుంది.



సుగ్రీవునికి సీతమ్మ నగలు లభ్యమైనది ఖమ్మం జిల్లా సీతంపేటలో అనే విషయం ఆ స్థానిక చరిత్ర విషయంలో మనమింతకు ముందు చెప్పు కున్నాము. వారు వానర జాతి వారు కనుక, వారి ప్రయాణము చాల వేగవంతము కనుక, ఇక్కడ కూడ వారి నివాసాలు - అవి తాత్కాలికమైన వైనా కావచ్చు - ఉండి ఆ సంఘటన ఈ పరిసర ప్రాంతాలలో జరిగి ఉండ వచ్చునేమో! అయితే శ్రీరాముడు ఆంజనేయుని వలన సీతను గురించిన సమాచారము కోసము ఎదురుచూచినది మాత్రము ఋష్య మూకము దగ్గరున్న మాల్యవంతము మీదనే. అయితే పశ్చిమగోదావరి ప్రాంతముతో సుగ్రీవా దులకు ఎంతో కొంత సంబంధమున్న కారణము చేతనే, సుగ్రీవుడు తాను చేసిన పాపపరిహారార్థము (ప॥గో॥ జిల్లాలోని) వసంతవాడలో శివలింగ ప్రతిష్ఠ చేసి ఉంటాడనిపిస్తుంది.

అయితే వాలితోడి యుద్ధము పంపాసరోవర ప్రాంతంలోని కిష్కింధలోనే జరిగింది. కమలాపురము నుండి తలారికట్ట అనే ప్రదేశానికి వెళ్లే మార్గములో ఒక పెద్ద మఱ్ఱి చెట్టు ఉంది. దానికి దగ్గరగా ఒక మంటపముంది. ఆ మంటపానికి ఎదురుగా, తుంగభద్రానది గట్టు వెంట, సుమారు 4 కి.మీల దూరంలో ఉన్న నింబాపురం దగ్గరగా వాలికాష్ఠమనే ప్రదేశముంది. అంటే వాలికి దహన సంస్కారము చేసిన ప్రదేశమన్న మాట. ఇక్కడి నేలను కొంచెం తవ్వితీస్తే అస్థికల బూడిద వంటి ధూళి పదార్థము కనిపిస్తుందని చెబుతారు.

ఇంకా ఇక్కడ శ్రీ కృష్ణదేవరాయలు 1513లో నిర్మించిన హజార రామాలయముంది. ఇది శ్రీరాముని వెయ్యి (హజారు) భంగిమల్లో రూపొందిం చినిల్పిన దేవాలయము.

ఈ గ్రంథానికి ముంగింపు పలికే ముందొక విషయాన్ని కూడ పాఠక మహాశయుల ముందుంచుతున్నాను. డా॥ శ్రీ.జె.వి సుబ్బారాయుడనే ప్రముఖ పండితుడు విదేశాలలో వినిపిస్తున్న, కనిపిస్తున్న రామకథా విశేషాలను 'రామరసవాహిని' అనే వారి గ్రంథములో వివరించి చెప్పారు. బర్మా (బ్రహ్మ దేశము), చంపా (వియత్నాం), శ్రీలంక, కంబోడియా, ఫిలిప్పైన్స్, చైనా, టిబెట్, నేపాల్, థాయ్‌లాండ్, జపాను, ఇండోనేషియా, మలేషియా, మంగోలియా, లావోస్ మొదలగు దేశాలలో ప్రవహిస్తున్న రామరస వాహినిని గురించి వివరించారు. అంతేకాదు ఉజ్‌బెక్ కొరియన్ భాషల్లో రామాయణం అవతరించిందని చెప్పారు కూడ.

మరొకమాట! జపానులో బౌద్ధ సంస్కృతీ సమ్మిళితమైన ఇతివృత్తంతో ఒక రామాయణ కథే ప్రచలితమౌతూ ఉండగా 1993 సంవత్సర ప్రాంతంలో 'శాకో' అనే వారు భారత ప్రముఖులతోను, ప్రభుత్వంతోను సంప్రదించి ఒక చిత్రాన్ని రూపొందించాలని సంకల్పించారు. కాని ఎందుకో అది కార్యరూపం దాల్చలేదు. జపానుకు తిరిగివెళ్లి నాచికేతు పట్వర్థన్ వంటి భారతీయ కళాకారుల సహాయంతో ఒక యానిమేషన్ (Animation) చిత్రాన్ని రూపొందించారు.

రామాయణంలోని 6 కాండలు సీతారాముల అరణ్యవాసం తరువాత తిరిగిరావటం, పట్టాభిషేకముతో ముగిస్తే, ఉత్తరకాండ క్లుప్తంగా సీత తిరిగి అరణ్యానికి పంపబడటం, అశ్వమేధ యాగము, కుశలవుల రామాయణ కథాగానం సీతావతార పరిసమాప్తులను మాత్రమే చెబుతోంది. శ్రీరాముని జీవితంలోని 39 సంవత్సరాల జీవిత గమనాన్ని వాల్మీకి సుమారు 24000 శ్లోకాల గ్రంథంగా చెబితే, తర్వాత జరిగిన 11000 సంవత్సరాల శ్రీరాముని పరిపాలనా కాలానికి సంబంధించిన విశేషాలు తెలుసుకోవటానికి ఇంకా ఎంతో పెద్ద గ్రంథముండాలి. ఒకవేళ వాల్మీకి వ్రాశాడని చెప్పబడుతున్న లక్షశ్లోకాలలో ఆ విశేషాలున్నాయేమో. కాని ఆ విశేషాలేవీ మనకు లభ్యం కావటం లేదు. అలా అని శ్రీరాముని ముద్రలు భారత దేశంలో పడలేదన టానికి వీలులేదు. వాటిని గుర్తుపట్టాలి. వాటిని మనం మరో రామాయణంగా వ్రాయలేకపోవచ్చు. చారిత్రక విధానంతోనైనా పొందుపరచుకోవాలి. అదెలా సాధ్యమౌతుందో ఆలోచించాలి. శ్రీ సుబ్బారాయుడు వంటివారు విదేశీ రామ రసవాహినిని మనకు చూపిస్తే, మన ఉత్తర భారత దేశ ప్రాంతాల్లో, దక్షిణాది ఇతర రాష్ట్రాల్లో ఉన్న చారిత్రక విశేషాల్ని ఆ శ్రీరాముని జీవిత విశేషాల్ని గుర్తించటానికి ప్రయత్నించటంలో అనౌచిత్యమేమీ ఉండదనిపిస్తుంది. కాకపోతే భారతీయ సంస్కృతిపై ప్రగాఢ అభిమానము, శ్రీరామునిపై భక్తి ప్రపత్తులున్న సంస్థలు, వ్యక్తులు అందుకు సంకల్పించాలి. ఆ సంకల్పాన్ని ఆ శ్రీరాముడే కలుగచెయ్యాలి.



# అనుబంధము - 1

ఈ సృష్టి ప్రారంభమై ఇప్పటికి జరిగిన కాలానికి సంబంధించి భారతీయ సంప్రదాయ పద్ధతిలో ఖగోళ శాస్త్రాన్ని ఆధారముగా చేసికొని వేసిన కాల గణితానికి సంబంధించిన వివరాలిలా ఉన్నవి.

ఈ సృష్టిని 14 మంది మనువులు పరిపాలిస్తారు. ఒక్కొక్క మనువు పరిపాలనా కాలాన్ని మన్వంతరమంటారు.

| | |
|---|---|
| ఒక్కొక్క మనువు పరిపాలించెడి కాలము | 30, 67, 20, 000 |
| గడచిన మన్వంతరాలు 6 | 6 |
| | 1 84, 03, 20, 000 |
| ఒకొక్క మనువు పాలనాలోకి రావటానికి | |
| మధ్య ఉండే సంధికాలము 17, 28, 000×6 : | 1, 03, 68, 000 |
| | 1 85, 06, 88, 000 |
| 7వ మనువు రాకకు మధ్య సంధి కాలము | 1 7, 28, 000 |
| | 1 85, 24, 16, 000 |
| 7వ మనువు కాలంలో జరిగినవి 27 మహాయుగములు | |
| ఒకొక్క మహాయుగము : 43, 20, 000× 27 : | |
| మహాయుగములు | 1 1, 66, 40, 000 |
| 28వ మహాయుగములో కృతయుగము : | 17, 28, 000 |
| త్రేతాయుగము : | 12, 96, 000 |
| ద్వాపరయుగము : | 8, 64, 000 |
| కలియుగము : | 5, 108 |
| | 1, 97, 29, 49, 108 |
| ఇందులో నుండి బ్రహ్మ తపస్సు చేసిన కాలము | |
| సృష్టి జరుగలేదు. అది తీసివేయాలి. | (-) 1, 70, 64, 000 |
| ఇది సృష్టి ప్రారంభమైన నాటి నుండి జరిగిన కాలము | **1, 95, 58, 85, 108** |

**ఇప్పటికి శ్రీరాముని పరిపాలనా కాలము జరిగి ఎంతకాలమైనదో కూడ చూద్దాము :** 24వ మహాయుగములో ఆయన పరిపాలనా కాలము తరువాత త్రేతాయుగంలో ఎంత కాలము మిగిలిందో తెలియదు.

(తరువాయి పేజీలో....)

| | |
|---|---|
| 24వ మహాయుగములోని ద్వాపరయుగం | 8, 64, 000 |
| కలియుగము | 4, 32, 000 |
| | 12, 96, 000 |
| 25వ మహాయుగము | 43, 20, 000 |
| 26వ మహాయుగము | 43, 20, 000 |
| 27వ మహాయుగము | 43, 20, 000 |
| 28వ మహాయుగములో కృతయుగము | 17, 28, 000 |
| త్రేతాయుగము | 12, 96, 000 |
| ద్వాపరయుగము | 8, 64, 000 |
| కలియుగము | 5, 1 08 |
| ఇప్పటికి శ్రీరాముని కాలము తరువాత గడచిన కాలము | **1, 81, 49, 108** |

అయితే ఆయన 28వ మహాయుగములోని త్రేతాయుగములోనే ఉన్నాడనుకుంటే -----

28వ మహాయుగములో ఆయన పరిపాలించిన 11000 సంవత్సరాల కాలము తరువాత త్రేతాయుగములో ఎంత కాలము మిగిలిందో తెలియదు.

| | |
|---|---|
| ద్వాపరయుగము | 8, 64, 000 |
| కలియుగము | 5, 108 |
| | **8, 69, 108** |

అంటే కనీసం శ్రీరాముని కాలము జరిగి 8 లక్షల 69వేల నూట ఏడు సంవత్సరాల గడచిందన్న మాట. అయితే సంప్రదాయ పద్ధతి కాకుండా చరిత్ర కారులు చేస్తున్న కాలనిర్ణయాలు మాత్రము కేవలం వేల సంవత్సరాలలోనే ఉంది.

మనమీ సందర్భంలో రామాయణ కాలానికి సంబంధించి ప్రచలితమైయున్న కొన్ని అభిప్రాయాలు చూద్దాం.

శ్రీ స్వామి జగదీశ్వరానంద సరస్వతి 1991లో ప్రచురించిన 'పురుషోత్తముడు శ్రీరాముడు' అనే తమ గ్రంథంలో శ్రీరామాబ్దము 8,69,691 అని పేర్కొన్నారు. అంటే 2007 నాటికి శ్రీరామాబ్దము 8,69,708 అవుతుందన్నమాట! అంటే శ్రీరాముని నాటి నుండి జరిగిన కాలము 8,69,708 సంవత్సరములన్నమాట!

వారి అభిప్రాయమలా ఉంటే డా॥ వేదవ్యాస 'శుభవార్త' అనే పత్రిక (ఏప్రియల్ 1990 శ్రీరామనవమి ప్రత్యేక సంచిక)లో వాల్మీకి రామాయణాం తర్గత విషయాల నాధారంగా తీసికొని శ్రీరాముని జాతక గ్రహస్థితి ఆధారంగా ఈ విధంగా వ్రాశారు.

"సూర్య సిద్ధాంత గణితం ప్రకారం, సృష్ట్యాదిగ్రహములు గణితం వేస్తే 24వ మహాయుగంలో, వైవ స్వతమన్వంతర కాలంలో, త్రేతాయుగం గడచి ద్వాపరయుగ సంధి కాలంలో ఐదు సంవత్సరములు మిగిలి ఉండగా శ్రీరాముడు భూమికి అవతరించి యుండెననిపై వాల్మీకి రామాయణమును బట్టి తెలియుచున్నదని వ్రాస్తూ ఈ విషయం ఖగోళ గణితం Astronomy ఆధారంగా చెప్పబడిందని వ్రాశారు.

అదే విషయాన్ని మరో దృక్కోణము నుండి పరిశీలిద్దాం.

భారతదేశానికి లంకకు మధ్య సుమారు 18 మైళ్లు లేక 30 కి.మీల పొడవున్న సముద్ర జలాంతర్గతమైయున్న ఒక వారధిని NASA వారు Digital Image Collection అనే పద్ధతిలో ఛాయాచిత్రంగా రూపొందించిన Space Image ని VNN World అనే పత్రిక USA నుండి 7-10-002 సంచికలో ప్రకటించింది.



ఆ సందర్భంగా జల గర్భములోని ఆ బ్రిడ్జి లేక వారధిని గురించి ఆ పత్రిక వ్రాసిన విషయాలు చూద్దాం.

" This information is a crucial aspect for an insight into the mysterious legend called Ramayana which was supposed to have taken place in 'Treta Yuga' (more than 17,00,000 years ago) In this epic, there is a mentioning about a bridge, which was built between Rameswaram (India) and Srilanka coast under the supervison of a dynamic and invincible figure called Rama Who is supposed to be the incarnation of the supreme".

ఆ విధంగా రామాయణకాలము జరిగి 8,69,708 సంవత్సరాలని స్వామి జగదీశ్వరానంద స్వామి వారి అభిప్రాయమైతే, NASA వారి పరిశీలన ద్వారా 17 లక్షల సంవత్సరాలైతే 24 మహాయుగములోని వాడు శ్రీరాముడని ఖగోళశాస్త్రాధారంగా ఒక కోటి ఎనుబది ఒక్క లక్షల పైన సంవత్సరాలవుతోంది. పాఠకుల దృష్టికి వీటిని తీసికొని రావటము మాత్రమే ఈ గ్రంథరచయిత ఉద్దేశము.



# అనుబంధము - 2

## *ఆంధ్రప్రజా మనోవనాల నిండా వెల్లివిరిసి నిలచిన రామాయణ కల్ప వృక్షాలు తెలుగు రామాయణాలు*

ఆంధ్రులకు ఆరాధ్య దైవము మాత్రమేకాక ఆత్మీయమైన దైవము శ్రీరామచంద్రుడు. ఆయనకు అరణ్యవాస కాలంలో నివాసయోగ్యమైన ప్రదేశంగా అగస్త్యునిచే నిర్దిష్టమైన ప్రదేశము గోదావరీ తీర పంచవటి ప్రాంతము. అరణ్య వాసము కష్టాలనుభవించినా శ్రీరామునికీ భూమితో చాలా సాన్నిహిత్యముంది. ఆంధ్రదేశం అడుగడుగునా రామపాదాంకితమైన దేశం. ఇక ఆంజనేయుని విషయానికి వస్తే ఇది ఆయన జన్మభూమి. ఆ విధంగా రామాయణానికి ఆంధ్ర దేశానికి విడదీయరాని అనుబంధమేర్పడింది. అక్షరమునేర్చిన ప్రతి వ్యక్తి కవిత్వము చెప్పాలనుకోకపోయినా పద్య విద్యనలవరచుకొన్న ప్రతికవి రామాయణం వ్రాస్తే బాగుండుననుకున్నాడు. ఆంధ్రదేశమంతటా అసంఖ్యాకంగా గ్రామగ్రామాన రామాల యాలు వెలిశాయి. ఆంధ్ర సాహిత్యాన్ని పరిమళభరితం చేసి రసహృదయాలను తన్మయత్వాన్ని చెందించిన ఎన్నో రామాయణాలావిర్భవించినవి. వానిని అన్నీ మనం చూసే అవకాశం లేకపోవచ్చు. కానీ ఎంతమంది రామాయణాలు వ్రాశారో, ఎన్ని ఆంధ్రదేశంలో ఆవిష్కరింపబడ్డాయో, కన్నవీ విన్నవీ ఎన్ని ఉన్నాయో చూద్దాం.

ఈ సందర్భంగా ఈ సంకలన ప్రయత్నానికి స్ఫూర్తినిచ్చిన రావురి దొరసామి శర్మ గారికి ఈ సంకలనకర్తగా నాకృతజ్ఞతలు తెలుపుకోవటం నావిధి. నా ఈ ప్రయత్నానికి ముఖ్యమైన ఉపయుక్త గ్రంథము 'తెలుగు సాహిత్యము రామకథ' అనే వారి గ్రంథము. తెలుగులో ఇన్ని రామాయణాలుండటం మన పూర్వ పుణ్యం.

## ఆంధ్రసాహిత్యంలో వివిధ కవులు వెలువరించిన రామాయణాలు, రామాయణేతివృత్త కావ్యప్రబంధాధులు - ఇంకా వివిధ ప్రక్రియాకృతులు

| | కవిపేరు | రామాయణము పేరు |
|---|---|---|
| 1. | నన్నయ్య | రాఘవాభ్యుదయము |
| 2. | మంత్రి భాస్కరుడు | భాస్కర రామాయణము (శిధిల భాగముల పూరణ హుళక్కి భాస్కరుడు, మల్లిఖార్జున భట్టు మొ॥లవారు) |
| 3. | తిక్కన సోమయాజి | నిర్వచనోత్తర రామాయణము |

| | | |
|---|---|---|
| 4. | ఎఱ్ఱాప్రెగడ | రామాయణము |
| 5. | కొఱవి సత్యనారాయణ | రామాయణము |
| 6. | మొల్ల | మొల్ల రామాయణము |
| 7. | అయ్యలరాజు రామభద్రుడు | రామాభ్యుదయము |
| 8. | చిత్రకవి వెంకటరమణ కవి | సకల వర్ణనాపూర్ణ రామాయణము |
| 9. | రఘునాధరాయలు | రఘునాధ రామాయణము (బాలకాండములో కొంతవరకే అనూదితము) |
| 10. | ఘనగిరి రామకవి | యధావాల్మీకి రామాయణము (బాలకాండములో కొంతవరకే అనూదితము) |
| 11. | మానూరి గోపాలరావు | యథావాల్మీకి రామాయణము |
| 12. | కాణాదము పెద్దన సోమయాజి మరియు ఐదుగురు కవులు... | యథాశ్లోకతాత్పర్య రామాయణము |
| 13. | చెన్నూరి రామన్న | రామాయణము |
| 14. | బసవకవి | రామాయణము |
| 15. | వారణాశి లక్ష్మీపతి | రామాయణము |
| 16. | మడి వ్యాళయ్య | శారద రామాయణము |
| 17. | గోపినాధము వేంకటకవి | గోపీనాధ రామాయణము |
| 18. | వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు గారు) | ఆంధ్రవాల్మీకి రామాయణము |
| 19. | జనమంచి శేషాద్రిశర్మ | ఆంధ్ర శ్రీమత్ వాల్మీకి రామాయణము |
| 20. | జనమంచి శేషాద్రిశర్మ | ధర్మ సారరామాయణము |
| 21. | జనమంచి శేషాద్రిశర్మ | సంగ్రహ రామాయణము |
| 22. | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | శ్రీ కృష్ణ రామాయణము |
| 23. | విశ్వనాధ సత్యనారాయణ | శ్రీ మద్రామాయణకల్పవృక్షము |
| 24. | కట్టా వరదరాజు | వరదరాజు రామాయణము |
| 25. | కరభోసల ఏకోజీ | ఏకోజీ రామాయణము |
| 26. | ధర్మవరపు సీతారామాంజనేయులు | ఆంజనేయ రామాయణము |

| | | |
|---|---|---|
| 27. | గడియారము వేంకట శేషశాస్త్రి | శ్రీమద్రాంధ్రరామాయణము |
| 28. | రాళ్ళబండి నాగభూషణశాస్త్రి | మారుతి రామాయణము |
| 29. | కపిలవాయి లింగమూర్తి | శారదరామాయణము |
| 30. | కపిలవాయి లింగమూర్తి | రామోదాహరణం |
| 31. | కపిలవాయి లింగమూర్తి | శ్రీరామవచనాలు |
| 32. | ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి | అభినవ రామాయణము |
| 33. | నిమ్మగడ్డ రామకృష్ణ దాసకవి | హనుమద్రామాయణము |
| 34. | గంగయ్య | తారక బ్రహ్మ రామాయణము |
| 35. | చెన్న కృష్ణయ | సాంఖ్య రామాయణము |
| 36. | నరసింహదేవర వేంకటశాస్త్రి | విచిత్ర రామాయణము |
| 37. | ముదుంబి కృష్ణయ్య | అద్భుత రామాయణము |
| 38. | గంధం శ్రీరామమూర్తి మరియు ఇట్టింకి నరసింహమూర్తి | యథార్ధ రామాయణము |
| 39. | వేములవాడ భీమకవి | శతకంఠ/శతకంధర రామాయణము |
| 40. | లింగకవి & గంగకవి (జంటగా) | శతకంఠ రామాయణము |
| 41. | వేంకట భూపతి | సహస్రనామరామాయణము |
| 42. | రామావఝుల కొండయ శాస్త్రి | సహస్రకంఠ రామాయణము |
| 43. | కూచిమంచి జగ్గకవి | తారక బ్రహ్మ రామాయణము |
| 44. | వేంకట పార్వతీశ్వర కవులు | శ్రీ రామాయణము |
| 45. | ఆత్మకూరి గోవిందాచార్యులు | గోవింద రామాయణము |
| 46. | గుండు లక్ష్మణశాస్త్రి | ఆంధ్రానంద రామాయణము |
| 47. | ఆకొండి వెంకటకవి | తత్త్వసంగ్రహ రామాయణము |
| 48. | ఉమర్ అలిషాకవి | శ్రీ మద్వాల్మీకి రామాయణము |
| 49. | కామవరపు సూర్యనారాయణ | దండక రామాయణము (లఘుకృతి) |
| 50. | కరణం అశ్వత్థరావు | దండక రామాయణము (విస్తృతగ్రంథము) |
| 51. | మోదుకూరి పండరీనాధకవి | పండరీనాధ రామాయణము |
| 52. | పి.వి.ఎల్.ఎన్.ప్రభాకరశర్మ | హనుమద్రామాయణము |
| 53. | అయినంపూడి గురునాధరావు | గురునాధ రామాయణము |

54. శ్రీ సోమరాజు వేంకట సుబ్బరాయకవి శ్రీమదాంధ్ర ఆనందరామాయణం

**అధ్యాత్మ రామాయణములు వ్రాసిన కవులు :**

55. మేడూరి సీతారామయ్య శర్మ సీతారామాయణం
56. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి (విహారి) పదచిత్ర రామాయణం
57. కంచర్ల శరభకవి
58. ఇమ్మడి జగదేవరాయలు
59. రాపాక శ్రీరామకవి
60. కాణాదము పెద్దన సోమయాజి
61. పరశురామపంతుల రామమూర్తి
62. ముడుంబై వెంకట కృష్ణమాచార్యులు
63. మోదుకూరి పండరీనాధకవి
64. కోటమరాజు నాగయ్య
65. కృష్ణగిరి వేంకట రమణకవి
66. అల్లమరాజు రామకృష్ణకవి
67. రామయామాత్యుడు
68. బులుసు వెంకటేశ్వర్లు
69. ఉపమాక నారాయణమూర్తి
70. శేషగిరి సుబ్రహ్మణ్యకవి (108 కీర్తనలతో)
71. ఆకొండి వ్యాసమూర్తి :
72. **తత్త్వ సంగ్రహ రామాయణం (అధ్యాత్మమాలికా రామాయణమని వివరణ)**

**వాసిష్ఠ రామాయణము : కవులు**

73. మడికి సింగన
74. కామినేని ఎల్లా రెడ్డి

**భోజుని చంపూరామాయణానువాదకులు:-**

75. ఋగ్వేదకవి వేంకటాచలపతి
76. అల్లమరాజు రంగశాయి
77. బులుసు సీతారామకవి
78. పూసపాటి రంగనాయకామాత్యుడు

79. జయంతి రామయ్య పంతులు

80. బుద్ధవరపు మహాదేవుడు

బాల రామాయణ ఆంధ్రీకరణ

81. గర్నెపూడి వెంకట సుబ్బయామాత్యుడు

82. ఆదిపూడి సోమనాధరావు

83. జయంతి రామయ్య పంతులు

84. నల్లాన్ చక్రవర్తుల సింహాద్రి అయ్యంగార్ (పెన్నాడ)

85. శేషగిరి వేంకట రమణకవి

విచిత్ర రామాయణ కర్తలు

86. తుమురాడ పాపకవి (రామకథా సుధార్ణవమని నామాంతరము)

87. కొమ్మాజీ సోమనాధశిల్పాచార్యుడు

88. వేల్పూరి వేంకటేశ్వరకవి

89. నరసింహదేవర వేంకట శాస్త్రి

## 7. కావ్య ప్రబంధాదులు

**నన్నయ రాఘవాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయములు ఇంతకుముందే చేర్చబడినవి.**

| | | |
|---|---|---|
| 90. | రేవణూరి కొండయ్య (అన్నమయ్య అల్లుడు) | రామచంద్రోపాఖ్యానము |
| 91. | రేవణూరి వేంకటార్యుడు | రామచంద్రోపాఖ్యానము (కొండయ్య గారి కొడుకు - ఈయన వ్రాశాడని కొందరు అంటుంటారు) |
| 92. | సింగరాచార్యులు | రామాభ్యుదయము |
| 93. | వేంకట నరసింహాచార్యులు | రామాభ్యుదయము |
| 94. | బిజ్జల తిమ్మరాజు (పాకటూరు సంస్థానాధిపతి) | అనర్ఘరాఘవము (ఇదే పేరుగల సంస్కృత నాటకానికి తెలుగు ప్రబంధములు) |
| 95. | ఉప్పుగుందూరు వేంకటపతి | అనర్ఘరాఘవము |
| 96. | ఏనుగు లక్ష్మణకవి | రామవిలాసము |
| 97. | దిట్టకవి పాపరాజకవి | రామకథాసారము |

| | | |
|---|---|---|
| 98. | అనంతరాజు జన్నయ | రామకథాభిరామము |
| 99. | మిక్కిలి మల్లిఖార్జునుడు | రామచంద్రోపాఖ్యానము |
| 100. | వారణాసి వేంకటేశ్వరకవి | రామచంద్రోపాఖ్యానము |
| 101. | మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి | సీతారామచరిత్రము |
| 102. | వడ్డాది తిమ్మరాజకవి | శ్రీరామావతారము |
| 103. | మండ కామేశ్వరశాస్త్రి | రామకథాసారసంగ్రహము |
| 104. | చామర్తి శేషగిరిరాయకవి | రామకథాసుధాలహరి |
| 105. | కొత్తపల్లి లచ్చయకవి | దాశరధి విలాసము |
| 106. | నాగలింగకవి | పట్టాభిరామవిలాసము |
| 107. | చెఱుకుమూడి కృష్ణయ్య | శృంగార రాఘవము |
| 108. | ఆవంచ భావన | రఘురామ విజయము |
| 109. | అప్పలరాజు | సీతాచరిత్రము |
| 110. | నందూరి బాపమంత్రి | శ్రీ రామచరిత్రము |
| 111. | నడిమింటి వేంకటపతి | అభిషిక్త రాఘవము |
| 112. | చిదంబర కవి | శ్రీ రామకుమార విజయము |
| 113. | రంగయ | రామోదయము |
| 114. | పిన్నమరాజు బలరామకవి | శ్రీ రామచంద్రకథా సుధాలహరీ తరంగిణి (తరంగములు) రామచంద్ర కధాసుధార్ణవము |
| 115. | నారాయణ రామానుజాచార్యులు | రాఘవాభ్యుదయము |
| 116. | కప్పగంతుల లక్ష్మణశాస్త్రి | జానకీ హరణకావ్యము |
| 117. | మండా కామేశ్వరశాస్త్రి | శ్రీరామావతారము |
| 118. | బొడ్డుచర్ల తిమ్మన | ప్రసన్న రాఘవనాట్య ప్రబంధ పద్యానువాదము |
| 119. | కోపల్లె శివకామేశ్వరరావు | శ్రీమద్రామాయణము |
| 120. | రత్నాకరము గోపాలరాజు | దశరధకుమారచరిత్ర |
| 121. | మాదిరాజు విశ్వనాధరావు | జానకీ పరిణయము |
| 122. | వాదాల శేషాచార్యులు | మైథిలీ పరిణయము |

| | | |
|---|---|---|
| 123. | బేతపూడి కృష్ణయ్య | జానకీరాఘవము |
| 124. | పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు | శ్రీరామకల్యాణము |
| 125. | వాజపేయ యాజుల రామసుబ్బారాయ వేంకట నారాయణ సోదరకవులు | సీతాకల్యాణము |
| 126. | త్రిపురాన వెంకట సూర్యప్రసాదరాయకవి | రామాశ్వమేధము |
| 127. | ముడుంబి వేంకట కృష్ణమాచార్యులు | శ్రీ రామస్తవచూర్ణిక |
| 128. | రత్నాకర బాలరాజు | శ్రీ రామానందలహరి |
| 129. | నారాయణం రామానుజాచార్యులు | రామానంద లహరి |
| 130. | అష్టకాల నరసింహశర్మ | శ్రీరామచంద్రిక |
| 131. | ముక్తేవి పెరుమాళ్లయ్య | భద్రగిరి సౌధసంచార భవవిదూర అనే మకుటంతో 44 సీస పద్యాల్లో రామాయణం |
| 132. | ముక్తేవి సుందరరామదాసకవి | శ్రీరామాయణ సార సంగ్రహం |
| 133. | " | శ్రీరామదూతమ్ శిరసానమామి. |
| 134. | రావూరి దొరసామిశర్మ | రామోదంతము |
| 135. | లింగము గుంట రామకవి | చతుర్వాటికా మాహాత్మ్యము (చదలవాడ మాహాత్మ్యము) |
| 136. | ఏనుగు లక్ష్మణకవి | రామేశ్వరమాహాత్మ్యము |
| 137. | పింగళి & కాటూరి | పౌలస్త్య హృదయము |
| 138. | పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు | కైకేయీ సౌశీల్యము |
| 139. | ఆసూరి మరింగంటి సింగరాచార్యులు | రామాయణము |
| 140. | పప్పు చిట్టిదాసు | శ్రీరామ కథామృతం |
| 141. | తుమ్మనపల్లి రామస్వామి | సీతారామ కల్యాణం |

## 8. చిత్ర కావ్యములు

| | | |
|---|---|---|
| 142. | మరిగంటి సింగరాచార్యులు | శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము |
| 143. | " | దశరథ రాజనందన చరిత్ర |
| 144. | అబ్బరాజు హనుమంతరాయశర్మ | అచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య దాశరధి చరిత్ర |

| | | |
|---|---|---|
| 145. | సురవరం కేశవయ్య | నిరోష్ఠ్య రామాయణము |
| 146. | పిడపర్తి బసువప్ప | నిరోష్ఠ్య సీతాకల్యాణము |
| 147. | పోడూరి రామన | నిరోష్ఠ్య జానకీ కల్యాణము (అలభ్యము) |
| 148. | రావిపాటి లక్ష్మీనారాయణ | నిర్వచన భారత గర్భరామాయణము |
| 149. | పిన్నమరాజు బలరామకవి | బంధుర వృత్త రామాయణాలు |

## 9. ద్వ్యర్థి కావ్యములు

**వేములవాడ భీమకవి రాఘవ పాండవీయం గురించి ఇంతకుముందు చేర్చబడింది**

| | | |
|---|---|---|
| 150. | పింగళి సూరన | రాఘవ పాండవీయము |
| 151. | తిరుమల బుక్కపట్టణం వేంకటాచార్యులు | అచలాత్మజాపరిణయము |
| 152. | కొత్తలంక మృత్యుంజయ కవి | ధరాత్మజా పరిణయము |
| 153. | పోడూరి పెద రామామాత్యుడు | శివరామాభ్యుదయము |
| 154. | మరిగంటి సింగరాచార్య | రామకృష్ణ చరిత్ర |
| 155. | చిత్రకవి సింగరార్యుడు | రాఘవ వాసుదేవీయము |
| 156. | పిండిప్రోలు లక్ష్మణకవి | రావణదమ్మీయము (లేక లంకా విజయము) |
| 157. | పన్నాల బ్రహ్మన్న | ఖలకర్ణవిషాయన రామాయణము |
| 158. | శ్రీ పాద వేంకటాచలపతి కవి | రామకృష్ణోపాఖ్యానము |
| 159. | రావూరి దొరసామిశర్మ | రాఘవ నైషధీయము |
| 160. | " | రాఘవ పాండవీయము |

## 10. త్ర్యర్థి కావ్యములు

| | | |
|---|---|---|
| 161. | ఎలకూచి బాలసరస్వతి | రాఘవ యాదవ పాండవీయము |
| 162. | నెల్లూరి వీరరాఘవ కవి | యాదవ రాఘవ పాండవీయము |
| 163. | అయ్యగారి వీరభద్ర కవి | రాఘవ పాండవ యాదవీయము |
| 164. | ఓరుగంటి సోమశేఖరకవి | రామకృష్ణార్జున రూప నారాయణీయము |

## 11. చతురర్థి కావ్యములు

165. గునుగుదూరి వెంకట కృష్ణకవి — నల యాదవ రాఘవ పాండవీయము
166. మరిగంటి సింగరాచార్యులు — ॥
167. నాదెళ్ళ పురుషోత్తమ కవి — చతుర్ముఖ కంద రామాయణము

## 12. అచ్చ తెనుగు రామాయణాలు

168. అడిదము భాస్కరకవి — శుద్ధాంధ్ర రామాయణము
169. కూచిమంచి తిమ్మకవి — అచ్చ తెలుగు రామాయణము
170. అబ్బరాజు హనుమంతరాయశర్మ — అచ్చాంధ్ర నిరోష్ఠ్యనిర్గద్య దాశరధి చరిత్ర
171. చక్రాతి లక్ష్మీనరసకవి — శుద్ధాంధ్ర రామాయణము
172. రావూరి దొరసామిశర్మ — శుద్ధాంధ్ర నిర్వచన సీతాకల్యాణము

***అచ్చ తెలుగులో 2 శతకములు కూడ ఉన్నవి.***
***ఒక దానికి చింతగుంటపాలెపు రామా అని మకుటము.***

## 13. ద్విపద రామాయణాలు

173. గోన బుద్ధారెడ్డి — కవితంత్రి రంగనాధుని పేర రంగనాథ రామాయణము
174. అన్నమాచార్యులు — ద్విపద రామాయణము (అలభ్యము)
175. కట్టా వరదరాజు — వరదరాజ రామాయణము
176. రాధేశ్యాం — ద్విపద రామాయణము
177. రాఘవరెడ్డి — రామాయణము

## 14. జనపదాల పేర్లతోడి రామాయణాలు

178. ముద్దయకవి — మంథెన రామాయణము
179. కవి పేరు తెలియదు — మోక్షగుండ రామాయణము
180. ॥ — ఇల్లిందకుంట రామాయణము
181. ॥ — జీడికంటి రామాయణము
182. ధర్మపురి ఇంటి పేరుగల కవి — ధర్మపురి రామాయణము
183. జూలకంటి నారాయణకవి — కొమ్మాలపాటి రామాయణము
(కృతి భర్త ఇంటి పేరు మీద వెలసిన రామాయణాలు)

## 15. ఉత్తర రామాయణాలు

ఉత్తర రామాయణ కథను నిర్వచనోత్తర రామాయణమనే పేరుతో తెలుగులో మొదట వ్రాసినవాడు తిక్కన సోమయాజి. ఆ విషయం ప్రారంభంలోనే చెప్పబడింది. అయితే తిక్కన రామనిర్యాణం వ్రాయలేదు. అది జయంతి రామభట్టు పూర్తి చేశాడు.

| | | |
|---|---|---|
| 184. | కంకంటి పాపరాజు | |
| 185. | ఘట్టు వేంకట రామకృష్ణకవి | పట్టాభిరామాయణము (ఉత్తర రామాయణ కథయే) |
| 186. | శఠగోపాచారి | " |
| 187. | నందగిరి వెంకటప్పారావు పంతులు | అద్భుతోత్తర రామాయణము |
| 188. | నాదెళ్ళ పురుషోత్తమ కవి | అద్భుతోత్తర రామాయణము (ఇది చిత్ర కవితలో కూడ చెప్పుకొన వలసిన గ్రంథం) |
| 189. | చెఱుకుపల్లి జమదగ్ని శర్మ | శ్రీ రామరాజ్యం |

## 16. అన్యభాషా రామాయణ ఆంధ్రానువదములు

| | గ్రంథం పేరు : | అనువాదకులు : |
|---|---|---|
| 190. | కంబ రామాయణము (తమిళం) | పూతలపట్టు శ్రీరాములు రెడ్డి |
| 191. | " | ఆదిపూడి సోమనాధరావు |
| 192. | తులసీదాస రామయణము (హిందీ) | భాగవతుల నరసింహశర్మ |
| 193. | " | ఆనంద గజపతి నవరామాయణము |
| 194. | మూలకవి కాశీవరవేదాంతవాగీశులు (బెంగాలి) | కౌతాశ్రీరామశాస్త్రి |

### ఆత్మరామాయణము

| | | |
|---|---|---|
| ఓఢ్ర మూలము | : | రామరసామృత సింధురామాయణము |
| వచనము | : | బంటుపల్లి రామయ్య |
| పద్యకావ్యము | : | గుండ్రేటి గురవయ్య |

## 17. వచన రామాయణాలు - కావ్యాలు

| | |
|---|---|
| 195. డొంకా గోపీనాధుడు | వచన విచిత్ర రామాయణము |
| 196. కుందుర్తి వేంకటాచలకవి | రామాయణము |
| 197. శ్యామరాయకవి | రామాయణము |
| 198 తుపాకుల అనంత భూపాలుడు | సుందరకాండము |
| 199. పైడిపాటి పాపయ్య | రంగనాధ రామాయణము |
| 200. శృంగార కవి సర్వారాయుడు | శ్రీ రామజననం ఆత్మరామాయణము |
| 201. వావిళ్ళ రామస్వామి శాస్త్రి | ఆంధ్ర వచన వాల్మీకి రామాయణము |
| 202 తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య | వచన రామాయణము |
| 203. అనంతరావు | ఆంధ్రవచన రామాయణము |
| 204. పాలపర్తి నాగేశ్వరశాస్త్రి | వచన రామాయణము |
| 205. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | వ్యావహారికాంధ్ర రామాయణము |
| 206. నోరి గురులింగశాస్త్రి | రామాయణ వచనము |
| 207. పురిపండా అప్పల స్వామి | వాల్మీకి రామాయణము |
| 208. శ్రీనివాస శిరోమణి | వాల్మీకి రామాయణము |
| 209. ఆ సరస్వతుల సుబ్బరామశాస్త్రి | ఆంధ్ర వచన రామాయణము |
| 210 దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజి | వాసిష్ఠ రామాయణము |
| 211. ముదిగొండ నాగలింగశాస్త్రి | వాసిష్ఠ రామాయణము |
| 212. నోరి గురులింగశాస్త్రి | ఆనంద రామాయణము<br>సావిత్రీ రామాయణము<br>ఉత్తర రామాయణము |
| 213 పెనుమత్స సత్యనారాయణ రాజు | ఉత్తర రామాయణము |
| 214. తెన్మఠం శ్రీరంగాచార్యులు | తారక రామాయణము |
| 215. గట్టుపల్లి శేషాచార్యులు | వాల్మీకి రామాయణము |
| 216. చదలువాడ సుందరశాస్త్రి | వాల్మీకి రామాయణము<br>(శ్లోక తాత్పర్యములు) |
| 217. చదలువాడ సుందరశాస్త్రి | అధ్యాత్మ రామాయణము<br>(శ్లోకములకు టీకాతాత్పర్యములు) |

| | |
|---|---|
| 218. పురిపండా రామమూర్తి | ఆధ్యాత్మ రామాయణము |
| 219. దూర్వాసుల రామయార్యుడు | " |
| 220. వేంకట కృష్ణమాచార్యులు | " |
| 221. ప్ర. సుబ్రహ్మణ్యశాస్త్రి | " |
| 222. ఉషశ్రీ | ఉషశ్రీ రామాయణము |
| 223. బులుసు ఉదయ భాస్కరము | ఆనంద రామాయణము |
| 224. రావుల సూర్యనారాయణ మూర్తి | రావుల రామాయణము |
| 225. దేవరకొండ వీరవెంకటరావు | సుందరకాండ వచనము |
| 226. కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రి | శ్రీ రామ విజయము |
| 227. నడకుదుటి వీరరాజు | జానకీ పరిణయము |
| 228. రెంటాల గోపాలకృష్ణ | వాల్మీకి వచన రామాయణము |
| 229. దాశరధి రంగాచార్య | శ్రీమద్రామాయణము |
| 230. నోరి శ్రీనాధ వెంకట సోమయాజులు | యోగవాసిష్ఠసారము<br>యోగ వాసిష్ఠ రామాయణ సంగ్రహరూపము |
| 231. టి.వేదాంతాచారి<br>(శ్రీమత్‌తపస్యానంద స్వామివారి<br>ఆంగ్ల మూలానికి అనువాదము) | ఆధ్యాత్మ రామాయణము |
| 232. శ్రీములుకుట్ల సూర్యనారాయణ శాస్త్రి | శ్రీ రామవిజయం అనే పౌలస్త్యవధ<br>(రావణజననం - వధ వరకు<br>వ్యాఖ్యానంతోడి కధ) |
| 233. శ్రీములుకుట్ల సూర్యనారాయణ శాస్త్రి | సీతాకల్యాణం |
| 234. రాయసం వీరేశ్వరశర్మ | శ్రీ మద్రామాయణ సారసంగ్రహం<br>(సంపూర్ణ రామాయణ సారం) |
| 235. పుల్లెల శ్రీరామచంద్రుడు | వాల్మీకి రామాయణము<br>(ప్రతిపదార్థ తాత్పర్యములతో) |
| 236. చివుకుల సత్యనారాయణ(విజయవాడ) | ఆనందరామాయణం |
| 237. నాయని కృష్ణమూర్తి | రామాయణం వ్యవహారిక వచనము<br>(ఉత్తర రామాయణంతో సహా |

## 18. రామాయణ, రామకథా కావ్య కవయిత్రులు
## మొల్ల రామాయణము ఇంతకుముందే చేర్చబడింది.

| | |
|---|---|
| 238. తరిగొండ వెంకమాంబ | ద్విపదరామాయణము |
| 239. సీరము సుభద్రయాంబ | సుభద్రా రామాయణము |
| 240. చేబ్రోలు సరస్వతీదేవి | సరస్వతీ రామాయణము |
| 241. మాణిక్యం వేదవల్లీతాయారమ్మ | భోజచంపూ రామాయణానువాదము బాల రామాయణములురామశతకము |
| 242. నూనె సుబ్బమాంబ | అభినవరామాయణము |
| 243. మామిడన్న సుభద్రాంబ | ద్విపదలో ఆధ్యాత్మ రామాయణము |
| 244. పసుపులేటి రంగాజమ్మ | రామాయణ కథా సంగ్రహము - అలభ్యము |
| 245. కాంచనపల్లి కనకాంబ | శ్రీమద్రామయణ కథా సంగ్రహము మరియు శ్రీ రామస్తకము |
| 246. సామవేదం సీతారామమ్మ | జానకినిర్వేదము (ఖండకావ్యము) |
| 247. మదమంచి అనంతమ్మ | సీతమ్మ పెండ్లి (ఖండకావ్యము) |
| 248. అన్నదానం వేంకటాంబ (హోసూరి సాకమ్మ అని నామంతరము) | బాలకాండ |
| 249. చోరగుడి హనుమచ్ఛేషమ్మ | జానకి సందేశము మరియు ఊర్మిళ |
| 250. వారణాసి సూర్యకుమారి | శ్రీరామకథాసుధ |
| 251. శ్రీమతి ఎం.కె.ప్రభావతి | కంద రామాయణము |
| 252. కారుపల్లి రామాంబ | గాన రామాయణము |
| 253. వల్లూరి సుబ్బాయమ్మ | గేయరామాయణము (292 పాదాల గేయంలో) |
| 254. కీ॥శే॥కుమారి సీత (16 సం॥వయస్సు) | రామాయణము |
| 255. గాడేపల్లి సుబ్బమ్మ | పారాయణ రామాయణము |
| 256. యల్లకర్ల ప్రభావతి | శ్రీరామకథామృతము |

| | |
|---|---|
| 257. రావి గౌరీనాగేశ్వరి దేవి | శ్రీమత్సీతారామాయణము |
| 258. దేవులపల్లి చెంచు సుబ్బమ్మ | శ్రీమద్రామాయణ కథా సుధా లహరి |
| 259. స్థానాపతి రుక్మిణమ్మ | వ్యావహారిక ఆంధ్ర తులసీ రామాయణము |
| 260. ఏలూరిపాటి లక్ష్మీసరస్వతి | తులసీ రామాయణం |
| 261. కొలకుల సావిత్రి | సావిత్రీ రామాయణం |
| 262. శ్రీమతి భద్రిరాజు సత్యవెంకటరమణమ్మ | శ్రీమద్రామాయణం (సంభాషణాత్మక రచన) |

## 19. మరికొన్ని రామాయణాలు

| | |
|---|---|
| 263. రావులపర్తి భద్రిరాజు (వెల్ల) | భద్రాచల రామాయణము |
| 264. నందిరాజు సూర్యనారాయణశర్మ | తెలుగు బాలరామాయణము |
| 265. అగస్త్య రాజుసర్వేశ్వరరావు | శ్రీరామకథా సుధాతరంగిణి |
| 266. దుగ్గిన రామచంద్రరావు | రామచరితమానస్‌కు అనువాదము |
| 267. మల్లెల రామయ్య | సంక్షిప్త రామాయణము |
| 268. మాగి వీరజగన్నాధరావు | సంక్షిప్త రామాయణము |
| 269. దిట్టకవి శ్రీనివాసాచార్యులు | శ్రీమద్రామాయణ సంగ్రహం |
| 270. శ్రీ స్వామి అవ్యయానంద | శ్రీమదాంధ్ర తులసీ రామాయణము,2 భాగాలు |
| 271. పి.శాయిరాజు | శ్రీరాముని పట్టాభిషేకం |
| 272. దేవత వెంకట రాములు | శ్రీరామ సుప్రభాతం |
| 273. పేర్నేటి గంగాధరరావు | సుందరకాండ |
| 274. అనుముకొండ తులసీరావు | గేయ రామాయణము |
| 275. త్రిపురనేని వెంకటేశ్వరరావు | త్రిపురనేని రామాయణము |
| 276. సామంతపూడి దశరథ రామరాజు | దశరథ రామాయణము |
| 277. భట్రాజు శ్రీనివాస గాంధి | గేయ సుందరాకాండ |
| 278. సర్వా వెంకట శేషయ్య | సర్వాత్మ రామాయణం |
| 279. పుట్టపర్తి నారాయణాచార్యులు | జనప్రియ రామాయణం |

| | | |
|---|---|---|
| 280. | వానమామలై వరదాచార్యులు | గీత రామాయణం |
| 281. | కందుకూరి రామకృష్ణ సూర్యనారాయణ | చంపూ రామాయణం |
| 282. | రొంపిచర్ల కృష్ణశాస్త్రి | ఆంధ్ర చంపూ రామాయణం |
| 283. | జి.యల్.ఎన్ శాస్త్రి (గుంటూరు) | శ్రీమద్రామాయణం |
| 284. | మైలవరపు సూర్యనారాయణమూర్తి | ఆంధ్ర తులసీ రామాయణం |
| 285. | చల్లా లక్ష్మీనారాయణ | మైథిలి |
| 286. | పరసా దుర్గాప్రసాద రావు | మైథిలి |
| 287. | బుక్కపట్నం రామచంద్రాచార్యులు | ఆనంద రామాయణం |





# కృతజ్ఞతాంజలి

ఎందరో మహానుభావులు – వారందరికి వందనాలు సమర్పించుకోవటం రచయితగా నా బాధ్యత. శ్రీరామ ఆంధ్రాయణానికి సంబంధించిన వివరాలకోసం ఎందరికో ఉత్తరాల ద్వారాను ఫోను ద్వారాను సంప్రదించాను. వారు వారికి తెలిసిన సమాచారాన్ని అందించారు. కొన్ని స్థలాలకు వెళ్లినప్పుడు స్థానికులు తగు సమాచారాన్ని అందించి దర్శనీయ స్థలాలకు నా వెంట వచ్చి సహాయాన్ని అందించారు. వారందరికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. డా॥ నాగలింగం శివకుమారు గారు తెనాలిలో ఈ విషయమై వారికి అనుబంధం ఉన్న శారదా సాహితీ సాంస్కృతిక సేవా సమితి ద్వారా ఒక ప్రసంగం ఏర్పాటు చేశారు అలాగే చి॥ పెనుమూడి వెంకటసుబ్బారావు తెనాలి శ్రీ రామలింగేశ్వరుని సన్నిధిలో ఒక ప్రసంగం ఏర్పాటు చేశాడు. పెడనలో శ్రీమతి రామలక్ష్మి కిషోర్ (దంపతులు) గార్ల వలన కూడ ఒక ప్రసంగం ఏర్పాటు జరిగింది. వారందరికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ముద్రింపవలసిందిగా నన్ను ఉత్సాహపరచిన వారు శ్రీ గుత్తి కొండ సుబ్బారావు గారు, శ్రీ దివాకర్ల వెంకటేశ్వర్లు గారు! అంతే గాక వారు ఆర్థికంగా కూడ తోడ్పాటునందించారు. సాహితీ రంగంలో కృషి చేస్తున్న ఒక సోదరీమణి ఆమె భర్తగారు కలసి ఆర్థికంగా సాయపడ్డారు. ఇంకా తమదైన సహాయాన్ని అందించిన వారిలో శ్రీ ఘంటసాల నారాయణరావు గారు, శ్రీ అంబటి వీరయ్య గారు, శ్రీ యమ్.వి. నాగేంద్ర కుమార్ గారు, (ఆడిటర్) చి॥ స్వర్ణ విశ్వేశ్వరావు, చి॥ నున్న నాగార్జున, చి॥ బోలెం హరిబాబు, శ్రీ చందరాల చలపతిరావు గారు, ఇంకా ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడిన వారిలో Jeevaka Ayurvedic &Allied Products Industrial Co- society Ltd., అంగలకుదురు అధ్యక్షులు డా. సామల లక్ష్మణ బాబుగారిని తప్పక పేర్కొనాలి. ఈరచనకు అనుబంధమైన "తెలుగులో రామాయణాలు" తమ మాస పత్రికలో 5 మాసాలు వరుసగా ప్రచురించిన భవిష్యగారికి, ఈ రచనను వ్రాయుమని ప్రోత్సహించిన జోస్యుల రాంప్రసాద్ గారికి, పువ్వాడ తిక్కన సోమయాజి గారికి నా కృతజ్ఞతలు. పైన పేర్కొన్న వారందరికీ నేను ఋణపడి ఉన్నానిపిస్తుంది. భగవానుడు శ్రీరాముడు వారినీ వారికుటుంబాలను ఆయురారోగ్యైశ్వర్యాలతో అను గ్రహించు గాక అని ప్రార్థిస్తూ వారందరికి కృతజ్ఞతాంజలులు సమర్పించుకుంటున్నాను.

భవదీయుడు
గ్రంథకర్త

# గ్రంథకర్త పరిచయం


స్వర్ణ రాజ హనుమంతరావు

జననీ జనకులు : వెంకట రామలక్ష్మీ నరసమ్మ, స్వర్ణ మహా దేవయ్య.

స్వస్థలం : వానపాముల పెదపారుపూడి మండలం, కృష్ణాజిల్లా.

విద్యాభ్యాసం : S.R.R హైస్కూల్ వానపాముల.
దిగుడివాడ కాలేజ్ గుడివాడ
(ఈనాటి A.N.R. కళాశాల గుడివాడ)
ఆంధ్రాయూనివర్సిటి నుండి M.A. పట్టభద్రులు

రచనలు : ధారాపాత్ర (1961) వచన కవితా సంపుటి.
అభినేత్రి, అడవిపగడాలు - కథాసంపుటాలు
పరాన్నభుక్కులు, జీవనసంధ్యలు, నేను కుంతిని కాను - నాటికలు
నటీర్‌పూజ రవికిరణాలు - రవీంద్రుని రచనలకు అనువాదాలు
ఆకాశవాణి నుండి సాహితీ ప్రసంగాలు, సూక్తిసుధ
ఇంకా అముద్రిత రచనలు

నాట్యావధాన ప్రదర్శనలు : శత సంఖ్య

పురస్కారాలు : బందరుపట్టణ ప్రముఖలచే 1984 లో నాట్యావధాన సరస్వతి బిరుదు.
నార్ల వెంకటేశ్వర రావు అవార్డు 2004 లో

సోదరి : గం.భా. పొత్తూరి కామేశ్వరమ్మ

సోదరులు : కీ॥శే॥ రామ సంగమేశ్వరరావు
: చి॥ వెంకటప్పయ్య దీక్షితులు, శ్రీమతి ప్రభాత లక్ష్మి

కుటుంబము : **స్వర్ణ రాజ హనుమంతరావు, శ్రీమతి లక్ష్మీ సులోచన**

| | | |
|---|---|---|
| కుమార్తె | : | చి॥ల॥సౌ॥ శ్రీ సరళామహాదేవి |
| అల్లుడు | : | చి॥ డాక్టరు మేడూరి సత్యనారాయణమూర్తి |
| మనుమరాండ్రు | : | చి॥హరిప్రియసాయిశ్రీ, లలితశ్రీమాధురి, శివ ప్రియ |
| కుమారుడు | : | చి॥ లక్ష్మి నృసింహ మహాదేవ శ్రీనివాసమూర్తి |
| ద్వితీయ కుమారుడు | : | చి॥ దుర్గా ప్రసాద శ్రీకృష్ణ దత్తు |
| కోడలు | : | చి॥ల॥సౌ॥ దీపిక |
| ద్వితీయ కుమార్తె | : | చి॥ల॥సౌ॥ పద్మ నందిని |
| అల్లుడు | : | చి॥ రావినూతల సత్యనారాయణ |
| మనుమరాలు | : | చి॥ శ్రీసాయి కమలశ్రీ |
| మనుమడు | : | చి॥ మణిసాయి |

మాతృభాషను దూరం చేయటమంటే ఆ జాతి సంస్కృతిని దూరం చేయటమే

గుండె లోతుల్లోంచి వచ్చేది, మనసు విప్పి చెప్పగలిగిందీ మాతృభాషలోనే

మాతృభాషను ప్రేమిలంచలేనివాడు, మాతృదేశాన్ని ప్రేమించలేడు

అన్యభాష హద్దుమీరితే, సొంత భాషను కబళిస్తుంది

తుపాకీ శరీరాన్ని, భాష ఆత్మను లొంగదీసుకుంటుంది

ఒక భాష అంతరిస్తే, ఆ జాతి అంతరించినట్లే

స్వంత భాషపై పట్టుంటేనే పరభాషలపై పట్టు దొరుకుతుంది

కనుక

వాడగలిగిన అన్నిచోట్ల తెలుగే వాడండి

స్వాభిమానానికి సంకేతంగా తెలుగులోనే సంతకం చేయండి

భాషాభివృద్ధికి మీవంతు కృషి చేయండి

తెలుగు ఉన్నతికి **తెలుగు భాషోద్యమ సమాఖ్య** లో చేరండి

డా॥ **సామల రమేష్‌బాబు,** ప్రధాన కార్యదర్శి

**తెలుగు భాషోద్యమ సమాఖ్య**

జి2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి,

మాచవరం, విజయవాడ - 520 004.

దూరవాణి : 0866-2439466

కులం మతంకంటే భాషా జాతీయత గొప్పది




## మీరు ప్రతినెలా చదువుతున్నారా?

1993 నుండి వెలువడుతున్న

# తెలుగుజాతి పత్రిక
# నడుస్తున్న చరిత్ర

మాస పత్రిక

- దేశమంతా విస్తరించి ఉన్న తెలుగుజాతి ప్రాచీనతను, తెలుగుభాష గొప్పతనాన్ని చాటిచెపుతూ, ఆధునిక భాషగా తెలుగును వికసింపజేయాలని కోరుతున్న పత్రిక.

- ఎక్కడవున్నా తెలుగువారంతా ఒకటేనని అన్ని రాష్ట్రాలలోని తెలుగు ప్రజల గుండె చప్పళ్లను వినిపిస్తున్న వేదిక, వారికోసం జరుగుతున్న కృషికి దర్పణం.

- తెలుగు భాషోద్యమానికీ సామాజిక సంస్కరణోద్యమాలకూ ప్రగతిశీల జాతీయోద్యమాలకూ వెన్నుదన్నుగా నిలబడిన పత్రిక.




మీరు తెలుగు భాషాభిమానులు..
తెలుగు సంస్కృతి అంటే మీకెంతో ఇష్టం..
తెలుగుజాతి వారమనుకుంటే
మీ మనస్సు ఉప్పొంగుతుంది...
కనుక, **నడుస్తున్న చరిత్ర** ను
చదవకుండా మీరెలా ఉండగలరు?!




ప్రతినెలా మీ ఇంటికే పత్రిక రావాలంటే
మీరు చందాదారులుగా చేరక తప్పదు...

| | |
|---|---|
| శాశ్వత చందా | : 1000 రూ. |
| 3ఏళ్లకు చందా | : 300 రూ. |
| ఒక ఏడాది చందా | : 120 రూ. |

నేడే మనియార్డర్ / డి.డి. పంపండి.
ప్రతినెలా పత్రికను అందుకోండి.


సంపాదకుడు, **నడుస్తున్న చరిత్ర**
జి2, శ్రీవాయుపుత్ర రెసిడెన్సీ, హిందీకళాశాల వీధి,
మాచవరం, విజయవాడ-520 004.
దూరవాణి: 0866-2439466
ఇ-మెయిల్ : ncharithra@rediffmail.com



Art Flow, Tenali. 98850 26241